శ్రీ

# సుందర సందేశము

(గేయ సుందరకాండము)






కర్త :

డా॥ దివాకర్ల వేంకటావధాని

ఎం. ఏ. (ఆనర్సు) పిహెచ్. డి.

1978

ఓం

దైవతం మానుషాకారం నమస్మరుదనోకహం,
ప్రేమస్వరూపిణం వందే స్వామినం సత్యసాయినమ్.



భగవాన్ శ్రీ సత్యసాయి బాబాగారికి

# అంకితము

శ్రీసంవిత్సాగరునకు - శ్రితరక్షణ తత్పరునకు
మధుర మృదులభాషణునకు - మనుజలోకభూషణునకు
వేదధర్మపోషణునకు - విద్వజ్జన తోషణునకు
దివ్య మహిమ రాజితునకు - దీన దయా భ్రాజితునకు

కరణత్రయ పవిత్రునకు - దురిత లతా లవిత్రునకు
కేశ పాశ సుందరునకు - క్లేశ వహ్ని జలధరునకు
నిర్మలానురాగ నిధికి - నిగమాంబర కళానిధికి
మతి ధిక్కృత బృహస్పతికి - ముద్దే హ ప్రాణపతికి
సాయి మంగళాహ్వాయునకు - సర్వ దేవతా మయునకు
భక్తి పూర్ణ హృదయముతో - భరిత నిత్య వినయముతో
సుందర కాండం బను కృతి - శోభమాన గేయాకృతి
నంకితమ్ముగా నిచ్చెద - నఖిల బంధములు ద్రవచ్చెద.

ఇట్లు
భక్త పరమాణువు
దివాకర్ల వేంకటావధాని

# తొలి పలుకు

శ్రీమద్రామాయణము లౌకిక సంస్కృత వాఙ్మయమునం దాది కావ్యము. వేదవేద్యుఁడైన పరమపురుషుఁడు దశరథనందనుఁడుగా జనింపఁగా వేదము ప్రాచేతసుని ముఖమున రామాయణముగా నవతరించెనని పెద్దలు నుడువుచున్నారు.(వేదవేద్యేపరేపుంసి) దీనినిబట్టి యది వేదమునకు మాఱురూపమని వ్యక్తమగుచున్నది. సంస్కృత వాఙ్మయమున నతి ప్రాచీనములైన మహాకావ్యములు శ్రీమద్రామాయణ భారతములు రెండును మహర్షి ప్రోక్తము లగుటచేతనే "నానృషిః కురుతే కావ్య"మ్మను నభియుక్తోక్తి యేర్పడినది. ఆ రెండింటివలెఁ గావ్యప్రయోజనములను సమగ్రముగా సాధించు కావ్యము లన్యములు లేవని చెప్పవచ్చును.

సప్తకాండమండితమైన శ్రీమద్రామాయణమున నైదవది సుందర కాండము. ఇందు రామాయణ మహా మాలారత్నమని చెప్పఁబడు హనుమంతుని తేజోబలపరాక్రమాదులు వర్ణింపఁబడినవి. హనుమంతుఁడు శివాంశ సంభూతుఁడు, సుభగసుందరుఁడు, "మదంశజోమహాతేజా మహాబలపరాక్రమః, సుభగః సుందరః శూరః శంకరో భక్తవత్సలః" అని శివుఁడు హనుమంతుని గూర్చి పార్వతికిఁ జెప్పినట్లు పరాశర సంహితలోఁ గలదు. తారసారోపనిషత్తు బ్రహ్మస్వరూపమైన ఓంకారమునందలి, అ.ఉ.మ అను నక్షరములను గూర్చి చెప్పుచు "మకారాక్షర సంభూతః శివస్తు హనుమాన్స్మృత" మ్మని విశదము చేసియున్నది. హనుమంతుఁ

సహస్ర నామములలో "త్రిపాదూర్ధ్వగుఁ" డనునది యొకటి. ఇది 'త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః' అను పురుష సూక్త వాక్యమును స్ఫురింపఁ జేయుచు హనుమంతుని బ్రహ్మత్వమును విశదీకరించుచున్నది. అట్టి హనుమద్బ్రహ్మమును వర్ణించు కాండము సుందరకాండ మగుటలో నచ్చెరువులేదు. మఱియు హనుమంతుఁడు సుందరుఁడనుటకు సుందర హనుమన్మంత్రమను మంత్రము తార్కాణ మగుచున్నది. సుందరశబ్దమునకు 'సుతరా మాద్రియతే' యను వ్యుత్పత్తి కలదు. అది హనుమంతునియెడ సమగ్రముగా వర్తించును. వర్ణమత లింగ వయోవిచక్షణ లేకుండ నెల్ల వారు నామహనీయు నాదరించి భజించుటయే యిందుకు నిదర్శనము. "ఉల్లంఘ్య సింధో స్సలిలం సలీలం" అను శ్లోకమున హనుమంతుఁడు సీత శోకమును దొలఁగించిన వృత్తాంతము సుందర కాండమునందేకలదు. "సుం = సీతాయాః శోకం, దీర్యతీతి (దారయతీతి) సుందరః" అను వ్యుత్పత్తి చెప్పకొన్నను ఈ కాండమునకు సుందర కాండమను నామ మన్వర్థమగుచున్నది.

"యథా సర్వేషు దేవేషు శ్రీరామః పరమః స్మృతః
తథా రామాయణే శ్రీమాన్ సుందరః కాండ ఉత్తమః"

అను శ్లోకము రామాయణమునందలి కాండములలో సుందరకాండమునకుఁ గల వైశిష్ట్యమును వ్యక్తము చేయుచున్నది

హనుమంతుఁడు సముద్రమును దాఁటి లంకను బ్రవేశించి, సీతను గాంచి, రాక్షసులను సంహరించి, లంకను దహించి, సీతాక్షేమ వార్తను శ్రీరాముని కెఱింగించుటయే సుందరకాండమునందలి యితివృత్తము. ఇందా

త్యంతమా హనుమంతుని గుణగణములు నిపుణముగా వర్ణింపఁబడినవి. సురసా సింహికలబారి నుండి తప్పించుకొని సముద్రము నవలీలగా దాఁటుటయు, లంకిణి మద మడఁగించుటయు, రావణాదేశముచే కింకరులును, జంబుమాలియు, మంత్రికుమారులును పంచసేనాగ్రయాయులును, అక్షకుమారుడును, దన్నెదిరింపఁగా నాతఁడు వారి నేకాకియై సంహరించుటయు నాతని యపార బలధైర్య విక్రమములకుఁ దార్కాణము. బ్రహ్మయందలి గౌరవముచే నాతఁడు బ్రహ్మాస్త్ర బద్ధుఁడయ్యెను లేనిచో నింద్రజిత్తునుకూడ నాతఁడు లెక్కసేసి యుండెడివాఁడు కాఁడు. రావణసభకేగి ధైర్యముతో నాతనికి హితముపదేశించి యాతఁడా హితము వినక తోఁకకు నిప్పంటించఁగా నతఁడు లంకనంతను దహించి రాఁగల్గెను. అది యాతనికిఁదక్క నన్యులకు సాధ్యమైన పనిగాదు. రావణుఁడాతనిఁ గాంచి నందీశ్వరుఁడే యారూపమునఁ దనకడ కరుదెంచెనేమో యని భావించెను. లోక పితామహుఁడైన బ్రహ్మదేవుని రక్షోప సంహారకమైక ప్రకోపమే వానరరూపము ధరించి యట్లు వచ్చెనేమో యని యాతఁడు భయపడెను. అతని అసాధారణమైన తేజస్సంపద యట్టిది.

హనుమంతుఁడు జితేంద్రియుఁడు. అతఁడు హ్రస్వరూపమును ధరించి సీతను వెదకుటకై రావణాంతఃపురమున కరిగెను. అచ్చట స్త్రీలు మద్యపాన వివశలై వివిధములైన యవస్థలం దుండిరి. అట్టి వారిని సుప్తావస్థలోఁ జూచుటవలన ధర్మలోపమగునేమో యని యతఁ డొకప్పుడించుక శంకించెను. "నమేహి మనసః కించిత్ వైకృత్య ముపపద్యతే" అని

యాతఁడు తన్నుఁ దానోదార్చుకొనెను. ఇది యాతని జితేంద్రియతకుఁ దార్కాణము. అతని బుద్ధిమత్తకు సుందరకాండమున ననేక నిదర్శనములు గోచరించును. హ్రస్వ రూపముతో లంకానగరముఁ జొచ్చుట, సీతకు విశ్వాసము కలుగునట్లుగా నామెతోఁ బ్రసంగించి రామముద్రిక నామెకిచ్చి చూడామణిని గ్రహించుట, సీత కనఁబడనప్పుడు నిర్విణ్ణుఁడయ్యు "జీవన్ భద్రాణి పశ్యతి" యని ధైర్యము తెచ్చుకొని పట్టుదలతో సీతనన్వేషింపఁగడంగుట యిందుకు నిదర్శనములు. కార్యే కర్మణి నిర్దిష్టే యోబహూన్యపిసాధయేత్. పూర్వకార్యావిరోధేన సకర్తుం కార్య మర్హతి" యనునది యాతని యెడ సంపూర్ణముగా వర్తించును.

సీతారాములయెడ హనుమంతునికిఁగల భక్తియనిర్వచనీయమై నట్టిది. సీతను జూడఁగనే యాతఁడు "త్రైలోక్య రాజ్యం సకలం సీతా యాలానాప్నుయాత్కళా" మని భావించెను. సీత తనతో వచ్చుటయుచితము కాదని చెప్పఁనప్పుడాతఁడు "యుక్త రూపం త్వయాదేవి భాషితం శుభ దర్శనే. సదృశం స్త్రీ స్వభావస్య సాధ్వీనాం వినయస్యచ" అనియామెను బ్రశంసించెను. లంక నుండి తిరిగి వెళ్ళి రామునికి "దృష్టా సీతేతి విక్రాంతః" అని సంక్షేపముగా నెఱింగించి వియోగ వ్యథాదోదూయ మానుఁడైన యాతని ప్రాణములు నిల్పెను అంగదుఁడాతని "అహో స్వామిని తే భక్తి రహో వీర్య మహోధృతిః" అని యానంద పరవశుఁడై ప్రశంసించెను. సుగ్రీవుఁడు కూడ సీతాక్షేమ వార్త వినఁగానే "దృష్టా దేవీ న సందేహః నచాన్యేనహనూమతా" యని యాతనినే కొనియాడెను. హనుమంతుఁ డవికత్థనుఁడు. స్వామి భక్తుఁడు. అహంకారదూరుఁడు. వాక్య విశారదుఁడు. మతి మద్వరిష్ఠుఁడు. ఆతని సుగుణ రత్నములకు రత్నాకరము సుందరకాండము.

వాల్మీకి గాయత్రీ మంత్రము నందలి యిరువది నాల్గక్షరములను గ్రహించి యొక్కొక్క యక్షరమున కొక్కొక్క వేయి శ్లోకముల చొప్పున రామాయణమున నిరువది నాల్గువేల శ్లోకములను రచించెను. "శర్తురంకా త్సముత్పత్య సీతాకమలలోచనా" యను త్రిజటా స్వప్నము నందలి శ్లోకము 12001వ శ్లోకము అది రామాయణము నందలి మధ్య భాగము. త్రిజట తన కలను వక్కాణించుచు రాముని దర్శించిన దృశ్యములు నాలుగు వర్ణించెను. మొదట నాతఁడు గజ దంతమయమైన శిబికను హంస సహస్ర యుక్తమైన దాని నధిష్ఠించినట్లుగను, తరువాత చతుర్దంతములుగల గజము నధిష్ఠించినట్లుగను, పిమ్మట పాండు వృషభయుక్తమైన రథము నధిష్ఠించినట్లుగను, అనంతరము పుష్పక విమానము నధిష్ఠించినట్లును ఆమెకు గోచరించెను. గజమన నెనిమిదికిని దంతమన ముప్పది రెండునకును సంజ్ఞలుగా గ్రహించి రామునికి గాయత్రీ పరబ్రహ్మముతో నభేదము చెప్పవచ్చును. గాయత్రి "హంస స్థితా, గరుడారూఢా, తతో వృషభవాహనా" యని చెప్పఁబడినది. ఆ విషయ మిక్కడ సరిగా సరిపోవుచున్నది. ఇంద్రునికిఁ గల భోగ లక్షణాదు లుపేంద్రునికిఁ గూడఁ జెప్పుట పురాణములందుకనఁబడుటచే గాయత్రి యైరావతారూఢ యని వర్ణింపఁబడుటలో విప్రతిపత్తి లేదు. చతుర్దంతమైన గజమైరావతమే. ఈ విధముగా త్రిజటా స్వప్నము గాయత్రీమంత్రార్థ గర్భితమైయున్నది. అదియునుగాక గాయత్రీ మంత్రము నందలి మధ్య వర్ణము 'స' సుందర కాండము నందలి'' సనిర్జిత్య పురీం శ్రేష్ఠాం" అను శ్లోకము మొదట నున్నది. సుందరకాండమే ఒక మహామంత్రమని చెప్పువారును గలరు.

కావ్య దృష్టితోఁ జూచినను సుందరకాండ ముదాత్త వర్ణనముల తోడను, నవరస పోషణముతోడను గూడిన మహాకావ్యము వలెఁ గనిపించును. సముద్ర నగరారామావరోధస్త్రీ దౌత్య యుద్ధవిరహ చంద్రోదయాదులిందు సుందరముగా వర్ణింపఁబడినవి. వాల్మీకి వర్ణించిన లంకానగరమిందు సర్వలక్షణ సంభరితము నాగరికతా సంపన్నమునైన రాజధానివలెఁ గనిపించును. వీరరౌద్ర కరుణ బీభత్సాద్భుత భయానక హాస్యరసములిందు సముచితముగాఁ బోధింపఁబడినవి. రావణుఁడు వచ్చి సీతతోఁ బ్రసంగించు సందర్భమున శృంగారాభాసము పరాకాష్ఠ నందినది. వానరులు మధువనమును బ్రవేశించిన తఱి హాస్యమును, లంకాదహన సందర్భమున భయానక బీభత్సములును, సముద్ర లంఘన ఘట్టమున నద్భుతమును, హనుమ తన్నెదిరించిన రాక్షసులతో యుద్ధ మొనరించు సందర్భమున వీరరౌద్రములును, సీత దుఃఖించునపుడు కరుణమును గోచరించుచున్నవి. సుందరకాండమునందలి పెక్కు శ్లోకము లుదాత్త భావ గర్భితములై మనోహరముగా నుండును. "ఊరు వేగోద్ధతాన్వృక్షా ముహూర్తం కపిమన్వయుః, ప్రస్థితం దీర్ఘ మధ్వానం స్వబంధు మివ బాంధవాః" మున్నగు శ్లోకము లందుకు నిదర్శనములు. హనుమ సీతను జూచినప్పుడు "ఆస్ఫోటయామాస చుచుంబ పుచ్ఛం......నిదర్శయన్ స్వాం ప్రకృతిం కపీనాం" అను శ్లోకమద్భుతమును నత్యంత సహజమునై యున్నది. హనుమంతుఁడు సీతతో "దృష్ట్వా ఫలం వాప్యం వా యద్వ్యాన్యత్సు మనోహరం, బహుశోహ ప్రియేత్యేవశ్వసంస్త్వామభి భాషతే." అనిద్రస్స తతం రామః సుప్తోపిచ నరోత్తమః. సీతేతి మధురాం వాణిం వ్యాహరన్

ప్రతి బుధ్యతే" అని చెప్పినప్పుడు సీత, "అమృతం విషసంసృష్టం త్వయావానర భాషితమ్. యచ్చనాన్యమనారామః యచ్చ శోక పరాయణః" అని సీత వల్కిన పల్కులామె మనోవేదన నెంతో చక్కగా వ్యక్తము చేయుచున్నవి. చంద్రుని వర్ణించునప్పుడును విరహకృశయైన సీతను వర్ణించునప్పుడును మహర్షివాడిన యుపమానము లాతని లోక పరిశీలనమును, అపూర్వ భావనా శక్తిని వ్యక్తము చేయుచున్నవి. కాళిదాసాది మహాకవులు కూడ వాని యందలి సౌందర్యౌచిత్యముల కలరి వానిని యథోచితముగా ననుకరించి రనుటకు దృష్టాంతము లున్నవి. ఈ విధముగా సుందరకాండము తాత్త్వికమహిమయందే కాక కవితా కౌశలమునందును అద్వితీయమై యలరారుచున్నది.

ఇది శ్రీమద్వాల్మీకి మహాముని విరచిత శ్రీమద్రామాయణమునందలి సుందరకాండమునకు ఆంధ్రగేయరూపమైన అనుసరణము; సన్నిహితాంధ్రీకరణము కాదు. కాని ఆదికవి రచనయందలి ముఖ్యములైన కథాంశములను కాని, ఉపమానాదులను కాని యిందు విడువలేదు. "నామూలం విఖ్యతేకించి" తనునట్లు మూలమునందు లేనిదానిని నిందు చేర్చలేదు. దీనిని చదివి యెల్లరును శ్రీమద్రామాయణ సుందరకాండమునందలి పరమార్థము నెఱుంగవచ్చును; తత్పరన పారాయణ ఫలమును కూడ పొందవచ్చును. ఆదికవి రచన ననుసరించియే యిందు శ్రీ గాయత్రీ మహామంత్రమందలి సుందరకాండమున వచ్చు బీజాక్షరములు కూడ యథాస్థలమున చొప్పింపఁబడినవి.

1. సన్నిర్జిత్య పురీం శ్రేష్ఠాం లంకాం తాం కామరూపిణీమ్
2. ధన్యా దేవా స్సగంధర్వా స్సిద్ధాశ్చ పరమర్షయః
3. మంగళాభిముఖీ తస్య సాత దాసీ న్మహాకపేః

అను మూఁడు శ్లోకపాదముల మొదటనున్న స, ధ, మ అను మూఁడక్షరములును గాయత్రీ మహామంత్రమునందలి 'భర్గో దేవస్య ధీమహి" అను పాదమునందవి 5, 6, 7 వర్ణములు.

సుందరే సుందరో రామః
సుందరే సుందరీ కథా
సుందరే సుందరీ సీతా
సుందరే సుందరం వనమ్
సుందరే సుందరం కావ్యం
సుందరే సుందరః కపిః
సుందరే సుందరం మంత్రం
సుందరే కిం న సుందరమ్.

అనునట్లు సుందరకాండమున సుందరము కానిదేదియు లేదు. అది ఆద్యంతసుందరము. ఆదికవి రచన యందలి సౌందర్యమంతయు నందు కాననగును. ఒక్క సుందరకాండమును పఠించినను శ్రీ మద్రామాయణము నంతను పఠించిన ఫలము సమకూరునని పెద్దలు

చెప్పుదురు. దీనికి కారణము లేకపోలేదు. సుందరకాండ కథతోపాటంతకు ముందును తరువాతను జరిగిన రామాయణకథ యంతయు ఇందు సూచింపఁబడినది. 31-౬4 సర్గముందు హనుమంతుఁడు తాను సముద్రమును దాఁటి లంకకరుదెంచి సీతను గాంచుపఱకుగల రామాయణకథ నంతను ఎఱిఁగించును. యుద్ధకాండ కథా సూచనకూడ నిందుకలదు. ఈ విధముగా సుందరకాండమును సంక్షిప్తరామాయణమనియు చెప్పవచ్చును.

దీనికి సుందర సందేశమను పేరు పెట్టితిని. ఇచ్చటి సుందర శబ్దమునకు హనుమంతుఁడని యర్థము. ఆ విషయము ముందెఱింగింతును. అతఁడు రాముని సందేశమును సీతకును, సీత సందేశమును రామునకును ఎఱింగించెను. అతని దౌత్యమూ పుణ్యదంపతుల జీవితములు నిలఁబెట్టెను. సంస్కృతమునందలి సందేశకావ్యములలో శ్రీమద్రామాయణాంతర్గతమైన సుందరకాండమే మొదటి సందేశకావ్యము. దీనిని చూచిన పిమ్మటనే కవి కులగురువు కాళిదాసు మేఘసందేశమును రచించెనని అభిజ్ఞులు తెల్పుదురు. అందుచే దీనికి సుందరసందేశమను నామముంచితిని. హనుమన్నామము, సుందరకాండనామము, కావ్యవస్తువైన సందేశము-ఈ నామము వలన పఠితుల స్మృతికి రావలెనని నా యుద్దేశము. హనుమంతుడు సీతారాముల కందిచ్చిన సందేశముతోపాటు ఆదికవి లోకమునకిచ్చిన సుందర సందేశము కూడ నిందున్నది. అతఁడీ కాండమున 'జీవన్ భద్రాణి పశ్యతి' మున్నగు వాక్యములతోఁగూడిన శ్లోకము లెన్నో రచించెను. అవి జిజ్ఞాసువులకు పరమ సందేశములు.

భట్టుమూర్తి హనుమంతుని గూర్చి వ్రాయుచు "అక్ష శిక్షా ప్రౌఢి నలరారె నెవ్వాఁడు రణముచే నియమధారణముచేత" అని శ్లేషచే నతని జితేంద్రియతను నియమధారణమును సూచించెను. హనుమంతుఁడు వట్టి కోతికాదు. మహాయోగి, ఆ యోగమహిమచేతనే అతఁ డన్య దుష్కరము లైన మహాకార్యము లొనరించెను. సముద్రలంఘనము, లంకాదహనము మున్నగు కార్యములు యోగైకసాధ్యములు. అందుచే వానిని సూక్ష్మముగా పరిశీలంపక విమర్శింపరాదు.

''న శబ్ద బ్రహ్మోత్థం పరిమళ మనాఘ్రాయ చ జనః
కవీనాం గంభీరే వచసి గుణదోషా రచయతు"

అని మురారి మహాకవి యన్న వాక్యమును దేనినైన విమర్శించుటకు ముందు తలంపవలయును.

సుందరదాస సార్థక బిరుదాంకితులు మహాభక్తులు, ఆ సుందర వానరమూర్తిని దర్శింపజాలినవారు, గాయన సార్వభౌములు నైన శ్రీ యమ్. యస్. రామారావుగారు సుందరకాండమును గేయరూపమున రచించిరి. పలుచోట్ల గానముచేసి శ్రోతల నలరించిరి. వారికది జీవనోపాధి. ఇతరులు కూడ దానిని పాడనారంభించినచో వారి కసౌకర్యము కలుగవచ్చును. అందుచే నా యనుమతితో పఠించి ఆనందము నొందుటకును ఐహికాముష్మిక శ్రేయముల నందుటకును గేయరూపమైన యీ సుందరసందేశమును వ్రాసితిని. ఈ రచనకు ప్రేరకులైన గురుమూర్తులు వారు. వారికిభక్తి శ్రద్ధా వినయములతో నంజలింతును.

ఈ సుందరకాండ రచిననునకు ప్రేరేచిన యితరులను దీనినిట్లు ముద్రింపించినవారిని కృతజ్ఞతా పూర్వకముగా నిట స్మరింపవలసి యున్నది. శ్రీ చివుకుల సత్యనారాయణమూర్తి ఎం. ఎ. బి. ఇడి. గారున్నత పాఠశాలలో ప్రధానోపాధ్యాయులు. అపార భక్తిసంపన్నులు. సంగీతమునందు కూడ వారికి ప్రావీణ్యముకలదు. ఆకాశవాణిలో వారు పలుసార్లు గానమొనరించి శ్రోతల నలరించి యుండిరి. వారు భక్తిపూర్వకముగా పాడుకొనుటకు సుందరకాండమును వ్రాసి యిమ్మని కోరగా నిది వ్రాయ సంకల్పించుచుండిన రటి నితరప్రేరణము లనేకములు కల్గినవి. వాని నన్నిటిని ఇచ్చట వ్రాయను. ఒక్కటి మాత్రము వ్రాయకతప్పదు. నేను సుమారొక సంవత్సరమునుండి అస్వస్థుడనై యుంటిని. ఆ సమయమున సుందరకాండమును వ్రాయుట యిహపరములు రెండింటికిని మంచిదని తలంచి దానిని వ్రాయుదమని ఆలోచించుచుంటిని.

హైదరాబాదుజిల్లా విద్యాశాఖాధికారులును భక్తవరేణ్యులును, సంగీత సాహిత్య ప్రియులును; రసజ్ఞవరేణ్యులును, సౌజన్యమూర్తులు నైన శ్రీ ఆచార్య డి. సి. వేంకటసుబ్బన్నగారును, శాసనసభా సభ్యురాలగు శ్రీమతి సుమిత్రాదేవిగారును, శ్రీ ఎ. హనుమంతరావుగారును (ఉపాధ్యాయులు, నాకు శిష్యులు) తదితరోపాధ్యాయులును ఒకసారి నన్నాహ్వానించి సుందరకాండమును గూర్చి యుపన్యసింపకోరిరి. నేనట్లే యొనర్చితిని అది వినిన పిమ్మట శ్రీ సత్యనారాయణమూర్తిగారి యెడ నున్న ప్రేమచే వారు కూడ నన్ను సుందరకాండమును గేయరూపమున వ్రాయఁ గోరిరి. గేయరచనమున నారితేరినవాఁడను, సంగీతజ్ఞుఁడను కాకపోయినను వారి కోరిక కాదనలేక అట్లే వ్రాసెదనంటిని. అంటినిగాని వెంటనే

వ్రాయుట కారంభింపలేదు. 1978 డిసెంబరునెలలో శ్రీ భద్రాచల రాముని దర్శించుట కరుగ నచ్చట పదిమంది వైష్ణవులు కూడి సుందర కాండము పారాయణ మొనరించుచుండిరి. అది విన్నప్పుడే "శ్రీ వాల్మీకి మునీంద్రులు దయతో తెల్పిన రాముని దివ్యకథా, నే తెల్పెద రాముని దివ్య కథా" అను మకుటము స్ఫురించినది. శ్రీరామచంద్రుని దర్శించి యింటికరు దెంచితిని. అప్పటినుండియు హనుమంతుడు నన్నూరకుండనీయలేదు. ప్రతి దిన మొకసారియైన ఆ విషయము జ్ఞప్తికి తెచ్చుచుండెను. డిసెంబరు 18వ తేదీని ఉదయమేలేచి ప్రార్థనాదికము వ్రాసితిని. నాఁడు మొదలు ప్రతిదినము నిద్రనుండి మేల్కాంచఁగనే మఱేయేవిషయములాలోచింపక రచ నచేయ నారంభించితిని. రేపు శివరాత్రి యనఁగా (1978 మార్చి 7)458 గేయము లుగా సుందరకాండమునంతను పూర్తి చేసితిని. వ్రాఁతప్రతి తలక్రింద పెట్టు కొని పండుకొంటిని. తెల్లవాఱుజామున మద్భాగ్యవశమున శ్రీ భగవాన్ సత్యసాయిబాబాగారు కలలో కనిపించిరి. శ్రీవారికి నేనెన్నోవిధముల ఋణపడియుంటిని. వారికి నాయెడఁగల దయా వాత్సల్యములు లపారములు. వారినెప్పుడు స్మరించుచునే యుందును. కలలో వారు కనఁబడగనే తల క్రింద నున్న సుందరకాండ ప్రతిని వారి పాదపద్మములపై నుంచి "దీనిని తమకంకితము చేయుచున్నాను. గ్రహింపవలె"నని ప్రార్థించి ఏదో యుపన్యాస మారంభించితిని. అదియంతయు సుందరకాండమునకు సంబం ధించినదే. అప్పుడేమి చెప్పితినో నాకు జ్ఞాపకములేదు. స్వప్నముకదా! శ్రీ భగవాన్ నన్ననుగ్రహించి కృతిగ్రహించి అంతర్హితులైరి. నేను మేల్కాంచి నాయెదుట నున్న శ్రీ భగవాన్ విగ్రహమును మాత్రము

గాంచితిని. తరువాత వెంటనే శ్రీ భగవాన్‌పై అంకితపు గేయము వ్రాసి ఫలశ్రుతియు మంగళాచరణమును వ్రాసితిని. శ్రీ భగవాన్ మార్చి 16వ తేదీని హైదరాబా దరుదెంచిరి. 18వ తేదీ ఉదయము స్వయముగా వారికి కావ్యమంకితముచేసి అనుగ్రహము పొందుటయేకాక శ్రీ సత్యనారాయణ మూర్తి బృందమువారిచే 15 నిమిషములు కొన్ని గేయములు పాడించితిని. శ్రీ స్వామి దానినిగూర్చి యేమనుకొనిరో నాకు తెలియదు. అప్పటికింకను కావ్యము ముద్రణమున కీయలేదు.

శ్రీ సత్యనారాయణమూర్తిగారు కోరగా శ్రీ గోస్వామి తులసీదాస కృత హనుమాన్ చాలీసా గూడ ననువదించి యిందు ముందు చేర్చితిని.

ఈ గ్రంథమును శ్రీరామనవమికి (ఏప్రిల్ 17) ముందుగా ముద్రించి భక్తుల కందఁజేయవలెనని అభిలషించితిని. ఒక ముద్రణాలయమున కిచ్చితిని. కర్ఫ్యూవలనను తదితరకారణములవలనను వారు 272 గేయములవఱకే ముద్రింపఁగలరని తెలిసికొని మిగిలిన గేయములను 15వ తేదీలోపుగా ముద్రించి యిమ్మని మిత్రవర్యులు ప్రగతిగీతా ప్రెస్సు స్థాపకులునైన శ్రీ డా. నండూరి రామకృష్ణమాచార్యులవారిని, భక్తితత్పరులు ఇంజనీర్లుగా నున్నవారునైన వారి కుమారులు గోవిందరాజుగారిని ప్రార్థించితిని. వారుదయతో నంగీకరించి 4రోజులలో తుది వందపుటలను ముద్రించియిచ్చిరి. వారికెట్లు కృతజ్ఞత తెల్పుకొనవలయునో నాకు తెలియదు.

ఈ గ్రంథమున నుచిత సందర్భములందు కొన్ని చిత్రములను కూడ వేయవలె ననుకొంటిని. అది వ్యయసాధ్యమైనపని. సికింద్రాబాదు నందలి శ్రీరామా బుక్ డిపో, శ్రీరామా పవర్ ప్రెస్సుల యజమానులు

భక్త వరేణ్యులునైన శ్రీ పబ్బా శంకరయ్య శ్రేష్ఠిగారికిని నాకును ఇరువది యైదేండ్ల పరిచయము. పలు సందర్భములందు వారు నాకొనర్చిన ఉపకారమును నేనెప్పుడును మఱవను. వారు శ్రీ మదిపడగ బలరామాచార్యులు గారిచే (కవికళాకారులు) వేయించిన చిత్రములతో హనుమాన్ చాలీసా సుందరముగా ముద్రించి యుండిరి. అందలి నాలుగు చిత్రములు సుందరకాండ సంబంధములు. మిగిలిన మూఁడు చిత్రములను (అంగుళీయకప్రదానము, చూడామణి ప్రదానము, రావణహనుమత్సంభాషణము) వేసి యిమ్మని శ్రీ బలరామాచార్యులవారినే ప్రార్థించితిని. వ్యవధిలేకున్నను వారు వానిని నాయందలి దయతో వెంటనే వేసి యిచ్చిరి. శ్రీ మూర్తి ప్రోసెస్‌వారు బ్లాకులు చేసియిచ్చిరి. ఈయేడు చిత్రములను (అందు నాల్గు త్రివర్ణ చిత్రములు) అట్టమీఁది త్రివర్ణ చిత్రమును ఒక్కొక్కటి నాలుగు వేలు ప్రతులు శ్రీ పబ్బా శంకరయ్య శ్రేష్ఠిగారు తమ ముద్రణాలయమున ముద్రింపించి యిచ్చిరి. శ్రీ బలరామాచార్యులవారియు, మూర్తి ప్రోసెస్ వారియు, శ్రీ పబ్బా శంకరయ్య శ్రేష్ఠిగారియు దయలేనిచో నీ గ్రంథమునిట్లు ముద్రింపించి యుండజాలెడి వాఁడనుకాను. వారి కందఱికి నా హృదయపూర్వకాశీర్వాదములతోఁ గూడిన కృతజ్ఞతలు.

శ్రీ ఏ. హనుమంతరావుగారు (సార్థకనామధేయులు) మహాభక్తులు; ధర్మసంస్థకు ప్రధాన కార్యదర్శులు. దీనిని ముద్రించుటకగు వ్యయమునంతను వారును (వారెవరెవరినుండి తెచ్చిరో తెలియదు) మదాప్తమిత్రులు శ్రీ జూపూడి గోపాలకృష్ణారావుగారును భరించిరి. వారికి కృతజ్ఞతలు మాత్రము చెప్పుకొనుట యెల్లరును సాధారణముగా చేయుపని. శ్రీ సీతారామచంద్రులును హనుమంతుఁడును వారిపై నిరంతర కరుణావర్షము

సురియింతురుగాక! ఇట్లు ప్రార్థించుట తప్ప నేనేమి చేయఁగలను? ఈ గ్రంథమునకు కావలసిన కాగితమును సిరిపూర్ పేపరు మిల్లు వారిచే కొంత తక్కువధర కిప్పించిన వారైదుగురు: శ్రీ భండారేగారు, శ్రీ భండారేగారు. వారిపుత్రులు శ్రీ భండారేగారు, శ్రీ వామనరావుగారు, శ్రీ యస్.ప్రసాదరావుగారు. వారి యౌదార్యమువలన గ్రంథము నెక్కువ ప్రతులు ముద్రించుట కవకాశము కలిగినది. వారికి నాహార్దములైన కృతజ్ఞతలు.

ఆం. ప్ర. దేవాదాయ ధర్మాదాయ శాఖ కధ్యక్షులు శ్రీ పురుషోత్తమ నాయుడుగారు. వారు గుణగణములచే, భక్తిసంపదచే, నౌదార్యముచే నా అధ్యక్షతకు తగినవారు. వారికి నేను రచించిన సుందర సందేశమును చూపి అందలి కొన్ని భాగములు నినిపించి సాధ్యమైన సాయమర్థించితిని. వారు దయతో కొన్ని దేవస్థానముల సాహాయ్యమున నైదారు వేల ప్రతులు ముద్రించుటకు కాని, ముద్రితములైన ప్రతులను కొనిపించుటకు కాని యత్నించెదనని ప్రోత్సాహ మొసంగిరి. పురుషోత్తములైన వారికి పురుషోత్తముఁ డాయురారోగ్యైశ్వర్యము లొసంగి యితోఽధిక ధర్మకార్య నిర్వహణమునకు తగిన శక్తి సంపద లొసంగుఁగాక!

ఏతద్గ్రంథ రచనా ముద్రణాదు లీవిధముగా సాగినవి. సాహాయ్య మొనరించిన వారెంతోమంది. లిఖితప్రతిని తప్పులు లేకుండ ముద్రణానుకూలమైన ప్రతిని వ్రాసి యిచ్చినవారు శ్రీ కే. శ్రీనివాసాచారిగారు; ప్రూఫులకొఱకు హైదరాబాదు పలుసార్లు తిరిగివచ్చిన వారు శ్రీ రాజేశ్వర రావుగారు; శ్రీవిద్యా ఆర్ట్ ప్రింటర్సులో కొన్ని పుటలు ముద్రించినవారు శ్రీ శర్మగారును శ్రీ పెంటయ్యగారును శ్రీమతి జ్యోతిగారును; ఈ గేయ.

ములకు రాగములను స్వరములను ఏర్పఱిచి తండ్రిగారికి నిరంతర సాహాయ్య మొనర్చినవారు శ్రీ బి. చివుకుల సుబ్రహ్మణ్యంగారు; నేనే పని చెప్పిన దానిని సాధించి ముద్రణమున కానుకూల్యము కల్పించినవారు శ్రీ కామేశ్వరరావుగారు: గ్రంథముద్రణమున కితర సాహాయ్యము కావించినవారు శ్రీ బాలకృష్ణశాస్త్రి, శ్రీ వేంకటేశ్వరస్వామి, శ్రీ వి. రాజరత్నము గార్లు. వీరందఱికిని నా హృదయపూర్వక నమస్కారములు.

బీజకాండ మితి ప్రోక్తం సర్వరామాయణేష్వపి
తస్మాత్ పారాయణం కృత్వా ధన్యా భవత తత్త్వతః

అను పరాశరసంహిత యుపదేశము ననుసరించి ముముక్షువులు దీనిని పారాయణ మొనరించి ధన్యులగుదురుగాక.

దివాకర్ల వేంకటావధాని

# శ్రీ హనుమాన్ చాలీసా

శ్రీ హనుమంతా! శివాంశ జాతా!

భూరికరుణ కావుము జగ మంతా

శ్రీ గురుపద[1] సరసీరుహ రజమున

నిర్మల మొనరిచి నిజహృన్ముకురము[2]

వర్గచతుష్టయ ఫలప్రదంబును[3]

వర్ణింతును రఘువరు సితకీర్తిని

సంకటహరణా! శ్వసన నందనా![4]

మోహన మంగళ మూర్తివిలాసా!

జనకసుతా లక్ష్మణ రాములతో

వసియింపుము నా భావపీఠమున —శ్రీహను—

---

1. శోభాయుక్తమైన గురువుగారి పాదము లనెడి పద్మముల పుప్పొడితో 2. తన హృదయ మనెడి అద్దము 3. ధర్మార్థ కామమోక్షములను ఫలము నొసంగు 4. వాయుకుమారా.

జయ హనుమా గుణసంవిత్సాగర![5]
జయ కపివర్యా జగత్ప్రభాకర![6]

రామదూత అప్రతిమాభిఖ్యా![7]
అంజనిపుత్రా అనిలసుతాఖ్యా!

వరబలవిక్రమ వజ్రశరీరా
సుమతివర్ధనా కుమతివిదారా

ఛర్మవర్ణ విభ్రాజితవేషా
కుండలశోభిత కుంచితకేశా —శ్రీహను—

వజ్రహస్తశుంభచ్చారుధ్వజ[8]
ఊర్ధమ్ముంజ యజ్ఞోపవీతభుజ![9]

గిరిశాంశభవా కేసరినందన
తేజోవిక్రమ త్రిజగద్వందన

విబుధా! సుగుణాన్విత! అతిచతురా!
రామకార్య నిర్వహణ తత్పరా!

ప్రభుచరిత్ర సంశ్రవణాసక్తా
రామలక్ష్మణ ధరాజాచిత్తా![10] —శ్రీహను—

---

[illegible] గుణములు జ్ఞానములు అనువానికి సముద్రుడా 6 లోకములకు కాంతి కలిగించువాఁడా 7. సాటిలేని ప్రసిద్ధి కలవాఁడా 8. వజ్రములవంటి చేతులయందు ప్రకాశించు అందమైన జెండా కలవాఁడా 9. వహించిన ముంజ దర్భల జందెముతోఁ గూడిన భుజము కలవాఁడా 10. సీత,

తనురూపిగ సీతకు కనిపించితి
ఘనరూపిగ లంకను దహియించితి

ఘోరాకృతి సోకులను[11] హరించితి
రామచంద్రుు కార్యము నొనరించితి

సంజీవిని లక్ష్మణు బ్రతికించితి
క్షితిజాపతి కౌగిలి గడియించితి

రఘుపతి నిను కడు ప్రశంస చేసెను
భరతసమానుడ వని వచియించెను —శ్రీహను—

వేమొగముల నిను వినుతు లొనర్చెను
క్షితిజాపతి కౌగిట గదియించెను

కంజజాది సనకాది మునీశులు[12]
నారద శమన కుబేర దిగీశులు

కవికోవిద వాక్పన్నగపాలురు
నీ యశమును వర్ణింపఁగఁ జాలరు

కపిరాజున[12] కుపకార మొనర్చితి
రాము చేర్చితివి రాజ్యము కూర్చితి —శ్రీహను—

---

11. రాక్షసులను 12. బ్రహ్మ మొదలైనవారు సనకుఁడు మొదలైన మునీంద్రులు 12. సుగ్రీవునకు.

విని నీమంత్రము[13] విభీషణుఁడు మును
కనఁజాలెను లంకారాజ్యంబును

శతదశయుగ[14] యోజనగతు భానుని
గ్రహియించితి రుచిరం బగు ఫల మని

ప్రభుముద్రిక వక్త్రమునం దుంచుక
వార్థి దాటి తంత్రము లే దించుక

అవని దుర్గమం బగు పని నీదగు
దయాబలముచేతను సుగమం బగు —శ్రీహను—

రాము ద్వారపాలకు నిను కాదని
ప్రాసాదము చొర రా దెవ్వరికిని

నిఖిలసుఖము లిడు నీ శరణం బది
నీవు ప్రాపుగా[15] నేల భయము మది

నీవ భరింతువు నీ తేజంబును
చలించు నీ గర్జకు త్రిజగంబును

త్వన్నామము వినఁబడునో యెప్పుడు
సమసెడి భూతపిశాచము లప్పుడు —శ్రీహను—

---

**28.** ఆలోచన 14. 2 వేల యోజనముల దూరమందున్న 15. ఆధారము కాఁగా.

వీరహనుమను జపింప నశించును
పీడలు వ్యాధులు వేగ హరించును[16]

మనసున వాక్కున హనుమ తలంచిన
అఖిలసంకటము లతడు హరించును

రాముడు సన్మునిరాజుల బంధువు
నీవు తత్కృతులు నెఱపుచు[17] నుందువు

ఎవ రే కోర్కుల నెద వాంఛింతురు
వారమితము మను ఫలమును[18] గాంతురు — శ్రీహను—

ఔజ్జ్వల్య[19] మలరు నట్లు జగమ్ముల
వెల్గు నీ ప్రతిభ నాల్గు యుగమ్ముల

సకలసాధు సజ్జన రక్షకుడవు
దనుజహరుడు[20] రామునకును ప్రియుడవు

ఎనిమిది సిద్ధుల నిత్తువు నవనిధి
భూజనుండి[21] నీ వొందితి వరవిధి

రామ రసాయన లాభభాసుడవు[22]
నీవు రామునకు నిత్యదాసుడవు — శ్రీహను—

---

16. బోవును 17. చేయుచు 18. జీవిత ఫలమును 19. ఉజ్జ్వలత్వము 20. రాక్షసులను హరించువాడు 21. సీతనుండి 22. రాముని రసమైన రసాయనము యొక్క లాభముచే ప్రకాశించువాడవు.

నిను భజింప రామున కించును[23] మది
జన్మదుఃఖ విస్మారక మగు నది

ఎట పుట్టిన హరి నెద భజియింపుఁడు
చివర రాముపురి చేరి సుఖింపుఁడు

అన్యుల తలపక అనిలజు కొల్వుఁడు
అతఁ డిడు సర్వసుఖావళి నందుఁడు

హనుమను బలవీరుని స్మరియించిన
సకలార్తులు[24] క్లేశములు హరించును —శ్రీహను—

శ్రీహనుమా! జేజేలను[25] కొనుమా
సురుకైవడి నను కరుణను గనుమా

ఎవరు నూరు సార్లిది పఠియింతురు
వారు ముక్తిసుఖపాళి గడింతురు

శ్వసనజు చాలీసా[26] పఠించు గుణి[27]
గిరిజేశుల[28] సాక్షిగఁ గను సిద్ధిని

తులసీదాసుని వలె హరిదాసుడ
స్వామి నాహృదయసీమ వసింపుఁడు —శ్రీహను—

---

23. ప్రీతి కలిగించును 24. ఆర్తి దుఃఖములు 25. నమస్కృతులను
26. హనుమంతుని చాలీసా (40) 27. గుణవంతుడు 28. పార్వతీ శివుల

శ్రీ వాల్మీకి మునీంద్రులు దయతో

తెలిపిన రాముని దివ్యకథా, నే

తెలిపెద రాముని దివ్యకథా

శ్రీ

# సుందర సందేశము

శ్రీవాల్మీకిమునీంద్రులు దయతో
తెలిపిన రాముని దివ్యకథా, నే
తెలిపెద రాముని దివ్యకథా.

1

శ్రీరమణీప్రియు శేషతల్పశయు[1]
గిరిజావరు ఫణిధరుని శంకరుని
పలుకులవెలంది చెలువుని నలువను[2]
విఘ్నతమో దినవిభు [3] నిభవదనుని
చంద్రసూర్యులను సకలవిబుధులను
మతిమద్వరు మారుతి హనుమంతుని
సంస్కృతాంధ్ర భాషా కవిచంద్రుల
నమితభక్తి హృదయంబున భజించి ॥శ్రీ॥

2

రమణీయం బగు రామాయణమున
బీజకాండ మను పేరు గాంచినది
పవననందనుని పరాక్రమంబును
తెల్లముగా విశదీకరించునది
ధరణీతనయకు దశరథసుతునకు
నొండొరువుల కుశలోక్తి తెల్పినది
కమనీయాద్భుత కవితా రసమును
చూఱ లిచ్చునది సుందరకాండము ॥శ్రీ॥

---

1. విష్ణువును 2. బ్రహ్మను 3. విఘ్నములనెడి చీకటికి సూర్యుడైన వినాయకుని

3

సుందరమౌ కథ, సుందరి జనకజ
సుందరుఁ డినకులసోముఁడు రాముఁడు
సుందరుఁడౌ కపి, సుందరము వనము
సుందరములు కపివీరుల చేఁతలు
సుందర మంబుధి,[1] సుందరము కవిత
సుందర మసురపురందరు నగరము [2]
సుందరకాండమునం దాదరమున
గమనించిన నెది కాదు సుందరము ? ॥శ్రీ॥

4

పృథ్వీతనయను వెదకఁగ నల్దెస
లకు పంపెను కపులను సుగ్రీవుఁడు
అందు నంగదుం డధిపతిగా ద
క్షిణమున కరిగిరి హనుమత్ప్రముఖులు
ఆదెస నంతయు నన్వేషించియు
జనకజాత కనఁజాలక వారలు
ప్రాణంబులపై నాశ వదలుకొని
ఉండిరి వగ ప్రాయోపవిష్టులై ॥శ్రీ॥

---

1. సముద్రము 2. రాక్షసేంద్రుని నగరమైన లంక.

5

అంత జటాయువు నగ్రజన్ముఁ[1] డగు
పక్షివరుఁడు సంపాతి వారిఁ గని
తమ్ముని మరణోదంతమ్మును విని
వగచి వగచి ఆశ్వాసితాత్ముఁడై
లంకేశ్వరుఁ డగు రావణాసురుఁడు
సీతను లంకకు చేకొని చని యట
నశోకవనిలో నాశరకాంతల [2]
నడుమ నుంచె నని నుడివెను వారికి. ॥శ్రీ॥

6

కపు లుత్సాహము కడలుకొనంగా
లంకకుఁ జేరి ధరాసుత కనుఁగొన
శతయోజన విస్తృత మగు వార్నిధి
కోరి దాట తత్తీరము చేరిరి
కడలి దాట శక్యమె యని కపు లన
జాంబవంతుఁ డుత్సాహము గొల్పెను
పవనసుతుఁకు తనబలము గుర్తెఱిఁగి
అంబుధి దాటఁగ నాయితుఁ[3] డయ్యెను ॥శ్రీ॥

---

1. అన్న 2. రాక్షసస్త్రీల 3. సిద్ధుఁడు.

7

అన్యదుష్కరం బైన కార్యమును
చేయఁ దలఁచి తన శిరమును కంఠము
నెత్తి యొప్పె వృషభేంద్రుని[1] వలె కపి,
పైడూర్యాంబునిభఁబుల శాద్వల[2]
ముల నాతఁడు సుఖముగ విహరించెను
పక్షితతుల భయపఱచుచు సురమున
నగముల కూల్చుచు, మృగములఁ జంపుచు
మృగేంద్రుఁడో[3] యన మెఱసె పవనజుఁడు ॥శ్రీ॥

8

రవికి పవనునకు బ్రహ్మ కింద్రునకు
భూతసంతతికి పూర్ణ భక్తితో
నంజలి ఘటించి యానోత్సుకుఁడయి
దక్షిణుఁ[4] డాతఁడు దక్షిణాశకును
అరుగఁదలఁచి యత్తఱి వర్ధిల్లెను
పర్వసమయముల పాథోనిధివలె,[5]
బాహుదండముల పాదయుగ్మమున
నదిమె పర్వతము నరయ వానరుఁడు ॥శ్రీ॥

---

1. వృషభరాజు 2. పచ్చికబయళ్ళు 3. సింహమో 4. సమర్థుఁడు
5. సముద్రము.

9

కపిపీడితమై క్షణము పర్వతము
కనకరజతరేఖల మెఱయించెను ;
కదలి, పూలు వృక్షములు రాల్చఁగా
విరిమల[1] యన కనువిం దొనరించెను;
మత్త ద్విరదము[2] మదధారల వలె
సలిలధారలను స్రవింపఁజేసెను;
మధ్యమార్చి ధూమమువలె ననలము[3]
ఘనసుమనశ్శిలలను వెడలించెను. ॥శ్రీ॥

10

పీడితభూధర పీడ్యమానములు
దరులందలి భూతముల సంతతులు
వెత వెడలింపఁగ వికృతస్వరముల
నా శబ్దము సకలావని నిండెను
స్వస్తిక లక్షణ భాస్వత్ఫణముల
ఘోరవిషము గ్రక్కుచు నురగంబులు
శితదశనంబుల[4] శిలల కఱవఁగా
పగిలి వహ్నిలో రగిలి మండెనవి. ॥శ్రీ॥

---

1 పుష్పపర్వతము 2 మదించిన యేనుఁగు 3 అగ్ని 4 వాడికోఱలతో

11

భూతోత్కర మీ భూమీధరమును
ఛిన్నభిన్నముగ చేయుచున్నదని
తలఁచి భీతిమై తపస్విజనములు
వెలదులతోడుత విద్యాధరులును
వదలి స్వీయములు వస్తువు లన్నియు
గగనతలమునకు నెగసి చనిరి వెస
వివిధ విభూషణ వేషలు యోషలు[1]
చోద్యముతో కనుచుండి రభ్రమున[2] ॥శ్రీ॥

12

"రామార్థము మర్కట నిచ యార్థము
పర్వతనిభుఁ డీ పవనతనూజుఁడు
అతిదుష్కర మని మతి తలపోయక
అబ్ధి దాట సాహస మొనరించెడి"
నవి మునులును చారణులును సిద్ధులు
ననెడి వాక్యములు విని విద్యాధరు
లప్రమేయ బలుఁ డైన కపివరుని
గిరివరమున కాంచిరి సంతసమున ॥శ్రీ॥

---

1 స్త్రీలు 2 ఆకాశమున.

## 13

అంత రోమములు హనుమ విదిర్చెను
ప్రావృడంబుదము[1] వలె గర్జించెను
విహగనాయకుఁడు[2] మహోరగమువలె
నెగురఁగోరి పై కెత్తెను వాలము
స్తంభిత బాహుఁడు[3] సంకుచి తాంఘ్రియు
సంహృత కంఠశ్వాసుండును[4] నయి
పోవలసిన యంబుధి మార్గముపై
సుదూరముగ తన చూపు నిగిడ్చెను ॥శ్రీ॥

## 14

స్థిరముగ పదముల గిరిపై నానిచి
వీనులు ముడించి యానోత్సుకుఁడై
హనుమంతుఁ కపు లందఱ కనుఁగొని
"రాఘవ ముక్త శరమ్ము మాదిరిగ
రావణపాలిత లంక కరిగెదను
జనకజ నట కాంచకపోయినచో
బద్ధు చేసి రావణు కొనివచ్చెద"
నని వచించి యెగిరెను వినువీధికి ॥శ్రీ॥

---

1 వర్షాకాలమేఘము 2 గరుత్మంతుఁడు 3 స్తంభింపఁబడిన చేతులు కలవాఁడు 4 సంహరింపఁబడిన (ఆపఁబడిన) కంఠమందలి శ్వాసలు కలవాఁడు.

15

ఊరు వేగమున నుద్ధతమ్మై లగు
అవనీజాతము[1] లనుసరించె కపి
నతిదూరమ్మన కరుగు బంధుగుల
ననుసరించి చను నాప్తజనుల వలె
అతని వెంట పర్వతములు పరు విడె
పృథ్వీనాథుని వెంట సేన వలె
పుష్పిత భూరుహ భూషితుఁ డాతం
డద్భుతదర్శనుఁడై కనిపించెను                శ్రీ॥

16

కొన్ని వృక్షములు కూలె నంబునిధి
నింద్రభీతి నుర్వీధరముల[2] వలె
వార్ధి దాసిపై పడిన పూలచే
నక్షత్రావృత నభ మన[3] నొప్పెను
నానా సూన వితాన పరివృతుఁడు[4]
కపి మెఱసె తటిత్కలిదాబ్దము వలె
పురః ప్రసారితములు తద్భుజములు
పంచానన సర్పము[5] లటు భాసిలె                ॥శ్రీ॥

---

1 చెట్లు 2 పర్వతములు 3 నక్షత్రములచే నావరింపఁబడిన ఆకాశ మనగా 4 పలుపూవుల సముదాయముచే చుట్టఁబడినవాఁడు 5 ఐదు తలలు గల పామువలె.

17

సతరంగం బగు సాగర మభ్రము
త్రాగుచున్నటులు తనరె కపివరుఁడు
అనిలమార్గమున నరుగు నతని కను
లుదిత చంద్ర సూర్యుల వలె నలరెను
వాల వలయ[1] విభ్రాజితుఁ డాతఁడు
[2] సపరివేష భాస్కరు వలె వెలిగెను
మహాకాయుఁ డగు మారుతి[3] నభమున
ఱెక్కలు గల గిరి రీతిని మెఱసెను ॥శ్రీ॥

18

ఉరురయమున చనుచుండ కపివరుఁడు
వార్ధి నీరు దొప్ప వలె నగుచుండెను
[4] జలదంబుల ప్రచ్ఛన్నుఁడు గోచరుఁ[5]
డగు చాతఁడు శశి[6] యట్లు శోభిలెను
త్వరగా చను వానరుఁ గని గంధ
ర్వామరు లలరుల[7] వర్షము కురిసిరి
ఇను డాతని తపియింపఁజేయఁ దపు
దనిలుఁడు[8] సేవించెను విజయార్థము ॥శ్రీ॥

---

1 కెరటములతోఁగూడిన 2 పరివేషము (కాంతివలయము) తోఁగూడిన సూర్యునివలె 3 హనుమంతుఁడు 4 మేఘములచే కప్పఁబడినవాఁడు 5 కనఁబడువాఁడు 6 చంద్రుఁడు 7 పూలవాన 8 గాలి.

ఉడుపథి[1] హనుమంతుఁడు చనుచుండఁగ
కని ముదమున సాగరుఁడు మనంబున
"ఏను వర్ధితుఁడ [2] నిక్ష్వాకుకుల
ప్రభువుం డగు సగరప్రభుచేతను
త ద్వంశాబ్ధి[3] సుధామయూఖుఁ డగు
రాముని కీ కపిరాజు సహాయుఁడు
ఇతనికి తో డ్పానరింప కున్నచో
నగుదును నింద్యుఁడన"ని తలపోసెను ॥శ్రీ॥

20

అంత నతఁడు తనయందు భీతిచే
దాగిన మైనాకాగము [4] కనుఁగొని
"ధరణీధర! [5] పాతాళరాక్షసులు
పైకిరారు నీ ప్రాభవముననే
క్రిందికి మీదికి నే దెస కైనను
పెరుగు శక్తి కల పరమ [6] దక్షుఁడవు
కావున నొక హితకార్యముచేయగ
అడుగ వచ్చితి నటంచు వచించెను ॥శ్రీ॥

1 ఆకాశమున 2 ఇక్ష్వాకులవంశమునందు పుట్టినవాఁడు 3 అవంశమనెడి సముద్రమునకు చంద్రుఁడు 4 మైనాక + అగము = మైనాక పర్వతము 5 పర్వతమా 6 గొప్ప శక్తికలవాడవు.

21

1 అనఘ రామ కార్యార్థ మ్రభమున[2]
చను హనుమకు తో డొనరింపఁగ వలె
లెమ్ము పైకి సలిలమ్మునుండి వెస
శ్రాంతుఁ డతఁడు విశ్రాంతి వహించెడి
అతిపూజ్యుఁడు మన కతిథి యగు నతఁడు
తగదు కదా కర్తవ్యము [3] నుడుగుట
సీతారాముల శీలము కపిశ్రమ
నెమ్మది నెంచుచు లె"మ్మని పలికెను ||శ్రీ||

## 22

విని యంబోనిధి యనిన పల్కులను
మైనాకుఁడు జలమధ్యము చీల్చుచు
పైకి వచ్చె [4] సౌవర్ణశృంగములు
మెఱయ వృక్షవల్లరుల [5] తతులతో
దాని గాంచి హనుమానుఁడు విఘ్నము
సంఘటిల్లె నని శంకించుచు మది
వాయువు జలధరవర్గంబును వలె
ఉరో[6] ఘాతమున నురవడి త్రోసెను ||శ్రీ||

1 పాపరహితుఁడైన రాముని కార్యముకొఱకు 2 ఆకాశమున 3 విడుచుట 4 బంగారు శిఖరములు 5 లతల 6 ఱొమ్ము దెబ్బతో

23

హనుమంతుని వేగాతిశయంబును
కని మైనాకుఁడు మనమున నలరుచు
"కపివర ! దుష్కరకర్మ మొనర్చితి
నా శృంగంబున విశ్రమింపుమా !
నీనిమిత్తమయి నీరధి[1] నన్నిటు
ప్రేరణ చేసెను ప్రీతి మీఱఁగా !
అని [2] జంగమ దేహమున శిఖరమున
నిలిచి యతనితో పలికె వినయమున ॥శ్రీ॥

24

నిను పూజించిన నీ పిత[3] వాయువు
పూజించిన ఘనపుణ్యము చేకుఱు
కృతయుగమున పర్వతము లన్నియును
పక్ష ధరములై భాసిలి యెల్లెడ
నెగురుచుండఁగా నింద్రుఁడు దునిమెను
వాని పక్షములు వజ్రాయుధమున
నను వాయువు నీ జనకుఁడు జలనిధి
నునుచి ప్రోచె దయ" నని వచియించెను ॥శ్రీ॥

---

1 సముద్రము 2 స్థావరముకాని (నడచు) మేనితో 3 తండ్రి 4 ఱెక్కలు దాల్చినవై.

## 25

వాయువు ఋణమును బాపుకొనుటకై
ప్రియసుతు నిను సేవింపఁ గోరెదను
నిందు ప్రేమ మన్నించి నన్ను నా
శిఖరతలము పై సేద తీర్చుకొని
అశ్రమంబుగా నబ్ధి[1] శేషమును
దాటి రావణుని వీటికి[2] చేరుము
వత్సా ! నీకు శుభం బగుఁ గావుత !
మని ప్రియమున దీవన లిడి పంపెను ॥శ్రీ॥

## 26

విని మైనాకుని ప్రేమవచనములు
హనుమంతుఁడు ప్రీతాంతరంగుఁ డయి
"అవనీధర ![3] నీ అతిథ్యము నే
నందుకొంటి నని ఆత్మ తలంపుము
కార్యత్వరచే కదలి పోవలయు
నాగ్రహ మందక అనుమతింపవే"
అని వచియించుచు నతని హస్తమున
స్పృశియించి[4] నభోవీథి[5] నెగిరి చనె ॥శ్రీ॥

---

1 మిగిలిన సముద్రమును 2 పురమునకు 3 పర్వతమా ! 4 ముట్టి 5 ఆకాశమార్గమున.

## 27

మైనాకుని కర్మము గని యింద్రుఁడు
ముదము నంది నెమ్మది ని ట్లనియెను
"శైలరాజ ! నీసత్కార్యమునకు
ఆనందించితి నభయ మొసంగితి
[1]సీతానాథుని దూతకు హనుమ క
పారం బగు తోడ్పా టొనరించితి
విహరింపుము నీ విఁక [2]యథేచ్ఛగ"
నన మైనాకుఁడు కనె సంతోషము ॥శ్రీ॥

## 28

ఇంతలోన హనుమంతుఁడు దవ్వగ
నెగిరిపోయె వడి గగనభాగమున
అంత సిద్ధులు మహర్షులు వేల్పులు
రయమున సురసను నాగమాతఁ గని
"ఆకాశంబున నరుగు కపివరుని
బలశౌర్యంబులు తెలియఁ గోరెదము
[3]దనుజాకారము దాల్చి యాతనికి
కలిగింపుము విఘ్నం బని పలికిరి ॥శ్రీ॥

---

1 రాముని 2 ఇచ్చవచ్చినట్లు 3 రాక్షసరూపము

29

సురస యంత భీకరరూపము గొని
అరుగు కపివరుని కడ్డముగా చని
“అమరులు[1] నిను నా కాహారముగా
నొసగి రిపుడు నా నోట చొరు” మనఁగ
హనుమ వినయమున నంజలి ఘటించి
రామోదంతము నామె కెఱిఁగించి
“లంక కరిగి యా రామపత్నిఁ గని
చెచ్చెర నరుదెంచెద” నని పలికెను ॥శ్రీ॥

30

వినక యామె కపివీరుని మాటలు
నా [2]యానతి కెదురే యని పల్కుచు
నతని మ్రింగ [3]నాయత మతిఘోరము
దీర్ఘజిహ్వామును తెఱచె వక్త్ర[4]మును
అంత హనుమ తన యంగము వ్రేలెఁడు
చేసి తదాననసీమ చొచ్చి త్రుటి
వచ్చి పైకి “భవదిచ్ఛ[5] నొనర్చితి
[6]క్షితిసుత కన నేగెద” నని పల్కెను ॥శ్రీ॥

---

1 దేవతలు 2 ఆజ్ఞకు 3 దీర్ఘము 4 ముఖమును 5 నీకోరిక 6 సీతను

## 31

[1] రాహు వదన నిర్గతుఁ డగు చంద్రుని
వలె నొప్పెడి కపివరుని సురస కని
స్వకీయ మగు రూపంబును దాలిచి
సంతోషాశ్రులు [2] జాలువాఱఁగా
"సౌమ్య ! సుఖముగా చని యా లంకకు
సీతను రాముని చేర్పు" మని పలికె
పవనజుఁ డంతట వాయువేగమున
గరుడోపముఁడై యరిగె గగనమున ॥శ్రీ॥

## 32

[3] ప్లవమానుండగు పవమానాత్మజు
గాంచి [4]సింహి కాఖ్యా దను జాంగన
చిరకాలమునకు చేకుతె నశనం[5]
బని యాతని ఛాయను గ్రహియించెను
ఎదురుగాలి [6]బారి పడు నౌక వలె
కదల లేక కపి కాంచుచు నటు నిటు
సాగరజలమున ఛాయను గ్రహించు
దారుణ మగు సత్త్వము[7] గుర్తించెను ॥శ్రీ॥

---

1 రాహువు ముఖమునుండి బయటికివచ్చిన 2 ప్రవహింపఁగా 3 ఎగురుచున్న 4 సింహిక యను రాక్షసస్త్రీ 5 భోజనము 6 హింస 7 జీవిని

33

మును సుగ్రీవుఁడు తనతో చెప్పిన
1 ఛాయా గ్రాహిణి శక్తి అదే యని
ఎఱిఁగి హనుమ 2 ప్రావృషమున మేఘం
బట్లు తనదు కాయంబును పెంచెను
అంతట సింహిక ఆననము తెఱచి
గర్జించుచు నా కపి వెంటను జనె
హనుమ స్వీయదేహము సంకుచితము
చేసి వేగ చొచ్చెను 3 తద్వక్త్రము ॥శ్రీ॥

34

అతఁడు గోళ్ళతో నామె యంగములు
చీల్చి పైకెగసె చిత్తవేగమున
నెట్టి యామె క్రిందికి ధైర్యంబున
కపి చెచ్చెర తన కాయము పెంచెను
గుండె బ్రద్దలై కూలె నాదనుజ
వారిధి హాహాకార మొనర్చుచు
పొగడ 4 గగనచర భూతము లన్నియు
క్రమ్మర కపి ఆకసమున కెగసెను ।శ్రీ॥

---

1 నీడను గ్రహించునది 2 వర్షాకాలమున 3 దాని ముఖము 4 ఆకసమున చరించు భూతములు.

౩౨

శత యోజన విస్తృతాబ్ధి కడచని
చేరువ కపి చూచెను ద్వీపమ్మును
1 పాదపమ్ము లాపగ లుపవనములు
కనఁబడె నతనికి, కలిగె సంతసము
గిరిసదృశము తన గురుదేహము కని
అనుమానించెద రసురు లని తలఁచి
హనుమ తనదు దేహము కుంచించెను
తెగి బలి నడఁచిన [2]త్రివిక్రముని వలె ॥శ్రీ॥

౩౬

వారిధి తీరము చేరి వేడ్క నొక
పర్వత శిఖరము పైని వ్రాలె కపి
[3] నగచరమ్ము లగు [4]ఖగములు మృగములు
నదిరిన గిరిఁ గని హృది భయ మందెను
హనుమంతుఁడు తా నాచరింపఁ దగు
భావికార్యమును భావన చేయుచు
కృతకృత్యుఁడు పరికించి నల్దెసల
నమరావతి వలె నలరు లంకఁ గనె. ॥శ్రీ॥

1 చెట్లు 2 వామనుని 3 పర్వతమున చరించు 4 పక్షులు

## సర్గము - 2

37

శతయోజనముల శరధి దాటి వి
ట్ఠూరుపైన లేకుండ నుండె కపి
త్రికూటాఖ్య 1 శిఖరి స్థితుఁడై యతఁ
డా నగాగ్రమున నలరెడు లంకను
పుష్పితమ్ము లగు భూరుహమ్ములను
3 విహగ పంక జాన్వితముల బావుల
జలపూర్ణము లగు 4 జలాశయములను
లలితోద్యానములను దర్శించెను ॥శ్రీ॥

38

పద్మోత్పలముల పరగు నగడ్తలు
కాంచనమయ ప్రాకారము రమ్యము
5 శరన్మేఘసుందరములు గృహములు
తెల్లని యెత్తగు తిన్నని వీధులు
వందల బురుజులు వరపతాకములు
కన కాంచిత తోరణముల పంక్తులు
కలిగి యొప్పెనఁగె కడు రమ్యంబై
రావణపాలిత లంకానగరము ॥శ్రీ॥

---

1 పర్వతమునందు 2 చెట్లను 3 పక్షులతో పద్మములతోఁగూడిన 4 సరస్సులను 5 శరత్కాలమందలి మేఘమువలె నందమైన

39

నగవర శిఖరము నందుండుట నా
పురము వెల్గె నభమున నున్నట్టులు
[1]శరధివారి సుందర వస్త్రముగా
ప్రాకారము [2]జఘనాకారముగా
బురుజులు శిరమున ముడుచు [3]ననలుగా
లంకాపురము వెలఁది వలె నొప్పెను
తనరెను నగరము మనసుచేతనే
విశ్వకర్మ కల్పించెనొ యనఁగా ॥శ్రీ॥

40

ఆకాశతలము నంటు చున్నటులు
భాసిలు నున్నత భవనమ్ములతో
భోగవతీపురి భుజగావళి వలె
నంతట తిరిగెడు నసురావళితో
నొప్పు పట్టణము నుత్తరమునఁ గల
ద్వారభాగమును చేరి కపివరుఁడు
దానికి రక్షక మైన వార్ధిఁ గని
దశకంఠుని [4]దుర్గమునిగ నెంచెను ॥శ్రీ॥

---

1 సముద్రజలము 2 కటిరూపముగా 3 పువ్వులు 4 అదపశక్యము కానివానిగ.

## 41

రావణపాలిత లంక [1]విషమ మగు
[2]ఆని వేల్పుల కైనను దుర్జయ మిది
ఇటకు వచ్చి కపు లేమి చేయుదురు
రాముఁ డైన నిట నే మొనరించెడి
[3]చతురుపాయముల సంప్రయోగమున
కవకాశము లే దసురుల యందున
సీత నరసి మును చేయవలయు పని
నాలోచించెద నని తలంచె కపి ॥శ్రీ॥

## 42

రాక్షస గుప్తము లంకానగరము
నెట్టులు చొరఁగల నీ రూపంబున
ఏ యుపాయమున [4]నిలాతనూజను
కనఁజాలుదు రాక్షసుల కన్మొఱఁగి
పూజ్యం బగు రాముని కార్యం బిది
చాల దుష్కరము సఫలం బెట్లగు
దూతల అజ్ఞతచేత చెడును పను
లని తలపోసెను హనుమంతుఁడు మది ॥శ్రీ॥

---

1 సమముకానిది, దుర్గమము 2 యుద్ధమున 3 సామదానభేదదండోపాయములు 4 సీతను.

43

ఇట నసురులు గుర్తించినచో నను
రాముని పని వ్యర్థం బై పోవును
ఏ రూపమును ధరించితి నేనియు
గుర్తు పట్టుదురు క్రూరులు దైత్యులు
రాఘవకార్యార్థం బై రాతిరి
చిన్న రూపమును చేకొని పురమున
అన్ని భవనముల నన్వేషించెద
జనకజాత నని హనుమ తలంచెను ॥శ్రీ॥

44

అంత నద్దుఁ డస్త్రాద్రిని చేరెను
మారుతి [1]బిడాల మాత్ర దేహుఁ డై
స్వర్ణ స్తంభల స ద్గృహములు గల
రమ్య మైన నగరమ్మును చొచ్చెను
పురసౌందర్యము నరసి సంతసము
సీతను గాంచక చింత నతఁడు గనె
అతనికి సాయము నాచరింప నన
శశి[2] యుదయించెను శంఖకాంతితో ॥శ్రీ॥

1 పిల్లి యంత దేహము కలవాఁడు 2 చంద్రుఁడు

# సర్గము - 3

45

రమ్య మైన యా రావణ నగరము
వృద్ధియుతము దర్శించి కపివరుఁడు
"రావణ బల సంరక్షిత మీ పురి
నన్య వీరులకు నగునే తాకఁగ
దీనిని చేరఁగ నేను [1]రవిసుతుఁడు
[2] మైంద ప్రముఖులు మాత్రమె శక్తుల"
మనుకొని యా యినవంశ్యుల శౌర్యము
నెంచి పురి ప్రవేశించె ముదంబున ॥శ్రీ॥

46

అతనిఁ జూచి వని తాకారముతో
లంకాపురము నిలంబడి యెదుటను
"ఎవఁడవు నీ విట కే కార్యముతో
ఏతెంచితివో యెఱింగింపు మీ
నిమిషార్థములో నీదు ప్రాణములు
పోవు గాన చెప్పుము వేగముగా
దుస్తర మంబుధి దాకితి వే విధి"
నని భీకర నిస్వనమున నడిగెను శ్రీ॥

1 సుగ్రీవుఁడు 2 మైందుఁడు మొదలైనవారు

## 47

వికృతాకారము వింత నేత్రములు
కల యా రక్కసి కని హనుమంతుఁడు
నా కథ సర్వము నీకు తెల్పెదను
కాని ముందుగ కాంత ! యెవ్వతెవొ
నగర ద్వారమునందు నిలంబడి
యేగుచున్న న న్నేల నిల్పితివొ
తెల్పఁగదవె నీ తీరు కనంబడు
నద్భుతంబుగా నని ప్రశ్నించెను ॥శ్రీ॥

## 48

అంత నామె యత్యంత కోపమున
కన్నులెఱ్ఱపడ కాంచి కపివరుని
రాక్షసరాజగు రావణు నానతి
రక్షించెద నగరము దుర్దమనై
నన్ను మీఱి యీ నగరము చొచ్చుట
ఎంతటి వారికి నే నశక్య మగు
నేనే సుమి లంకా నగరంబను
నిను [1]వధియించెద నిపుడని పలికెను ॥శ్రీ॥

---

1 చంపెదను

ఆ మాటలు విని హనుమ యుద్ధమున
కాయితుఁ డై గిరి యట్లు నిలంబడి
కడు వికృతం బగు కాయము వేషము
కలిగి పరుషముగ పలుకు నామెఁ గని
కమనీయ ప్రాకారము బురుజులు
వనములు, తోటలు వర భవనంబులు
గల లంకాపురి కాంచ వచ్చితిని
కని నే పోయెద నని వచియించెను ॥శ్రీ॥

50

అంత నామె కోపావేశంబున
సింహము వలె గర్జించి కపివరుని
హస్తతలంబున నదిమి కొట్టఁగా
హనుమ క్రుద్ధుఁ డయ్యెను, ఆడుది యని
ఎడమ కరంబున పిడికిలి బిగించి
మెల్లగ గుద్దెను మెడపై నామెను
1 ముష్టిసూతమున నష్టశక్తి యై
దనుజాంగన పడె ధరణీ తలమున ॥శ్రీ॥

1 పిడికిలి దెబ్బలచే

51

పుడమిని గిరివలె పడిన తన్నుకపి
జాలి చూడ రాక్షసి యిటు పలికెను
"ఘనభుజ ! [1]దీనను నను రక్షింపుము
నిర్జిత నైతిని నీచే నిప్పుడు
[2]నలువ తొల్లి వానరుఁ డొకఁడు నిను
మించు శక్తి నోడించు నప్పుడే
అసురుల కాపద యగు నని పలికెను
ఆ సమయం బిపు డరుగు దెంచె" ననె. ॥శ్రీ॥

52

జనకజ కారణమున రావణునకు
నాశరకోటికి నాశము చేకుఱు
అందుచేత నో అనఘ ! చొచ్చి పురి
యిచ్ఛ వచ్చి నటు లిఁక నొనరింపుము
రావణపాలిత లంకాపురి యిపు
[3]డజ శాపంబున హత మై పోయెను
నిరాటంకముగ నరిగి నీవు సతి
నా యవనీసుత నన్వేషింపుము ॥శ్రీ॥

1 దీనురాలను 2 బ్రహ్మ 3 బ్రహ్మశాపము చే

# సర్గము - 4

## 53

సబలుఁ [1]డంజనా జాతుఁడు లంకను
కామరూపిణిని క్షణమున నోరిచి
అరిశిరమున [2]సవ్యం బగు పాదము
నునిచె ననఁగ చొచ్చెను నగరంబును
సితభవనంబుల చెలగె పట్టణము
[3] అంబుదములచే నాకాశము వలె
చిత్ర మాల్య భూషిత మగు నగరము
నరసి యతఁడు మది నానందించెను ॥శ్రీ॥

## 54

వివిధరూపములం వెలయు భవనముల
నొక్కొక్కటి కనె నక్కపి వర్యుఁడు
మంజులమ్ము లగు మధుర గీతములు
లలనల [4]నూపురముల నిస్వనములు
జపము లొనర్చెడి జనుల మంత్రములు
వివిధస్తవములు వేదనాదములు
పవనసుతుం డా భవనంబుల వినె ॥శ్రీ॥

---

1 హనుమంతుఁడు 2 ఎడమ. 3 మేఘములచే 4 అందెల

## 55

జటాధారులను చర్మాంబరులను
1దర్భముష్టులను దండాయుధులను
వికటాననులను భీకరాకృతుల
2ధనువులు శరములు దాల్చిన వారిని
ఖడ్గహస్తులను కవచావృతులను
కృశశరీరులను కృష్ణవర్ణులను
సురూపధారుల సుందరవేషుల
వరసెను లంకాపురి హనుమంతుఁడు ॥శ్రీ॥

## 56

ఆరిగి యరిగి యతఁ డద్రిస్థితమును
సువర్ణ తోరణ శోభమానమును
కమనీయ ప్రాకా రావృతమును
అంబు పూర్ణ 3పరిఖాలంకృతమును
సాయుధ సైనిక సంరక్షితమును
ముక్తారత్న విభూషితాంతమును
చందన మిశ్రిత జల సిక్తమ్మును
రావణు నంతిపురమ్మును చొచ్చెను ॥శ్రీ॥

---

1 దర్భలు పిడికిళ్ళయందుఁగలవారిని 2 విండ్లు 3 అగడ్త

# సర్గము - 5

57

వెండివెన్నెలలు నలుగడఁ జిమ్ముచు
జనుల పాపములు సమయగఁజేయుచు
సముద్రజలమును సంవర్ధించుచు
[2] గోష్ఠమధ్యమున గోపతి పోలిక
పంజరమందున పరగు హంస వలె
మందరగుహ నింపగు సింహము వలె
కరిరాజముపై వరవీరుని వలె
అప్పుడు నభమున నలరె [3]శశాంకుఁడు ॥శ్రీ॥

58

[4]శీతాంశుని రుచి చీకటి తొలగఁగ
బహువాద్యమ్ముల ధ్వనులు చెలంగఁగ
[5] అభిసారిక లిటు లటు నడయాడఁగ
కాంతల మనమున కామము పెరుగఁగ
[6] సిసువు [7]లలసులును నిద్ర మునుంగగ
మైపూఁతలతో మగువ లొప్పఁగా
అసురు లంతట విహారము చేయఁగ
నేత్రపర్వమై నెగడె [8] ప్రదోషము ॥శ్రీ॥

---

1 తెల్లని 2 గోశాలనడుమ 3 చంద్రుఁడు 4 చంద్రునికాంతిచే 5 ప్రియునిగూర్చి సంకేత స్థలమునకుఁబోవు నాయిక 6 శిశువులు 7 సోమరులు 8 సంధ్యాకాలము.

59

ఘీంకారంబుల కెరలు నేనుఁగుల
పూజితులై ముద మొందు పండితుల
మతిమంతుల నతి మంజుల భాషల
శ్రద్ధా వినయ విరాజిత మూర్తుల
నిర్మలభావుల నియమశోభితుల
వివిధభూషణుల వికృతాకారుల
మాంసాశనమున మత్తుల నసురుల
రావణు నంతిపురమ్మున కనె కపి ॥శ్రీ॥

60

ధర్మపరల నుత్తమ పతివ్రతల
కాంచన వర్ణ సమంచిత గాత్రుల
[1] విరహ వేదనా వివర్ణ వదనల
కాంత సమాగమ కలితానందల
వివిధ విభూషణ విలస ద్దేహల
[2] సరసిరు హాయత చారు నేత్రలను
ఎందఱినో కపి యింతుల కాంచెను
కాని జానకిని కానఁ డయ్యె నట ॥శ్రీ॥

---

1 విరహబాధచే వెల్లబాఱిన ముఖములు కలవారిని 2 పద్మములవలె దీర్ఘములు సుందరములునైన కనులు కలవారిని.

## సర్గము - 6

61

సీతను గానక చింతావశుఁడై
అన్వేషించెను హనుమ ప్రతిగృహము
శుకుఁడు సారణుఁడు శుకనాసాఖ్యుఁడు
విద్యుజ్జిహ్వుఁడు విరూపాక్షకుఁడు
సంపాతి విభీషణుఁడు రోమశుఁడు
మహాపార్శ్వ కుంభకర్ణ భీములు
వక్రుఁ డింద్రజి త్ప్రహస్తు లాదిగ
గల దైత్యుల గృహములు కపి వెదకెను ॥శ్రీ॥

62

అసుర భవనముల నారసి చివరికి
హనుమ చేరె రావణు ప్రాసాదము
స్వర్ణమయం బగు ప్రాకారముతో
చారు తోరణ ద్వార చయముతో
దంత రజిత సుందర రథములతో
వివిధ రత్నమయ పీఠంబులతో
చందన [1]మృగమద సౌరభములతో
నేత్రపర్వమై నెగెడు చుండె నది ॥శ్రీ॥

---

1 కస్తూరి సువాసనలతో

63

పలువిధంబు లగు పక్షులు మృగములు
స్వేచ్ఛ నచట విహరించుచు నుండెను
సంతోషముతో కాంతలు పురుషులు
త్వర నట నటు నిటు తిరుగుచు నుండిరి
శంఖ మృదంగ స్వనములు భేరీ
నినదము లచ్చట వినఁబడు చుండెను
దృఢశరీరు లగు [1] దితిజులు దానిని
గజారూఢులై కాచుచు నుండిరి ||శ్రీ||

64

క్రీడాలయములు [2]కృతకాచలములు
లతాగృహము లట రాజిలుచుండెను
అన్ని గృహంబుల కన్న మిన్నయై
ఒక మందిర మట నొప్పుచు నుండెను
ధ్వజ సహస్ర సంతత భాసురమై
బహు రత్న ద్యుతి భాసమానమై
[3] కాంతా నూపుర కాంచీ స్వనముల
చెలగు దాని చొచ్చెను హనుమంతుఁడు ||శ్రీ||

---

1 రాక్షసులు 2 మానవనిర్మితములైన పర్వతములు 3 స్త్రీల అందెలయు, ఒడ్డాణములయు ధ్వనులతో

65

1 దశకంఠుని సుందర మందిర మది
సువర్ణమయమై నవమణిచితమై
2 తొలకరి విద్యు ద్వలయంబులతో
నలరు నంబుదావళి వలె మెఱసెను
మయ నిర్మిత మది మనోహరంబై
కల గృహంబులకు 3తలమానికమై
అవనీతలమున నమరపట్టణం
బవతరించె నన నలరుచు నుండెను ॥శ్రీ॥

## సర్గము - 7

66

హనుమంతుం డట కనె పుష్పకమును
మణి గణ ఖచిత విమాన రత్నమును
నిండియుండె నది కొండల వరుసల
కొండలపై తరుషండము లొప్పెను
తరువుల కొమ్మల తనరె పుష్పములు
పూవులు కేసరముల చెన్నారెను
సరసు4 లచట తామరలకు 5నెలవులు
6 తమ్ములు నమ్మని 7తావుల కిమ్ములు ॥శ్రీ॥

---

1 రావణుని 2 వర్షాకాలమున 3 శిరోమణియై 4 తటాకములు 5 చోట్లు 6 పద్మములు 7 సువాసనలకు నెలవులు.

గైరిక ధాతులు [1]కమనీయంబై
భాసిల్లెడు పర్వత శిఖరము వలె
[2]రవి శశాంక ముఖ గ్రహ చక్రముచే
నలంకృతం బగు నాకాశము వలె
పల్లవములతో ఫలసుమములతో
భాసుర మగు [3]సురపాదపమ్ము వలె
[4]సరసిజ సుందర సరోవరము వలె
అద్వితీయమై యది యలరారెను ॥శ్రీ॥

## సర్గము - 8

68

వివిధ మణులతో పవడమ్ములతో
మలచిన పక్షుల [5]మణితురంగములు
నానా విధ రత్నాంచిత ఫణముల
కదలుచున్నటులు కనఁబడు పాములు
సుందర తుండ విశోభిత గజములు
పద్మహస్తయై భాసిలు [6]నిందిర
కనకమయమ్ములు కలువ లబ్జములు
చిత్రితంబులై చెలగుచుండె నట ॥శ్రీ॥

---

1 అందమై 2 సూర్యుఁడు, చంద్రుఁడు మొదలైన గ్రహముల సముదాయముచే 3 కల్పవృక్షము 4 పద్మములచే నందమైన సరస్సువలె 5 మణులతో చేయఁబడిన గుఱ్ఱములు 6 లక్ష్మి.

69

విశ్వకర్మ కల్పిత మా పుష్పక
మనుపమానమై తనరుచు నుండెను
[1]అరత్న నిర్మిత మసుంధర మ్మట
ననర్ఘ మొకటియు కనరాదాయెను
ప్రభువు కోరినను బట్టి గాలి వలె
నెగిరి పోవు నది యెచ్చటి కైనను
బహు సుమ సౌరభ భాసితమై యది
వసంతమాసము [2]దిసంతు లద్దము ||శ్రీ||

70

పుష్పమయం బగు [3]భూరుహమ్ము వలె
సుందర [4]కందర శోభిత గిరి వలె
మంగళ కరమై మహనీయంబై
పరిఢవిల్లు పుష్పకము చేరి కపి
తను వంతయు నేత్రములు చేసికొని
అవనీసుతకై అన్వేషించెను
పరమపతివ్రత నరసుర పూజిత
నెచ్చటఁ గానక ఎంతయు కుందెను ||శ్రీ||

---

1 రత్నములతో నిర్మింపఁబడినవి 2 నిందించుచు (అతిశయించునని భావము) 3 చెట్టు 4 గుహలతో.

# సర్గము_9

71

హనుమ పుష్పకము నందము నారసి
డెందంబున నానందము నొందెను
జనకరాజసుత జాడ తెలిసికొన
అన్ని ప్రాంతముల నన్వేషించుచు
అర్ధ యోజన నాయతము సుందరము
[1] చతుర్దంత గజ సదా రక్షితము
బహు రాక్షస భట పరివేష్టితమును
పంక్తి కంధరుని భవనము గాంచెను ॥శ్రీ॥

72

పృథ్వీపతుల జయించి రావణుఁడు
లంకకు తెచ్చిన రాజకన్యకలు
వివిధాకారలు వివిధభూషణలు
అసురకాంత లట నలరుచు నుండిరి
[3] అమరనాథునకు యమ కుబేరులకు
వరుణున కే సంపద యొప్పారెనొ
ఆ సంపద ఆ యఖిలైశ్వర్యము
రావణు నింట విరాజిలు చుండెను ॥శ్రీ॥

---

1 నాలుగు దంతములుగల యేనుఁగులచే నెల్లప్పుడు రక్షింపఁబడినది
2 రావణాసురుని 3 ఇంద్రునకు

73

సువర్ణ మయములు [1]సోపానమ్ములు
వర మణి కల్పిత [2]వాతాయనములు
[3]స్ఫటిక నిర్మిత స్వచ్ఛ తలమ్ములు
కలిగి భవన మది విలసిల్లు చుండెను
ప్రవాళ ముక్తా పరిశోభితములు
సమము లాయతము లమితోన్నతములు
కంబము లొప్పగ కనంబడె హర్మ్యము
రెక్కలతో పై కెగురుచున్నటులు ॥ శ్రీ ॥

74

క్షితిధర శాద్వల చిత్ర విరాజిత
రత్న కంబళ విరాజమానమై
అచటి నేల గేహముల భూజముల
తనరు విశాలావని వలె నొప్పెను
డెందమ్మున కానందము కూర్చుచు
దేహమ్మున కతి [5]దీప్తి నొసంగుచు
సర్వ దుఃఖముల నణుయించుచు నది
శ్రీలకు నెలవై చెన్నలరారెను ॥ శ్రీ ॥

---

1 మెట్లు 2 కిటికీలు 3 స్ఫటిక శిలలతో నిర్మింపబడిన స్వచ్ఛమైన భూభాగములు 4 పర్వతములు 5 కాంతి.

75

చల్లనిగాలుల చారుదృశ్యముల
మధురగానముల మంచివాసనల
అతిరుచ్యము లగు నాహారమ్ముల
1 పంచేంద్రియ తర్పణ మొనరించెడి
పంక్తికంధరుని భవనము నారసి
హనుమంతుఁడు మది నచ్చెరు వందుచు
ఇది దివియా, దేవేంద్ర నగరమా
అజుని లోకమా అని భ్రమ నొందెను ॥శ్రీ॥

76

వివిధవర్ణములు వింత వస్త్రములు
పూలమాలికలు 2భూషలు దాలిచి
3 మద్యమత్తలై మగువలు కొందఱు
పాటల నాటల బడలి పరుండిరి
నిశ్శబ్దముగా నిద్రించెడి ఆ
వనితాతతిచే వరలెను భవనము
4 సుప్త పద్మ భాసుర సరస్సు వలె
తారాగణ సుందర 5నభమ్ము వలె ॥శ్రీ॥

1 త్వగాదులగు నైదింద్రియములకు తృప్తిని 2 నగలు 3 మద్యము త్రాగుటచే మదించినవారై 4 నిద్రించిన (మొగిడిన) పద్మములచే నొప్పు తటాకము 5 ఆకాశము.

77

చెరిగిపోయె కొందఱి [1]తిలకమ్ములు
[2]పెరిగిపోయె కొందఱి హారమ్ములు
జారెను కొందఱి చీరలు మేనుల
నూడెను కొందఱి ఒడ్డాణమ్ములు
కొందఱి వక్షములందు [3]వలిపెములు
కొందఱి ముఖములయందు ముంగురులు
కొందఱి కన్నులయందు [4]స్వప్నములు
కొందఱి పెదవుల కందులు [5]తనరెను ॥శ్రీ॥

78

అచ్చట నందరు నందకత్తెలే
అందఱు నూతన యౌవనాంచితలె
అందఱు [6]నైపుణ్యాలవాలములె
ఉన్నత వంశోత్పన్నలె యందఱు
అట్టి సుందరుల హనుమంతుఁడు గని
సీతకొఱకు పరిశీలన చేయుచు
గుణవతి సతి రాముని యిల్లాలిట
నెందు కుండు నని యెంచెను మదిలో ॥శ్రీ॥

---

1 బొట్టులు 2 త్రెగిపోయెను 3 సన్నని వస్త్రములు 4 కలలు 5 మచ్చలు
6 నైపుణ్యమునకు నిలయములే,

# సర్గము - 10

79

హనుమంత అంత సీతను వెదకుచు చని
సందర్శించెను శయనాగారము
కనక దంత మణి ఖచితము [1]లాఢ్యము
లాసనమ్ము లట నలరుచు నుండెను
అం దొకచో మాలాంకృత మగు
తెల్ల గొడుగు శోభిల్లుచు నుండెను
స్వర్ణ నిర్మితము [2]వహ్ని సముజ్జ్వల
మొప్పె నచట నొక ఉత్తమశయనము ॥శ్రీ॥

80

[3] అజినాలంకృత మాస్తరణాంచిత
మలరు చుండె నది అలరుల దండల
పలు సువాసనలు వరధూపమ్ములు
పొగ లచ్చట నిం పొందుచు నుండెను
చామరములు హస్తమ్ములం దాలిచి
వెలందు లెందఱో వీచుచుండి రట
[4] కాల మేఘ సంకాశ దేహుం డగు
రావణుం డా తల్పమున పరుండెను ॥శ్రీ॥

---

1 సంపన్నములు 2 అగ్నివలె ప్రకాశించునది 3 తోలుతో నలంకరింపం బడినది 4 నల్లని మేఘముతో సమానమైన దేహముకల

31

[1] రక్త చందన విరాజి తాఁగు దతఁ
దలరారెను సంధ్యా మేఘము వలె
సువర్ణ భూషణ శోభిత విగ్రహుఁ
డతఁ డొప్పెను [3]తరువృత మగు గిరి వలె
దీర్ఘ నిశ్వసన దీపితుఁ డాతం
డడరె బుసలు కొట్టెడి నాగము వలె
తల్ప నిద్రితుఁ డతఁడు విరాజిలె
నది చొచ్చిన గంధ గజేంద్రము వలె ॥శ్రీ॥

32

కనక నిర్మి [4]తాంగద శోభితములు
ప్రసారితము లింద్ర ధ్వజోపములు
ఐరావత దంతాగ్ర [5]వ్రణితము
లంబుజాక్ష చక్రాహతి యుతములు
సున ఖాంగుళి భాసుర దీర్ఘమ్ములు
[7] పంచ శిరో యుత పన్నగ నిభములు
కరివర కర పీవరము లున్నతము
లతని బాహు లొప్పారుచు నుండెను ॥శ్రీ॥

---

1 ఎఱ్ఱని గంధముచే ప్రకాశించు దేహముగలవాఁడు 2 సంధ్యాకాలము నందలి మేఘమువలె 3 చెట్లచే నావరింపఁబడిన పర్వతము 4 భుజకీర్తులు 5 గాయపఱుపఁబడినవి 6 విష్ణుని చక్రముల దెబ్బలతోఁగూడినవి 7 ఐదు శిరస్సులతోఁగూడిన పాములతో సమానములు.

83

మణి చిత్రిత కాంచన [1]మకుటముతో
[2] కుందన నిర్మిత కుండలములతో
[3] భాసుర సితోత్త రాసంగముతో
అమూల్య మగు పీతాంబరమ్ముతో
రక్త చందన భ్రాజిత మాయత
మగు వక్షంబున నలరు [4] సరులతో
కనుఁగవఁ గల యెఱ్ఱని కాంతులతో
లంకేశ్వరుఁ డగు రావణుఁ డొప్పెను ॥శ్రీ॥

84

చంద్రుని కెన యగు చక్కని ముఖములు
[5] అమ్లాన లతాం తాభరణమ్ములు
సుందర మణి భాసుర కుండలములు
సర్వావయవ లస ద్భూషణములు
కలిగి సుందరులు కళా ప్రవీణలు
[6] వివిధ క్రీడా వివశ శరీరలు
పంక్తి కంధరుని భామిను లాతని
పాదసన్నిధిని పరుండి యుండిరి ॥శ్రీ॥

---

1 కిరీటము 2 బంగారముతో 3 ప్రకాశించు తెల్లని ఉత్తరీయముతో 4 దండలతో 5 వాడని పూవుల నగలు 6 పలువిధములైన క్రీడలచే వశము తప్పిన దేహములుకలవారు.

58

క్రాగిట వీణియ గదించి భాసిలె
తెప్ప పజ్జ [1]పద్మిని వలె నొక్కతె
పటహ వాద్యమును ప్రక్క నుంచు కొని
[2]బాలపుత్ర వలె వఱలె మఱొక్కతె
ష్టట్టి [3]మృదంగము బాహుల నొప్పెను
పార్శ్వగత ప్రియ వలె నిం కొక్కతె
మదవశమున చెలి నదిమి యలరె లత
వయి ప్రాకిన లత వలె వే ఱొక్కతె ॥శ్రీ॥

86

భూరిసంఖ్య లగు వారి మధ్యమున
శ్రీకర మగు ప్రత్యేక తల్పమున
రమ్య విభూషణ రాజిత విగ్రహ
పావన రుచి విభ్రాజి ముఖాంబుజ
స్వతను కాంతి విస్తారిత గృహరుచి
[5]స్వర్ణ వర్ణ గుణ భాసుర సుందరి
పంక్తికంఠునకు పట్టమహిషి యై
తనరెడు మండోదరి శయనించెను ॥శ్రీ॥

---

1 పద్మలత 2 బాలుఁడైన పుత్రుఁడుకలది 3 మద్దెల 4 సఖి 5 తన మేని కాంతిచే విస్తరింపఁజేయఁబడిన గృహము యొక్క కాంతి కలది.

87

కపివరుఁ డామెను కని జనకజ యని
పరమ మోద సాగరమున తేలెను
చఱచి నేల [1]పుచ్ఛము ముద్దిడుకొనె
ఆనందంబున నటు నిటు నడచెను
క్రీడాపరుఁడై పాడుచు [2]కంబము
లెక్కి క్రిందికిని గ్రక్కున దూకుచు
[3]ప్రాకృత కపి వర్గ సహజ మగు
ప్రకృతి నప్పు డించుక ప్రకటించెను ॥శ్రీ॥

## సర్గము - 11

88

కొంత వడికి హనుమంతుఁ డా భ్రమను
విడిచి తలఁచె మది వేఱొక విధమున
రామ వియోగ భరంబున నుందెడి
పరమపతివ్రత ధరణీనందన
నిద్రించునె [4]పానీయము గ్రోలునె
[5]కై సేయునె యంగము భుజియించునె
అన్య పురుష పొం దభిలషించునే
ముజ్జగముల రాముని కీ డెవ్వరు ॥శ్రీ॥

---

1 తోక 2 స్తంభములు 3 సామాన్య వానర సమూహమునకు సహజమైన 4 నీరు త్రాగునా 5 అలంకరించునా

అని తలంచి యా యంగన సీతా
సతి కాదని నిశ్చయించె నెమ్మది
మతి మంతుఁడు హనుమంతుఁ డచట నిడి
పానశాలలో పరిభ్రమించెను
ఆటల పాటల నలసిన వారును
మధువు [1]నాని మైమఱచిన వారును
ఇంపగు నగలు ధరించిన వారును
సుందరు లుండిరి యెందఱొ అచ్చట ॥శ్రీ॥

0

వనవరాహములు వర మృగ పక్షుల
మాంసము లుండెను మణిపాత్రల నట
పలువిధంబులగు పానీయంబులు
భక్ష్య భోజ్యములు పరగుచుండె నట
కనక రజత పాత్రముల [3]సౌరభము
[4]లొలయు మద్యములు వెలయు చుండె నట
వివిధపుష్పములు వివిధఫలంబులు
[5]తల్పము లెన్నియొ తనరుచుండె నట ॥శ్రీ॥

1 త్రాగి 2 పరవశులైనవారు 3 సువాసనలు 4 వ్యాపించు 5 ప్రక్కలు

91

సుందరు లచ్చట శుభ్రతల్పముల
పరుండి రొండొరు పట్టి కౌగిళుల
నిదుర మత్తుచే నెలంతలు కొందఱు
ప్రక్క చెలుల వస్త్రముల ధరించిరి
నిద్రితకాంతల నిశ్వాసమ్ముల
వారు ధరించిన చీరలు [1]పేరలు
స్వల్ప మారుత స్పర్శముచే వలె
నించుక కదలుచు నింపు వహించెను ॥శ్రీ॥

92

వివిధమాల్యముల వివిధధూపముల
మంచి గంధముల [2]మదిరారసముల
పలు కలపమ్ముల లలితసుమమ్ముల
కస్తూర్యాది సుగంధ వస్తువుల
పరిమళమ్ములను వహించి చల్లని
మెల్లని [3]పవనము లెల్లెడ వీచుచు
అట నిద్రించెడి అంబుజ నేత్రల
యింద్రియాళి నలరించుచు నుండెను ॥శ్రీ॥

1 దండలు 2 మద్యములచే 3 గాలులు

కాంచన వర్ణ విభాంచిత దేహలు
పారవశ్యమున పరుండి అచ్చట
నిశాసమయమున [1]నిమీలితాంబుజ
లైన పద్మినీలత ల ట్లొప్పిరి
[2] పవననందనుఁడు వారల నందఱ
పరికించెను తత్పరమతితోడను
ఆవరవర్ణిను లందెవ్వరిలో
జనకజ జాడలు కనఁబడ వాయెను ॥శ్రీ॥

94

మనోబలాంచితుఁ డనన్యచిత్తుఁడు
నగు హనుమంతున [4]కలమట కలిగెను
[5] ప్రసుప్త లగు పరవనితల నారసి
"అక్కటా! చేసితి నధర్మ మెంతయొ
ధర్మదూరుఁ డగు దశకంఠుఁడు సతి
జనకనందిని కొని తెచ్చుటచే
అకార్య మిటు చేయవలసి వచ్చెను
ఏమి చేతు" నని యెద కపి వగచెను ॥శ్రీ॥

---

1 మూసికొన్న పద్మములుగల 2 హనుమంతుఁడు 3 ఉత్తమ స్త్రీలయందు
4 విచారము 5 నిద్రించినవారు.

95

ఘన విశ్వాసమ్మున నిద్రించెడు
రావణాసురుని [1]ప్రమదల నందఱ
కాంచితి నైనను కలుగదు లేశం
బైన వికృతి నా మానసమందున
[2]సదసదవస్థల సర్వకాలముల
హేతువు మనసే ఇంద్రియవృత్తికి
[3]ఇంతి నింతులందే వెదకఁగ వలె
నాదన దఘం బని ఊఱడిల్లె కపి ॥శ్రీ॥

96

శుద్ధభావమున శోధించెను కపి
రావణు నంతిపురం బఖిలంబును
నాగకన్యకల [5]నాకకన్యకల
కాంచె నతఁడు జనకజ కనఁ డయ్యెను
అంత నతఁడు పానాలయంబు విడి
అంతిపురంబున కరిగెను వెదకఁగ
అచట కూడ నా అవనిజ కానక
పరితపించె మది [6]పరిపరివిధముల ॥శ్రీ॥

---

1 స్త్రీలను 2 మంచి చెడ్డ స్థితులందు 3 స్త్రీని 4 పాపము కలుగదు
5 దేవతాకన్యలను 6 అనేకవిధముల

# సర్గము - 12

97

ఎంత వెదకిన మహీసుత కనఁబడ
దాయె నకట ! మృతి నందిన దేమో !
స్వశీలరక్షణ పరాయ ణాత్మను
చంపె నేమొ [1]రాక్షస పతి దుష్టుఁడు
కాంచి రాక్షసాంగనల విరూపల
భీతి ప్రాణములు విడిచె నేమొ సతి
కనక సీత [2]విక్షతకార్యుఁడ నయి
యే మొగమున సుగ్రీవు చేరఁగల ॥శ్రీ॥

98

ఎంత వెదకినను ఇంతి కనఁబడదు
నిష్ఫల మయ్యెను నేను పడ్డ శ్రమ
తిరిగ పోఁగ వానరు లందఱు నను
చేరి ఏమి చేసి తని యడుగరా ?
అడిగిన జనకజ నరయకుండఁ జని
వారికి నేమని బదులు చెప్పుదును ?
వా రీ మాటకె [3] పరమపదించెరొ
అని హనుమంతుం [4]దలమటించె మది ॥శ్రీ॥

---

1 రాక్షసుఁడు 2 చెడిన పని కలవాఁడై 3 మృతినొందిరేమో 4 విచా రించెను.

౯౯

[1] అనిర్వేదమే అన్ని సంపదల
కన్ని సుఖంబుల కాదికారణము
జనులు చేయు [2]కర్జము లన్నిటియం
దదె చేకూర్చు జయంబు సిద్ధియును
కాన విడిచి దుఃఖము నుర్వీసుత
నుత్సాహము లోనూని వెదకెను
మరల మరల నని [3]మరున్నందనుం
డన్వేషణ కార్యమునకుఁ గడఁగెను ॥శ్రీ॥

100

ఎగురుచు నున్నత మగు ప్రదేశముల
కందుండక వెస క్రిందికి దూకుచు
ఎడనెడ నిలఁబడి కడువడి నరయుచు
పోయె తలపులను మూయుచు తెఱచుచు
చొచ్చుచు లోనికి వచ్చుచు బయటికి
వంగుచు లేచుచు పరుగులువాఱుచు
హనుమ వెదకె [4]చైత్యములు సరస్సులు
నతఁ డరయని చో టట లే దంగేఁడు ॥శ్రీ॥

---

1 శోకింపకుండుటయే 2 కార్యములు 3 హనుమంతుఁడు 4 గుడులు
5 అంగమాత్రమైనను.

101

వివిధాకారల వికృతావయవల
భీకరరూపల [1]స్వీకృతవేషల
నసురకాంతలను హనుమ కాంచె నట
జనకజ మాత్రమె కనఁబడ దాయెను
చారుగాత్రులను చంద్రనిభాస్యల
తనుమధ్యల విద్యాధరవనితల
నాగకన్యకల నారసె కపి యట
జనకజ మాత్రమె కనఁబడ దాయెను ॥శ్రీ॥

92

అనఘ వానరుల యత్నము లన్నియు
సాగరలంఘన [2]శ్రమ సకలమ్మును
వ్యర్థ మయ్యె నని వంత నొంది కపి
అంతిపురమ్మున నవనిజ లేదని
నిరాశ చెందుచు నిట్టూర్చుచు మది
పక్షిరాజు సంపాతి భూమిసుత
యిచ్చట నున్నటు లేల చెప్పె నని
కలఁత నొంది ప్రాకారము చేరెను ॥శ్రీ॥

---

1 గ్రహింపఁబడిన వేషముకలవారిని 2 సముద్రము దాటుటయందలి శ్రమ

# సర్గము - 13

103

లంకలోని దుర్గములు పర్వతము
లంతిపురమ్మును [1]అన్వేషించితి
శుభలక్షణ భాసురయగు సీతను
కాంచ నైతి నా కర్మం బే మన
[2]రామబాణ విత్రస్తుఁ డసురపతి
ఆకాశంబున నతివేగముతో
వచ్చుచుండ నా పతివ్రతామణి
[3]వననిధి మధ్యంబున పడె నేమో ||శ్రీ||

104

సిద్ధమార్గమున చెచ్చెర వచ్చుచు
సిద్ధులఁ గని [4]లజ్జిత మృతి నందెనో
[5]అసురరాజ బాహా కర్షనమున
నలిగిపోయి ప్రాణములు విడిచెనో
శీలావన నిశ్చిత మతి నామెను
క్రుద్ధుఁ డౌచు నసురుఁడె భక్షించెనో
రామా! లక్ష్మణ! రారే ప్రోవఁగ
నని రోదించుచు నసువులఁ బాసెనో ||శ్రీ||

---

1 వెదకితిని 2 రామ బాణములవలన భయపడిన రావణుఁడు 3 సముద్రము 4 సిగ్గుపడినది 5 రావణుని భుజముల ఒరపిడివలన.

105

రావణు భవనములం దేమూలనో
1 గూఢ నిహిత యై గాఢశోకమున
పంజర మధ్య నిబద్ధము దీనము
గోరువంక వలె 2కుములుచు నుండెనో
జనకు దుహిత రాముని ప్రియభామిని
కమల నేత్ర రాకా చంద్రానన
అగు నా సాధ్వికి నక్కటకటా!
చివరి కెట్టి దుస్థితి సంభిల్లెనో ॥శ్రీ॥

106

3 ప్రియదయితుండగు శ్రీరామునిఁ గని
జనకజ కన లేదని యెటు చెప్పుదు
తెల్పిన దోషమె తెల్ప కున్నచో
నదియును దోషమె యగు నెట్లో కద
సీత కనక కిష్కింధ కరుగుచో
నమరును పురుషార్థము నా కెయ్యది
శ్రమ మంతయు నిష్ఫల మై పోయిన
దని తలపోయుచు 4వనరెను మది కపి ॥శ్రీ॥

1 రహస్యముగానుంచఁబడినదై 2 దుఃఖించుచుండెనో 3 ప్రియుఁడైన వల్లభుఁడు 4 విచారించెను.

107

1 అకృతకార్యుఁ డగు నంజనాత్మజుం
డపుడు దుఃఖితుం డై యిటు తలఁచెను
జనకజ కనలే దను దుర్వార్తను
విని శ్రీరాముఁడు విడుచు ప్రాణముల
నది విని లక్ష్మణుఁ డసువులు వాయును
వారల మృతి విని భరతుఁడు 2మడియును
సోదరశోకము చుఱచుఱ 3సూడిన
దురపిల్లుచు శత్రుఘ్నుఁడు సమయును ॥శ్రీ॥

108

పుత్రుల మృతి విని మువ్వురు రాణులు
కౌసల్యయు కైకయును సుమిత్రయు
5 దీర్ఘ శోక సముదీర్ణ హృదయ లై
6 యమసదనమునకు నరుగ కుందురే
తన్మరణము విని తను ధనములు విడి
కృతజ్ఞుఁ డగు సుగ్రీవుఁడు మడియడె
అది యెఱింగి 7రుమ అసువులు విడుచును
అంత తారయును నంగదుఁ 8డఱుదురు ॥శ్రీ॥

---

1 చేయఁబడని కార్యముకలవాఁడు 2 చచ్చును 3 కాల్పఁగా 4 మరణించును 5 అధిక దుఃఖముచే చీల్చఁబడిన హృదయములు కలవారై 6 నరకమునకు 7 సుగ్రీవుని భార్య 8 నశింతురు.

109

ప్రభువంశము [1]విధ్వంసమ్మను విని
తద్గౌరవ సత్కారము లందిన
[2]వనచరు లందఱు ఘనదుఃఖమ్మున
వివశ చిత్తులై విడుతు రసువులను
కపివర లందఱు కలిసి యొక్కచో
ఆటలాడు భాగ్యం బిఁక కలుగదు
నే నట కరిగిన విక్రమ రోదన
నినదంబులనే వినఁగా వలయును ॥శ్రీ॥

110

అవనీసుత నిట నరయ కుండనే
చనుచో ముప్పిది జరుగక తప్పదు
చనకుండినచో హనుమ వచ్చు నను
ఆశతోడ వా రండఱు నుందురు
కందమూలములు కలయెడ నెటనో
[4]వానప్రస్థుఁడ నై నే నుందును
రేక జలంబులనో [5]కన దగ్నినొ
పడి మడిసెద నని యెద తలఁచెను కపి ॥శ్రీ॥

---

1 నాశము 2 కోతులు 3 ఆపద 4 తృతీయాశ్రమమునందున్నవాఁడు
5 మండుచున్న అగ్నియందో.

111

అని మనమున కపి అనుకొను చుండనె
మఱి యొక భావము స్ఫురణకు వచ్చెను
తోఁచు నాశమున [1]దోషము లెన్నొ
బ్రదికియున్న [2]భద్రములు పడయ నగు
అసువులు పోయెడు నంతదాఁక నా
అవనీనందిని నన్వేషించెద
చచ్చిన పిమ్మట నల్పెడి దే మిక
నని పొందెను నూతన ముత్సాహము ॥శ్రీ॥

112

మరల నతఁడు నెమ్మనమునఁ దలఁచెను
వధియించెద రావణు నొక క్షణమున
సీతాహరణము చేసిన దానికి
సరి యగు [3]ప్రతిక్రృతి సల్పిన యట్లగు
లేక యా ఖలుని [4]వీక పట్టుకొని
వినువీధిని వేవేగ నెగిరి చని
పశుపతి చెంతకు పశువు నట్లుగా
దశరథసుతు చెంతకుఁ గొనిపోయెద ॥శ్రీ॥

---

1 మంగళములు 2 మేలు సేఁత 3 పరాక్రమముతో 4 శిఘ్రనిచేఁతకు

అని హనుమంతుఁడు ధ్యానమగ్నుఁడై
అది యుచితము కాదని తలపోయుచు
జనకజరాజసుత కనఁబడు వఱకును
మరల మరల నీ పురమును వెదకెద
అదిగో కనఁబడు నశోక తరువన
1 మవిచితపూర్వం బందు 2రోసెదను
తాపసికిని కృత తపః ఫలము వలె
జనకతనయ రాముని కర్పించెద ॥శ్రీ॥

114

జలజపత్ర లోచనము 4నున్నసము
ధవళ దంతము సుధాకర తుల్యము
శుచి స్మితము భాసుర 5మనవద్యము
నమ్మ ముఖము నెపు డరయుదునో కద
అశ్విను లగ్నియు నా మరుత్తులును
పాశహస్తుఁ డగు వరుణుఁ డింద్రుఁడును
చంద్రసూర్యులును సకలభూతములు
కూర్తురు గాక నాకు కార్యసిద్ధిని ॥శ్రీ॥

---

1 పూర్వము వెదకఁబడినది 2 వెదకెదను 3 చేయబడిన తపస్సుయొక్క ఫలము నట్లుగా 4 ఎత్తయిన ముక్కు కలది 5 నిర్దోషము.

# 115

రామచంద్రునకు లక్ష్మణసహితున
కవనీసుత కార్యకు నమస్కృతులు
యముని కింద్రునకు ననిల రుద్రులకు
[1] రవి శశి కపిపతులకు నమస్కృతులు
అని [2] ప్రహస్వాంగుం డయి హనుమంతుఁడు
రయమున ప్రాకారమ్ముపై కురికి
వసంత మాస ప్రారంభమున
పుష్పిత మగు వనమును దర్శించెను ॥శ్రీ॥

## సర్గము - 14

# 116

సాలవృక్షముల చంపక తరువుల
చూత భూజముల చూచెను కపి వని
రజత కనక వర్ణముల చెట్లచే
వనము విచిత్రంబై యలరారెను
పరిమళ సుమముల ఫల భారమ్ముల
[3] విటపు లన్ని కనువిం దొనరించెను
కొదమ తుమ్మెదల కోయిలగుంపుల
[4] కలరావమ్ములు చెలగుచుండె నట ॥శ్రీ॥

---

1 సూర్యునకు చంద్రునకు సుగ్రీవునకు 2 పొట్టిదేహము కలవాడయి
3 చెట్లు 4 మధుర ధ్వనులు.

## 117

పృథ్వీతనయను వెదకుచు [1]మారుతి
సుప్తము లగు పక్షుల మేల్కొలిపెను
ఎగిరెడి పక్షుల రెక్కల తాకిడి
అవనిజములు కదలాడఁ దొడఁగెను
కదలెడి తరుశాఖలలో నుండియు
రాలెను పలువర్ణముల పుష్పములు
[3]కుసుమ సంవృతాంగుఁడు హనుమంతుఁడు
పుష్ప పర్వతము పోలిక నొప్పెను ॥శ్రీ॥

## 118

అవనిజ శాఖల నటు నిటు దుమికెడి
హనుమ వసంతుని యట్లు కనఁబడెను
రాలిన పూవుల రంగుల నట భువి
భూషిత సుందరి [4]పొదమి నలరెను
ఆకుల ఫలముల నలరుల రాలిచి
[5]రిక్తములై పోయిన వృక్షమ్ములు
ఓడి పందెమున [6]ఉడుపులు [7]తొడవులు
విడుచు జూదరుల వడువున [8]తోచెను ॥శ్రీ॥

---

1 హనుమంతుఁడు 2 నిద్రించిన 3 పూలచే చుట్టఁబడిన దేహముకలవాఁడు
4 విధమున 5 శూన్యములు 6 దుస్తులు 7 నగలు 8 విధమున.

119

వానకాలమున వాయువు గిరిఁ గల
[1] ఘనముల గుంపుల కలఁచు నట్లుగా
హనుమంతుం డా వనమునందుఁ గల
చెట్లను తీఁగల చెదరఁ గొట్టఁగా
వీడిన [2]కచములు వాడిన రంగులు
[3] దష్టాధర నఖ దంత క్షతములు
కలఁగిన సరములు కల యువతీమణి
వలె నపు డశోకవని చూపట్టెను ॥శ్రీ॥

120

మణిభూములు కాంచన వర భూములు
విలసిత పద్మోత్పల వనములతో
జలపక్షుల రవములతో కూడిన
వారి పూర్ణములు చారు వాపికలు
ప్రవాళ ముక్తారజో వితతములు
స్ఫటిక మయము లగు [5]వర కుట్టిమములు
[6] తీరజములు బలగారు వృక్షములు
హనుమంతుఁ డట కని ముద మందెను ॥శ్రీ॥

---

1 మేఘములు 2 కేశరములు 3 చుంబితములైన అధరములు, గోళ్ళ వ్రణములు 4 చెదరిన హారములు 5 శ్రేష్ఠమైన జాతికట్టడపు నేలలు 6 తీరమునందు పుట్టిన.

## 121

శిలాగృహమ్ములు చిత్ర శిఖరములు
వివిధ వృక్షములు విహగ సంతతులు
కలిగియంబుదము[1] వలె సున్నత మగు
నగ మొక టచట కనంబడె నతనికి
హంస ప్రముఖ విహంగమ శోభిత
పద్మవనమ్ముల భాసిలు నొక నది
గిరికొననుండియు క్రిందికి జాఱుచు
పతి వక్ష శ్చ్యుత సతి వలె నొప్పెను ॥శ్రీ॥

## 122

చిరు మువ్వల శింజితముల [3]నీనుచు
గాలికి కొమ్మలు కదలుచుండఁగా
పూచిన కుసుమమ్ములు లేచిగుళులు
నందములై కనువిందు చేయఁగా
కనక కాంతి నల్గడలఁ జిమ్మ నొక
అశోక వృక్షము హనుమంతుఁడు కని
దాని నెక్కి [4]పుత్తడి గిరి కొనపై
నుదయించిన సూర్యుని వలె మెఱసెను ॥శ్రీ॥

---

మేఘము 2 భర్త ఱొమ్మునుండి జాఱిన వనితవలె 3 ధ్వనులను
బంగారుకొండ శిఖరముపై.

123

వన మిది యెంతో మనోహరమై
జనకజ [1]యునికికి సరిపడి యున్నది
నిర హాతుర యా పరమపతివ్రత
వికల చిత్త యిచటికి రావచ్చును
సంధ్యా పూజను సలుపుటకై యీ
[2]తటికిని స్నానార్థం బేతెంచును
అని తలఁచుచు కపి ఆవృక్షముపై
[3]నాసీనుండై అరసె నల్గడలు ॥శ్రీ॥

## సర్గము - 15

124

అలరు లనెడి చుక్కలతోఁ గూడిన
విస్తృతం బయిన [4]వియత్తలము వలె
పలువన్నెల సుమము లనెడి మణులకు
తావల మగు [5]రత్నాకరమ్ము వలె
కల్ప భూమిరుహ కమనీయం బగు
[6]నాకనాథు నందన వనమ్ము వలె
చిత్రము [7]ధనపతి చైత్రరథము వలె
నా అశోక వన మలరె రమ్యముగ ॥శ్రీ॥

---

1 ఉండుటకు 2 నటకి 3 కూర్చుండి 4 ఆకాశతలము 5 సముద్రము
6 ఇంద్రుని 7 కుబేరుని వనము.

125

ఆ అశోకవనమం దొక వృక్షము
క్రింద హనుమ [1]వీక్షించె నొక్క సతి
సదోపవాస కృశాంగము దానిని
వికృత స్త్రీ పరివృత యగు దానిని
నయన వారి పూర్ణ ముఖము దానిని
[2]సతత దీర్ఘ నిశ్వాసము దానిని
పీత మలిన [3]సంవీతము దానిని
పతి చింతా గత భావము దానిని ॥శ్రీ॥

126

వాడి [4]వత్తలై బంధు దూరమై
భీతచిత్తయై [5]వ్రీడిత ముఖియై
దైన్యమూర్తియై ధ్యానమగ్నయై
సుఖార్హ యయ్యును, శోకతప్తయై
[6]సితపక్షాదని చంద్రరేఖ వలె
పద్మరహిత యగు [7]పంకజలత వలె
తత [8]ధూమావృత హుతవహ శిఖ వలె
వికలాకృతి నా వెలది యుండె నట ॥శ్రీ॥

---

1 చూచెను 2 ఎల్లప్పుడు విడుచు నిట్టూర్పులు కలదానిని 3 కప్పుకొనిన వస్త్రము 4 వాడిపోయి శుష్కించినదై 5 సిగ్గుపడిన 6 శుక్లపక్షము మొదట 7 పద్మలత 8 ఎక్కువ పొగచే చుట్టబడిన అగ్నిజ్వాలవలె.

127

కంజనయన [1]రాకా చంద్రానన
సుతనువు సుభ్రువు సుమధ్య సుందరి
బింబాధర పృథ్వీ తల నిషణ్ణ
ఏక వేణీధారిణి మలి నాంబర
దీర్ఘ నిశ్వసన దీన [2]అమండన
ధైర్య రహిత కృశ తను వతి భీరువు
దుఃఖ తప్త నా తొయ్యలి నారసి
మది శోకము సంబరము నొందె కపి ॥శ్రీ॥

128

సందేహంబును పొందిన స్మృతి వలె
[3]విధ్వస్తం బగు వృద్ధి మాదిరిగ
ప్రతిహతమై [4]చేడ్పడిన ఆశ వలె
హతమై పోయిన యట్టి శ్రద్ధ వలె
కలుషీకృతమై కలఁగన మతివలె
[5]క్షయ మందిన సత్కార్య సిద్ధి వలె
ఉన్న యామెఁ గని [6]ఉర్విజ యగునా
కాదా యని మది కపి శంకించెను ॥శ్రీ॥

---

1 పున్నమచంద్రునివంటి ముఖము కలది 2 అలంకారములు లేనిది
3 నాశము 4 కీడుపొందిన 5 నాశము 6 సీత.

129

[1] అసంస్కారమై అన్యార్థంబును
దాల్చు వాక్కు నర్థమును [2]బుధుఁడు వలె
అవనీపతిసుత నరసి కపి వరుఁడు
జనకజ యని [3]క్లేశమున గ్రహించెను
అవనిజకు నే ఆభరణమ్ములు
కల వని తనతో పలికెనా రాముఁడు
అవి యన్నియు నిక్కమ్ముగ నతనికి
పాదపశాఖలపై కనిపించెను ॥శ్రీ॥

130

[4] దితిజుఁడు తను కొని తెచ్చెడు నప్పుడు
సీత భూమి [5]ధర శిఖ రాగ్రముపై
పడవైచిన యాభరణ మొక్కటియు
కపికి వాసిలో కనరా దయ్యెను
ఆమె ధరించిన యట్టి [6]పుట్టమును
మును గిరిపై విసరిన యా పైటయు
నొకటే రంగయి యుండుటచే కపి
ఆమె సీతయే యని తలపోసెను ॥శ్రీ॥

1 సంస్కారహితమై 2 పండితుఁడు 2 కష్టముతో 4 రావణుఁడు
5 కొండశిఖరముపై 6 వస్త్రమును.

అబల నష్ట యని అతి కారుణ్యము
[1] ఆశ్రిత కనరా దని యనుతాపము
ఆలి గోల్పడితి నని ఆరాటము
ప్రియ లేదని పెను విరహ బాధయును
ఈ నాలుగు మది నేచఁగ రాముఁడు
అనిర్వార్ణ్య మగు నార్తికి గురి యయి
వనరుచుండు నని భావించుచు మది
హనుమంతుఁడు దుఃఖావిలుఁ డయ్యెను ॥శ్రీ॥

132

రామునిపై సీ [4] రామ మనస్సును
రమణిపైని దశరథ సుతు మనసును
నిశ్చలమ్ముగా నెలకొని యుండుట
వీ రిద్దరు జీవింతు రెట్టులో
విడిచి ఈమె రాముఁడు మనఁ గల్గుట
పర మాశ్చ ర్యావహముగ నున్నది
అని జనకజఁ గని హనుమ [5] హృష్టుఁడై
రాము నెంచి మది ప్రశంస చేసెను శ్రీ

---

1 తన్నాశ్రయించినది 2 భార్యను 3 వర్ణింపరాని 4 సతి (సీత) 5 సంతోషించినవాఁడై.

# సర్గము - 16

133

అనఘుఁడు శ్రీరాముని కిల్లాలై
లక్ష్మణునికి గౌరవ పాత్రంబై
అలరు సీత కి [1]ట్టార్తి కల్గె నన
కాలము [2]దురతిక్రమ మగును కదా
తగు నీ సతి యా దశరథసుతునకు
తగును దశరథుని తనయుఁ డీ సతికి
వచ్చును పతి యని బ్రతికెడి నీయమ
అని కపి సీతను కని తలపోసెను ॥శ్రీ॥

134

బలసంపన్నుఁడు వాలి కబంధుడు
భీమ విక్రముఁడు విరాధ నాముఁడు
జనస్థాన రాక్షసులు [3]చతుర్దశ
సహస్ర సంఖ్యలు సహ [4]పరివారులు
ఖరుఁడు త్రిశిరుఁడును ఖలుఁడు దూషణుఁడు
చంపఁబడిరి యీ సతికొఱకే కద
అని మనమున తలఁచెను కపివీరుఁడు
నవ సువర్ణ వర్ణను సీతను గని ॥శ్రీ॥

---

1 బాధ 2 అతిక్రమింప శక్యముకానిది 3 14వేల సంఖ్యలుకలవారు
4 పరివారముతోఁ గూడినవారు 5 క్రొత్త బంగారు రంగువంటి రంగు
కలదానిని.

## 185

వాలి పాలితము వానర రాజ్యము
నిన సుతుఁడగు సుగ్రీవుఁడు పొందుట
శత యోజన విస్తారము వారిధి
ధైర్యముతో నే తరించి వచ్చుట
శంక లేక నే లంకా నగరము
వెతఁకు టంత యీ సతి కొఱకే కద
అని మనమున తలఁచెను కపి వీరుఁడు
నవ సువర్ణ వర్ణను సీతను గని ||శ్రీ||

## 186

ధర్మ వర్తనుఁడు దాతుఁడు మహితుఁడు
నగు మిథిలేశుని ఆత్మజ యీ సతి
క్ష్మాతలమునుఁ నాగలితోఁ దున్నఁగ
ఉత్థితమైన గుణోజ్జ్వల యీ సతి
దశరథ భూమిధవునికి కోడలు
రామచంద్రుఁ నిల్లాలు య[illegible]స్విని
అక టకటా ! దనుఁ[illegible]
నని హనుమంతుఁడు మనమునఁ వనరెను ||శ్రీ||

137

విడిచి భోగములు [1]వెత లెక్కింపక
భర్తృ సేవయే పరమావధిగా
ఫల మూలమ్ములు భక్షించుచు సతి
జన విరహిత మగు వని కేతెంచెను
సకల లోక రాజ్య మైన నీ సతి
గోటి చివరకును సాటి రాఁగలదె
ఈమె విడిచి యా రాముఁ డెట్లు మను
నని హనుమంతుఁడు మనమున వగరెను ॥శ్రీ॥

138

[3]అనర్థంబులకు [4]ననర్హ యీ సతి
అనుభవించు [5]యాతన లెన్నో యిట
కామ భోగ సౌఖ్యములు బంధు తతి
విడిచి రాక్షసుల నడుమ బడలు నిట
ఫలములు కోరక [6]ప్రసవము లొల్లక
పతినే నిరతము భావన చేయును
రాముఁ డీమెకై భూమి [7]యెల్ల గ్రొ
చ్చిన నది యుక్త మె యని కపి తలఁచెను ॥శ్రీ॥

బాధ 2 జీవించును 3 కీళ్ళకు 4 తగనిది 5 బాధలు 6 పూలు
త్రవ్వినను.

139

1 పిపాసితుఁడు చలివందిరి నట్టులు
రాజ్య భ్రష్టుఁడు రాజ్యము నట్టులు
2 కడలి పడినవాఁ [3]డుడుపము నట్టులు
పొందదగును రాముం డీ సాధ్విని
విడిచి ఈను రాముఁడు మను నకటా!
సలుపు నెంత దుష్కర కార్యంబును!
అని యా దంపతులను మది నెంచుచు
కపివరుండు దుఃఖ వివశుఁ డయ్యెను ॥శ్రీ॥

140

సతులకు పతి [4]భూషణ భూషణ మగు
నీమె కుతిలపడు [5]ప్రియ విరహితయై
6 హిమహత పద్మిని క్రమమున నీ సతి
వ్యసనావళిచే పరిపీడితయై
సహచర విరహిత చక్రవాకి వలె
దీనస్థితి పొందింపఁబడె కటా!
అని ఆ పొలతుక జనకజయే యని
పోల్చి హనుమ [7]తరువున కూర్చుండెను ॥శ్రీ॥

---

1 దప్పిగొన్నవాఁడు. 2 సముద్రమునందు 3 తెప్ప 4 నగలకు నగ
5 దుఃఖించును 6 మంచుచే కొట్టఁబడిన పద్మలతవలె 7 చెట్టుపై

141

అంత హంస [1]నీలాంబువులం బలె
తోచి మింట చంద్రుడు నిర్మలుడై
సాయము చేయగనో యన కపిపై
చల్లెను తెల్లని చల్లని కాంతులు
చింతా భర నత సీత కనంబడె
భార యుతంబగు పడవ నీట వలె
ఆమె సమీపమునందే భీకర
దర్శన లుండిరి [3]దానవకాంతలు ॥శ్రీ॥

142

ఒకకన్నొక చెవి ఒక [4]కేలొక కా
లొరగిన శిరసులు నొదల కన్నులు
శంకు కర్ణములు వంకర ముక్కులు
పింగళ కేశమ్ములు కలవారిని
లంబోష్ఠమ్ములు [5]లంబజానువులు
లంబకర్ణములు లంబాననములు
లంబోదరములు లంబకుచమ్ములు
కల వారిని జనకజ కడ కనె కపి ॥శ్రీ॥

---

1 నల్లనినీళ్ళయందు 2 ఆకసమున 3 రాక్షసస్త్రీలు 4 చేయి 5 మోకాళ్ళు.

## 143

కొందఱు [1]కుబ్జులు కొందఱు హ్రస్వులు
కొందఱు క్రూరులు కొందఱు వికటులు
కొంద [2]అనాసులు కొంద [3]అకేశులు
కొందఱు కుపితులు కొందఱు మత్తులు
[4] వ్యాఘ్ర వరాహ ఖ రాస్యులు కొందఱు
[5] అసి కాలాయస హస్తులు కొందఱు
రక్త మాంస సంసక్తులు కొందఱు
కానఁబడిరి రాక్షసులు కపి కచట ॥శ్రీ॥

## 144

ఆ రాక్షస కాంతావళి నడుమను
హనుమంతుఁడు కాంచెను జనకాత్మజ
క్షీణ పుణ్య యై క్షితిపై రాలిన
తారక పోలిక తనరెడు దానిని
పతి సందర్శన భాగ్యము లేమిని
అఘు శోక సంకుల యగు దానిని
బెదరి యూధమున సింహారుద్ధయై
[8] గజ వధు వట్టులు కలఁగెడి దానిని ॥శ్రీ॥

---

1 పొట్టివారు 2 ముక్కులేనివారు 3 జుట్టులేనివారు 4 పులి, పంది, గాడిద యనువాని ముఖములవంటి ముఖములు కలవారు 5 కత్తి 6 నశించిన పుణ్యము కలదై 7 గజసమూహమున 8 ఆడు ఏనుఁగు.

145

జల దాంతంబున[1] శారద వారిద
సమావృతం బగు[2] చంద్ర రేఖ వలె
చెదరిన ఆకృతిచే సరి చేయని
తీగలఁ గూడిన దివ్య వీణ వలె
ఏ తొడవులు[3] ధరియింపని కతమున
పూవులు రాలిన పుష్పలతిక వలె
పంక దిగ్ధ యగు పద్మవల్లి వలె
నున్న సీత వాయుజుఁడు కనుంగొనె. శ్రీ

146

అతి దుఃఖిత మలినాంబర యయ్యును
సహజ కాంతి భాస్వ ద్వద నాంబుజ[4]
యైన సీతఁ గని హనుమంతుఁడు మది
నప్రతిమం బగు హర్షము నందెను
ఆనం దోత్థము[5] లగు బాష్పమ్ములు
రెండు నేత్రముల నిండఁగ నాతఁడు
రామచంద్రునకు లక్ష్మణ సహితున
కెరగి శాఖి[6] సంవృతుఁడై యుండెను. శ్రీ

---

1 వర్షాకాలముచివర 2 శరత్కాలమేఘములచే చుట్టఁబడిన 3 నగలు 4 సహజమైనకాంతితో ప్రకాశించు పద్మమువంటి ముఖముకలది 5 సంతోషమువలన పుట్టిన 6 చెట్టునందు.

## సర్గము 18

147

అపుడు వేగుజా మయ్యో తమ మడఁగె[1]
లంకాపురి నలువంక వినంబడె
సాంగ వేద విద్యానిష్ణాతుల
బ్రహ్మ రాక్షసుల బహు వేద ధ్వని
వాద్య మంగళ స్వన సంతతిచే
ప్రబోధితుఁడు[2] రావణుఁడు మేలుకొని
ప్రశస్త వస్త్ర భూషణ మాల్యంబుల
నమరుచుకొని జనకాత్మజ తలఁచెను. శ్రీ

148

అతను తాప పీడితుఁ[4] డగు నాతఁడు
అడఁచుకొనఁగ లే కాత్మ వికారము
పలు విధముల చెట్టులు పుష్పమ్ములు
రత్న ఖచిత తోరణముల గణములు
విమల వారి శోభిత[5] తటాకములు
నానా మృగ సంతతులు విహగములు[6]
తనరెడి అశోక వనమున కరిగెను
జనకజ గన భూషణ భూషితుఁడై. శ్రీ

---

1 చీకటి 2 మేల్కొలుపఁబడినవాఁడు 3 జారిన 4 మన్మథతాపము
5 చెఱువులు 6 పక్షులు.

149

గంధ ర్వామర కాంత లింద్రు వతె
ననుసరించి రాతని శతవనితలు[1]
కనక దీపికలు గ్రహించి కొందఱు
తాళ వృంతములు[2] దాలిచి కొందఱు
వాల వ్యజ నావళితో కొందఱు
నడచి రతని వెంటనె మెల మెల్లగ
ఒకతె మద్య పాత్రిక మణిమయమును
దక్షిణ కరమున ధరించి యుండెను. శ్రీ

150

జల పూరిత భాజనములు[3] దాలిచి
కొంద ఱంగనలు ముందర నడచిరి
పూని ఖడ్గములు బ్రుసులు[4] కరంబుల
నారులు కొందఱు నడచిరి వెన్కను
స్వర్ణ దండమును శశి ప్రభమ్మును[5]
గొడుగు పట్టె నొక కోమలి యతనికి
సీతాసక్తుఁడు[6] చిత్తజ వశుఁ డగు
దశ కంఠుఁడు మందమ్ముగ నడచెను. శ్రీ

---

1 వందమంది స్త్రీలు 2 తాటియాకుల విసనకఱ్ఱలు 3 నీటితో నిండిన పాత్రలు 4 ఆసనములు 5 చంద్రునికాంతివంటి కాంతికలదానిని 6 మన్మథునికి వశుఁడు.

## 151

ఆగోచరుండుగ[1] నశోకశాఖల
నాసీనుం డగు ననిల తనూజుఁడు[2]
నారుల ఒడ్డాణమ్ముల రవములు[3]
నందెల చప్పుడు నాకర్ణించెను
మదన వశుం డయి మద పరీతుఁడై
ఆయత తామ్రము లగు నక్షులతో
ద్వార తలమ్మును చేరఁగ వచ్చిన
పంక్తి కంఠు రావణు దర్శించెను.



## 152

అంగద సక్తము[4] నతిధవళమ్మును
అంబరమును[5] పై కాకర్షించుచు
బల సంపన్నుఁడు పా శోన్మత్తుఁడు
చిత్ర భూష ణాంచిత సర్వాంగుఁడు
శంకు కర్ణుఁ డా లంకా పుర పతి
చారు కామినీ జన పరివృతుఁడై
సుందర తారా బృంద పరివృతుం
డగు చుక్కల రాయని[6] వలె నలరెను.



---

1 కనబడకుండ 2 హనుమంతుఁడు 3 ధ్వనులు 4 భుజకీర్తులకు తగులు కొన్న 5 వస్త్రమును 6 చంద్రుఁడు.

153

ఆ ప్రతిమాన పరాక్రమ శోభితుఁ[1]
డతఁడే రావణుఁ డని మది నెంచుచు
అతని చక్కఁగా నరయుట కొఱకై
దిగువ శాఖలకు దిగె హనుమంతుఁడు
బల తేజ సంపన్నుం డయ్యును
అసురుని తేజము నరసి చకితుఁడై
ఒరులకు[2] కనఁబడకుండ తరువుపై
సాంద్ర పర్ణముల సంవృతుఁ డయ్యెను[3]. శ్రీ

## సర్గము 19

154

అంత రావణుం డవనీజాతను
కాంచఁ గోరి యక్కడి కరుదెంచెను
కనక విభూషణ కలిత దేహుఁ డగు
నసుర నాయకుని నరసి జనక సుత
ఘన వాతంబున కదళీ తరు వటు[4]
కంపించుచు నధికం బగు భయమున
కుక్షి నూరువుల[5], కుచముల కరముల
కప్పి యేడ్వఁగాఁ గడఁగె దీనముగ. శ్రీ

---

1 సాటిలేని విక్రమముతో ప్రకాశించువాఁడు 2 ఇతరులకు 2 దట్టమైన ఆకులచే కప్పఁబడినవాఁడు 4 గొప్పవాయువుచే నరటిచెట్టువలె 5 ఉదరమును, తొడలను.

155

అసంవృతం బగు నవనీతిలమున[1]
నూని వ్రతము కూర్చుండిన దానిని
విదళిత మై పృథివిం బడి యుండిన
వృక్ష శాఖ వలె పెం పఱు దానిని
తలపుల[2] హయములఁ దార్చిన కోరిక
రథమున పతి చేర నరుగు దానిని
ప్రియ విర హార్తి తపించెడి దానిని
కాంచె నచట రాక్షసపతి సీతను. శ్రీ

156

మంత్ర రుద్ధయై మఱుగు నురగి వలె[3]
అపవాదముచే నడఁగు కీర్తి వలె
మనన విరతి[4] నేమఱిన విద్య వలె
ప్రతిహత మై చేడ్పడిన[5] ఆశ వలె
అంధకార వృత మైన కాంతి వలె
హత యోధం బగు నట్టి సేన వలె
నడుమ విఘ్నముల చెడిన పూజ వలె
క్షితి సుత యుండెను చెట్టుక్రింద నట. శ్రీ

---

1 వట్టినేలపై 2 సంకల్పములనెడి గుఱ్ఱములను పూన్చిన అభిలాషయనెడి రథమున 3 మంత్రముచే బంధింపఁబడి బాధపడు నాగుపామువలె 4 మననములేమిచే 5 కీడొందిన.

## 157

ఉపవాసంబున నురు శోకంబున
నధిక తాపమున నతి దైన్యంబున
కృశ శరీరయై[1] కీర్ణ కేశ యై
ఉదిత భీతి నిట్టూర్పులు పుచ్చుచు
శూన్య హృదయ యై చూడ కెవ్వరిని
కుమిలి యేడ్చు నా కోమలి నారసి
దశకంఠుఁడు సాంత్వన వాక్యంబుల[2]
ప్రీతి చిత్త కావింపఁ దలంచెను. శ్రీ

# సర్గము 20

## 158

నను( గని సుందరి! స్తనముల నుదరము
కప్పి చూపు[3] నాకట్టెదు భయమున
సకల గుణాంబుధి సర్వ మనోహర!
అనురక్తుని న న్నాదరింపవే
నరు లసురులు[4] నీ దరికి రా రిచట
భయ మొదవదు నావలన నొకింతయు
దనుజాళికి పరవనితల పొందుట
పాపము కాదని పలికె రావణుఁడు. శ్రీ

---

1 చెదరిన జుట్టుకలదై 2 అనునయవచనములచే 3 అడ్డగించెదవు
4 రాక్షసులు.

159

నను కామింపని నిను గాంచుటకై
సాహసింప తమి[1] సహింతు నెట్లో
భయ మేటికి విశ్వాస మెలర్పఁగ
ప్రేమింపుము నను విడువు దుఃఖమును
ఏకవేణివై[2] యిల శయనించుట
ఉపవాసము చేయుచు కృశియించుట
మలినమైన యంబరము[3] ధరించుట
కలికీ! తగ దని పలికె రావణుఁడు.   శ్రీ

160

అగరు చందనము లంతుల[4] దండలు
వివిధ వస్త్రములు సభూషణములు
శయనాసనములు స్వాదు పానములు[5]
గాన నృత్యములు గాంచి సుఖింపుము
జవ్వన[6] మరిగిన చనిన జలము వలె
తిరిగి రాదు సుమి దేవి! యెవ్వరికి
నను పొందియు భూషణ విరహితవై
వనరు టేటి కని పలికె రావణుఁడు   శ్రీ

---

1 మోహము 2 జడకట్టిన కేశములు కలదానవై 3 వస్త్రము 4 పూవుల 5 తియ్యని పానీయములు 6 యౌవనము.

161

అరసి నిన్ను నీ యంతము నారసి
ఎవరు రమణి! మోహింప కుందురే!
నీ యంగమ్ముల నిలిచిన చూపులు
కాంత! మరల వెనుకకు రాకున్నవి
లోకోత్తర మగు రూపము నీయది
సృజించి విధి[1] యిఁక సృష్టి మానుకొనె
తిరిగి యిట్టి మూర్తిని నిర్మించుట
తల[2] మగునే యని పలికె రావణుఁడు. శ్రీ

162

నానా నగ రాన్వీత[3] మెల్ల భువి
జయించి నీకై జనకున కిచ్చెద
లోకములందున నాకు ప్రతి బలుఁడు
లేఁడు సుమా పూబోఁడీ! నిజముగా
అద్వితీయ శౌర్యమున ముజ్జగము
లోరిచి[4] తెచ్చిన నారు లందఱికి
అగ్ర మహిషివై అనుఁగు పత్నివై
పడయు సుఖము లని పలికె రావణుఁడు. శ్రీ

---

1 బ్రహ్మ 2 శక్యము 3 వివిధ పట్టణములచే విస్తృతమైన 4 ఓడించి

163

సహజ చారుతా సదనము[1] నీ తను
వలంకృతం బై అతి భాసుర మగు
ఆ సౌందర్యము నరాయఁ గోరెదను
తరుణీ! తొడవులు[2] ధరియింపఁగదే!
యథేష్టముగ నీ వఖిల భోగముల
నంది త్రాగి తిని యానందింపుము
అడిగిన వస్తువు లఖిల బంధులకు
చెలులకు ని మ్మని పలికె రావణుఁడు. శ్రీ

164

సిరి గోల్పడి[3] వనసీమ చరించెడు
రామువలన నే లాభము నీ కగు
వానప్రస్థ వ్రత మొనరించెడి
అతఁ డీ పాటికి మృతి గనె నీమో
నా వశమున నున్న నిన్ను నాతఁడు
మరల పొందు టది కర[4] మసంభవము
గరుడుఁడు పామును కరణి నా మనము
చెలి! హరింతు వని పలికె రావణుఁడు. శ్రీ

---

1 సహజమైన అందమునకు నిలయము 2 నగలు 3 సంపదను గోల్పోయి
4 మిక్కిలి.

165

అంతఃపుర గత లతివ లెల్ల నిను
నచ్చర లిందిర[1] నట్లు భజింతురు
తపసున బలమున ధైర్యమునందున
రాముఁడు నా కెన[2] రాఁడు తలోదరి!
నినుఁ గాంచిన యా నిముసముచుండియు
కలుగదు నిజ కాంతలయెడ రాగము
పొంది న న్నఖిల భోగ పరంపర
నరలఁగదే యని పలికె రావణుఁడు. శ్రీ

## సర్గము 21

166

కామార్తుఁడు[3] రాక్షస పతి పల్కిన
వచనమ్ములు విని భయ కంపితయై
శోకము సైఁపఁగ లేక దీనయై
పతి యగు రాముని మతి తలపోయుచు
హీన స్వరయై యేడ్చుచు వెనుకకు
తిరిగి తృణ మ్మంతరముగ[4] నొనరిచి
నను తలంపకు మనము మరల్పుము
స్వజనముం దని జనకజ పలికెను. శ్రీ

---

1 లక్ష్మిని 2 సాటి 3 మన్మథపరవశుఁడు 4 గడ్డిపరక.

167

పొపుడు సిద్ధిని[1] వత నను కోరుట
తగదు తగదు యుక్తము కాదు సుమా!
పుణ్యకులంబున పుట్టి పుణ్య మగు
మేటి కులంబును మెట్టిన[2] దానను
సతి విగర్హితము[3] సజ్జన నింద్యము
నసత్కార్య మెటు లాచరింపఁగల
కులవనితను గా[4] నలఘు పతివ్రత
నన్య భార్య నని అవనిజ పలికెను. శ్రీ

168

సాధు ధర్మమును చక్కఁగ తలఁపుము
సాధు వ్రత మాచరింపఁ గడగుఁము
నీ కులకాంతను నీ వటు లన్యులు
స్వభార్యలను రక్షణము చేయవలె
చంచ లేంద్రియుని[5] స్వ సతీ విముఖుని[6]
పరాభవింతురు పరదారలు[7] భువి
ఇచ్చట లేరా హితవరు లున్నను
విన వా హిత వని జనకజ పలికెను. శ్రీ

---

1 కార్యసిద్ధిని 2 కోడలుగావచ్చినదానను 3 పతివ్రతలచే నిందింపఁబడు
4 నీకు గృహిణినికాను 5 చపలములైన యింద్రియములు కలవానిని
6 తన భార్యయెడ విముఖుఁడై యున్నవానిని 7 ఇతరుల భార్యలు.

69

విహి తాచారము[1] విడిచి ఉత్తరములు
చెప్పిన పథ్యము[2] నొప్పురి కించుచు[3]
సంచరింతు రాక్షస కుల మంతయు
చెడు కాలము వచ్చెను కాఁబోలును
ఆదూర దర్శనుఁ డగు నీ యొక్కని
అపరాధముచే నమి తైశ్వర్యము
లంకానగర లలామము నాశం
బందుచున్న దని అవనిజ పలికెను. శ్రీ

170

అన యాసక్తు[4] దురాత్ముని రాజును
పొంది రాష్ట్రములు పురములు రూపఱు
పాపకర్మ విధ్వంసము నారసి
సర్వ భూతములు సంతోషించును
నే మనఁబాలను రాముని కె డయై[5]
యునుని[6] విడిచి యుండునె తేజం బిల
బల ధనముల నను ప్రలోభ పెట్టఁగ[7]
శక్యము కా దని జనకజ పలికెను. శ్రీ

---

1 పెద్దలచే విధింపఁబడిన ఆచారము 2 హితము 3 అలక్ష్యము చేయుచు
4 దుర్నీతియందాసక్తికలవానిని 5 దూరమై 6 సూర్యుని 7 ఆశపెట్టుటకు

171

బ్రహ్మజ్ఞుం డగు[1] వ్రతికి విద్య వలె
అనఘుం డగు రాముని కే తగుదును
ఆ విభునకు నిల్లాలను నే నెటు
లన్యుల భుజముల నాశ్రయించెదను
కరేణువును[2] గజవరునితోడ వలె
నను దుఃఖిత రామునితో కూర్పుము
మనెడు కోర్కె కల్గిన నాతనితో
మైత్రి సేయు మని మైథిలి[3] పల్కెను. శ్రీ

172

స్థితి[4] లంకను కాంక్షింతు వేనియును
ఘోరవధంబును కోర వేనియును
శరణు చొరుము దాశరథి ధర్మవిదు
శరణాగత రక్షణ పరుఁ డాతఁడు
ప్రయతుఁడవై[5] నను రాముని కిచ్చిన
స్వస్తి[6] యగును వంశమునకు నీకును
అన్య విధము నీ వాత్మ తలంచిన
చావు తప్పదని జనకజ పలికెను. శ్రీ

---

1 బ్రహ్మజ్ఞానము కలిగినవాఁడు 2 ఆడు ఏనుఁగు 3 సీత 4 ఉనికి
4 పరిశుద్ధుఁడవై 6 మంగళము,

173

విడువ వచ్చు కాలుఁడు[1] నిను దయతో
విడువ వచ్చు నిను విముక్త వజ్రము[2]
విడువఁడు సుమి రాముఁడు కోపించిన
నిన్ను వంటి దుర్నీతి తత్పరుల
శతక్రతుని[3] వజ్రఘోష మట్టులు
రాము వింటి[4] ఘోర ధ్వని విందువు
రామ లక్ష్మణ శరమ్ము లురగముల[5]
వలె పైఁబడు నని పలికె భూమిసుత. శ్రీ

174

రాక్ష సేంద్ర సర్పముల[6] రాముఁ డను
తార్క్ష్యుఁడు[7] వెస నుద్ధరించు నిక్కము
విష్ణువు తొల్లి త్రివిక్రంబులను[8]
రాజశ్రీ నసు రాశినుండి వలె
భర్త నన్ను నీ బారినుండి వెసఁ
గై కొనిపోవు నఖండ శౌర్యమున
దాశరథులు యుద్ధమున పైకొనిన[9]
బ్రతుకఁగలవె అని పలికె భూమిసుత. శ్రీ

---

1 యముఁడు 2 ఇంద్రునిచేవిడువఁబడిన వజ్రము 3 ఇంద్రుని 4 ధనుస్సు యొక్క 5 పాముల 6 రాక్షసరాజులను పాములను 7 గరుడుఁడు 8 మూఁడుపాదములచే 9 ఎదిరించినచో.

175

జనస్థానమున[1] దనుజు లందఱును[2]
హతులు కాగ నీ వశక్తుండ వయి
ఆ నరసింహులు లేని సమయమున
దొంగ పోలె నను తోడ్కొని వచ్చితి
వారే యుండిన వ్యాఘ్రము[3] చూచిన
యూరకుక్క వలె పాఱెడి వాఁడవు
వారి నెదిరి నీ వాలము[4] చేయుట
అతిదుష్కర[5] మని అవనిజ పలికెను. శ్రీ

176

సలక్ష్మణుఁడు దాశరథి బాణముల
నినుఁ దంబుల[7] వలె కొను నీ యసువుల
కుబేరుఁ డుండెడి కుధరము[8] చేరిన
సలిలనాయకుని[9] సభలో దాగిన
పెను వృత్తుం డైనను వజ్రాహతిఁ
గూలు మాదిరిగ నేలఁ గూలెదవు
వారి శరమ్ముల బారిఁ బడిన రూ
పఱుట[10] తప్ప దని అవనిజ తెలిపెను. శ్రీ

---

1 దండకాటవియందలి భాగము 2 రాక్షసులు 3 పులిని 4 యుద్ధము
5 మిక్కిలిచేయ శక్యముకానిది 6 రాముఁడు 7 సూర్యుఁడు నీళ్ళనువలె
8 పర్వతము 9 రావణుని 10 రూపులేకుండ నశించుట.

177

ఆ మాటలు విని సురనాయకుఁడు[1]
కనలు[2] నడఁచుకొని జనకజఁ గనుఁగొని
ఇంతి! ప్రీతి ననునయించు కొలఁదిని
తల కెక్కుదు రుద్ధతి నిల వనితలు
అనురక్తిని సాంత్వన వాక్యంబులు
పలుకు కొలఁది పురుషుల కగు నవమతి[3]
పరుషం బగు నీ పలు కొక్కొక్కటె
వధ కర్హం బని పలికె రావణుఁడు. శ్రీ

178

ఎచ్చట ప్రేమం బెసగునొ[4] నరులకు
నచ్చట దయ యలరారుచు నుండును
హయముల[5] సారధి యట్టులు నీ యెడఁ
గల కామము నా యలుక నడంచెడి
చంప నైతి నిపు చాన! అక్కతన
ఇచ్చెద గడువిఁక రెండు మాసములు
ఒల్లవేని న న్నుదయ భుక్తికై[6]
పచింత్రు[7] ని న్నని పలికె రావణుఁడు. శ్రీ

---

1 రావణుఁడు 2 కోపము 3 అవమానము 4 ఒప్పునో 5 గుఱ్ఱములను
6 ప్రాతః కాలభోజనమునకై 7 వండుదురు.

179

ఆ మాటలు విని అడలు[1] సీతఁగని
గంధర్వామర కాంతలు వగచుచు
అసుర నాయకుం డాలించునో[2] యని
అమిత భీతి నోట మాట పలుకక
పెదవుల కదలిక వదన సంజ్ఞలను
కర చాలనములఁ[3] గను సైఁగలతో
దరహాసంబులఁ[4] దగు చేష్టలతో
ఆశ్వాసించుటకై[5] యత్నించిరి. ॥శ్రీ॥

180

అంత సీత యా యసురనాథుఁ గని
భయము చింత కోపము ముడివడగా[6]
రావణ! ఇచ్చట తావక హితమును
కోరు వా రెవరు లే రనుకొందును
లేని యెడల వజ్రికి[7] శచి కైవడి[8]
రాఘవునకు భార్య నైన న న్నిటు
నీవు దక్క మఱి యెవ్వరు త్రిజగతి
మది నైనను కోరుదు రని పలికెను ॥శ్రీ॥

---

1 భయపడును 2 వినునేమో 3 చేతులకదలిపులతో 4 చిఱునవ్వులతో
5 ఓదార్చుటకై 6 పెనగొనఁగా 7 ఇంద్రునకు 8 వలె

రాము భార్య దుర్భాషల నాడితి
పీ కొల[1] తొలఁగునె యెచ్చటి కరిగిన
కామముతో నను కను క్రూరము లగు
నీ కను లేలకొ నేల రాల వవి
ఇన కుల పతి సతి[2] నిట్టు లాడు నీ
నాలుక యేలొకొ చీలక యున్నది
వ్రతమున నా పతి సమానతి లేమని
బూది[3] సేయ పాపుఁడ! యని పల్కెను శ్రీ

## 192

కని యెఱుఁగవు రాముని నిందించెదు
కంటఁ బడిన నీ గతి యే మగునో
వీర వరుండ కుబేరు సోదరుఁడ
నని పలికెదు చౌర్య[4] మేల చేసితి
రాము భార్య దశరథు కోడల నను
హీన బుద్ధి హరియించి తెచ్చితివి
విధి[5] మృతి నీ కీ విధి[6] విధియించెనొ
యని తోఁచెడి నని అవనిజ పల్కెను. శ్రీ

---

1 పాపము 2 రామునిభార్యను 3 బూడిద 4 దొంగతనము 5 బ్రహ్మ
6 విధమున,

183

జనకజ మాటలు విని యసురేంద్రుం
డరుణ నేత్రములు తెఱచి యామెఁ గనె
ఎగు భుజములతో నగుపడె నాతఁడు
తత శిఖరము మందర కుధరము వలె[1]
తరుణ భాను సుందర కుండలముల[2]
నతఁ డొప్పెను పుష్పి తాశోక మన
మండితుఁ డయ్యెను[3] శ్మశానచైత్యం
బట్టులు భీకరుఁడై యతఁ డుండెను. శ్రీ

184

అతఁడు కోపమున నక్షు లెఱ్ఱ బడ
నలిగిన భుజగము[4] వలె బుస కొట్టుచు
ఓసి! ముగ్ధ! నను నొల్లక రక్తుని
అనయుని వ్యర్థుని ననుసరించెదవు
స్వతేజమున భాస్కరుఁడు[5] సంధ్య వలె
నిష్ప్రభ నిను నశియింపఁ జేసెనను
బ్రతుకఁ గలవె రావణు కనలించియు[6]
నని ధరణీ తనయను బెదరించెను. శ్రీ

---

1 విస్తారమైన శిఖరములుగల మందరపర్వతమువలె 2 ఉదయసూర్యుని వలె అందమైన కుండలములు 3 అలంకరింపఁబడినవాఁడయ్యెను 4 పాము 5 సూర్యుఁడు సంధ్యాసమయమునువలె 6 కోపింపఁజేసియు.

185

పిమ్మట నాతఁడు వికృతాకారల
నచట నున్న ధను జాంగలనం[1] గని
కంటిరి కద యీ కాంత యుద్ధతిని[2]
పంతంబున విన దెంత చెప్పినను
కూడి మీర లనుకూల కార్యముల
సామ దానముల సరస వాక్యముల
భేద దండముల వేగ నీమె నా
కొదవు నట్లు[3] చేయుం డని పలికెను. శ్రీ

186.

అనఁగ ధన్యమాలిని యను రక్కసి
పంక్తికంధరుని పరిష్వజింతుచు[4]
వివర్ణ మానిసి విరక్త[5] యగు నీ
యింతితోడ నీ కేమి మనోహర!
క్రీడింపుము నాతోడ సకామను[6]
ప్రేమించుచు నీ వేల బడలెదవు
వలచిన కాంతను బడసిన ప్రియునికి
బ్రహ్మనందం బగు నని పలికెను. శ్రీ

---

1 రాక్షసస్త్రీలను 2 గర్వమును 3 లభించునట్లు 4 కౌఁగిలించుచు 5 ప్రేమ లేనిది 6 కామములేనిదానిని.

ఆ పలుకులు విని అసుర నాయకుఁడు
నవ్వుచు సీతను నానావిధముల
బెదరించుచు హృది పొంగగ తప్తుఁడయి
అడుగుల యుదుటున[1] పుడమి వడకఁగా
నాగ దేవ గంధర్వ కన్యకలు
విస్మయంబున వెనువెంట నడచి రా
తిరిగి చనియె భాస్కరగ వర్ణాభము
కనకమయము నగు తన భవనమునకు.

# సర్గము 23

183

అసుర నాయకుం డంతిపురంబున
కరిగిన భయంకరాకృతు లచ్చటి
దానవాంగనలు ధరణిజ చుట్టుచు
చేరి పల్కిరతి ఘోర వాక్యములు
ధాతృ మానసాత్మజుఁడు[2] పులస్త్యుం
డతనికి పుత్రుం డగుపు విశ్రవసుఁడు
అతని సుతుఁడు దైత్యాధిపుఁ[3] డతనికి
భార్యవు కమ్మని పలికె నేకజట.

1 ఉద్ధతిచే 2 బ్రహ్మమానసపుత్రుఁడు 3 రావణుఁడు.

189

ఎల్లసురల దేవేంద్రుని గెల్చిన
రావణునికి భార్య వేల కావని
సాగ్రహ యై మార్జాల నేత్రముల[1]
నటు నిటు త్రిప్పుచు హరిజట పలికెను
పడతుల నందఱ విడిచి రావణుడు
నిను కోలెడి నని వెనుచను టెఱుగని[2]
యతని పొంది సౌఖ్యము లొందవె యని
ప్రఘసాభిధ[3] యగు రక్కసి పల్కెను. శ్రీ

190

పలు మాఱులు వేల్పుల గంధర్వుల
అని నిర్జించిన ఘనపరాక్రముడు
సర్వలోకముల సంపదలెల్లను
కొల్లగొట్టి శోభిల్లు ధనాఢ్యుడు[4]
పౌలస్త్యుడు[5] నిను వాంఛ సేయగా
శ్రీలు[6] రాగ మోకాలు నొడ్డుగతి
నొల్ల నంచు దురపిల్లెద[7] వేటికి
నని పలికెను వికటాభిధ దానవి. శ్రీ

---

1. పిల్లికనులు 2 యుద్ధమున వెనుకంజవేయని 3 ప్రఘస యను పేరు గలది 4 ధనసంపన్నుడు 5 రావణుడు 6 సిరిరామోకాలొడ్డువిధమున 7 చింతించెదవు.

191

ఎవని భయముచే నినుఁడు[1] తపింపఁడో
ఎవని భయముచే పవనుఁడు[2] వీచఁడో
ఎవ డరిగిన యవు డిచ్చు నంబువులు[3]
శైలగణంబులు జలధరంబులును
నట్టి రావణుం డభిలషింప[4] నిను
నతని కేల భార్యవు కాఁదలఁపవు
నిజము చెప్పితిని నీ పటు సేయక
బ్రతుక నేర వని పలికెను దుర్ముఖి. శ్రీ

192

సర్వ భూత హర్షద[5] మతిసుఖకర
మేటి కొల్ల వసురేశు నంతిపురి
అఖిల లోక భాగ్యములకు నిధి యగు
దైత్యనాథు పొం దంది సుఖింపుము
రాజ్యభ్రష్టుని రాముని కోరెద
పతని పొందు నీ కత్యసంభవము
మది నా యాశలు మాను మింక నని
రక్షఃస్త్రీలు ధరాజ నదల్చిరి[6] శ్రీ

---

1 సూర్యుఁడు 2 వాయువు 3 మేఘములు 4 కోరఁగా **5** అన్ని **భూత**ములకు నానందమునిచ్చునది 6 సీతను బెదిరించిరి.

## 193

అవనిజ రక్కసు లన్న వాక్యములు
విని యశ్రుషులు[1] నిండిన కన్నులతో
ఏల మీరు విపరీత వచనములు[2]
పల్కెద రిది పాపం బని తోపదె
మీరందఱు నను భ్రమింగిన భ్రమింగుడు
చేయజాల మీ చెప్పిన రీతిగ
మనుజాంగన దనుజునకు భార్యగా
నగుట విరుద్ధము తగ దని పల్కెను. శ్రీ

## 194

రాముడు రాజ్యభ్రష్టుడె యైనను
అతడే పతి నా కతడే గురు డగు
సువర్చలా సతి[3] సూర్యునందు వలె
నిందు[4] నందు రోహిణీతార వలె
సహస్రాక్షు[5] నెడ శచీదేవి వలె
నా వసిష్ఠునం దరుంధతియు వలె
నే నిక్ష్వాకువరేణ్యుని యందే
మది నిల్పెద నని మైథిలి పల్కెను. శ్రీ

---

1 కన్నీళ్లు 2 విరుద్ధవాక్యములు 3 సూర్యుని భార్య 4 చంద్రునందు 5 ఇంద్రుని విషయమున.

195

జనకజ పల్కులు విని కోపంబున
కన్ను లెఱ్ఱబడ కసరుచు తిట్టుచు
నధరంబుల జిహ్వలతో[1] నాకుచు
దనుజాంగన లామెను బెదరించిరి
వడఁకుచు కన్నుల బాష్పము
శింశుపోర్వీజము[2] చేరె ధరాసుత
చప్పుడు చేయక శాఖావృతుఁడై
హనుమయి దంతయు నరయుచునుండెను. శ్రీ

196

అంత వినత యను అతిభీకర యగు
దానవి ధరణీతనయ చేరఁజని
తన్వీ! భర్తపై తత్పరత్వమున
భక్తి నధికముగ ప్రదర్శించితివి
చాలు చాలు భయశీలుఁడు కృపణుం[3]
డతని వీడి దైత్యాధిపు చేరుము
మా నుడి[4] చేయవ యేని యిప్పుడే
నిను భక్షించెద నని వాక్రుచ్చెను[5]. శ్రీ

---

1 నాలుకతో 2 అశోకవృక్షము 3 దీనుఁడు 4 మాట 5 చెప్పెను.

197

దుర్మతి! నీ వను దుర్భాషలు[1] లన్నియు
సదయ చిత్తమున సహించినారము
జవ్వన[2] మతి చంచల మది గడవక
మున్నె రావణుని పొంది సుఖింపుము
అంతఃపురగత లందఱు వనితలు
నీకు దాసులై నిరతము కొల్తురు
మా నుడువులు[3] విన వేని నీ యెడఁద
పెఱికి తిందు మని పికట వచించెను. శ్రీ

198

చండోదరి ప్రఘసాఖ్య అజాముఖి
యను దనుజాంగన లాయుధములు గొని
హితవు మాని విన వేని నిన్నిపుడ
చంపెద మని భూజాత నదల్చిరి
వారి భయంకర పరుష వాక్యములు
విని కని తద్దారుణ రూపమ్ములు
భీతహృదయయై పిడి ధైర్యమును
పృథ్వీనందన[4] యేడ్వఁ దొడంగెను. శ్రీ

---

1 దెప్పపల్కులు 2 యౌవ్వనము 3 మాటలు 4 సీత.

# సర్గము 25

199

కొంత వడికి నా క్కొంత తేరుకొని[1]
దనుజాంగనలను గని జనకాత్మజ
మనుజ వనిత నే దనుజుని కెట్టులు
భార్య నగుదు మీ పలు కతి నింద్యము
చేయఁజాల హింసింపుఁ డసువులను[2]
తీయుఁడు మాంసము తిని నర్తింపుఁడు
నా పతి రాముఁడె నాకు దిక్కనుచు
నెలుఁగు రాలుపడ[3] పలికెను జనకజ.

200

అంత నామె శోకాతిరేకమున
భగ్న చిత్తయై భయ పీడితయై
అలరుల[4] నొప్పెడి యశోకవిటపము[5]
నవలంబించుచు నడలుచు వడఁకుచు
అనఘుని రాముని అతని సోదరుని
అత్తల కౌసల్యాసుమిత్రలను
తలఁచుచు నశ్రులు స్తనముల జారఁగ
దిక్కు లేక రోదించె దీనయై.

---

1 ఊఁపిరిటచెంది 2 ప్రాణములను 3 కంఠస్వరము గద్గదముకాఁగా
4 పూలతో 5 కొమ్మను

## 201

అంతటి వానికి నను గు పత్నినై
దైత్య భామినీ నిత్యార్దిత నై[1]
ప్రియుని విడిచి జీవింతు మనుజులకు
అవేళ మృతి[2] రా దనుట నిక్కువము
అబ్ధి మధ్యమున అనిల వేగ హత
మైన[3] నావ వలె నక్కటకటా!
అల్ప పుణ్యనే ననాథ యట్టులు
తపింతు నిట నని ధరణిజ వొగిలెను[4] ॥ శ్రీ ॥

## 202

రామ చంద్రు దర్శన మను పుణ్యం
బధన్యులకు నిల నలవడ నేర్చునె[5]
అనుభవింతు నిట్లనంత దుఃఖము
అఘ[6] మెంతటి దే నాచరించితినొ
వికల జీవితము విడువ నెంచియును
అకట! నేను చేయజాల నట్టులు
ఛీ![7] పరతంత్రము[8] పాప మేమిటికి
మనుజ జన్మ మని మైథిలి వగచెను. ॥ శ్రీ ॥

---

1 రాక్షసస్త్రీలచే సంతతముపీడింపబడినదాననై 2 అకాలమున 3 గాలి వేగముచే కొట్టబడిన 4 చింతించెను 5 కలుగజాలునా 6 పాపము 7 ఛీఛీ 8 అస్వతంత్రము.

# సర్గము 26

203

శ్రీరాముఁడు దరి[1] లేని సమయమున
బలాత్కృతిని రావణుఁడు తెచ్చె నను
దను జాళీ సంతత పీడితనై
విలపించుచు జీవింప నొల్ల నిట
దారుణ దుఃఖ విదారిత మయ్యెను
నా హృదయము భిన్నము కా దే లోకా
అజరామరమో[2] అది శిలామయమొ
అని గతధృతియై[3] జనకజ వగచెను. శ్రీ

204

సుచరిత్రుఁడు ప్రాజ్ఞుండు కృతజ్ఞుడు
సానుక్రోశుఁడు[4] ఖ్యాతుఁడు రాముఁడు
నా యెడ నిపుడు[5] వినాదయుఁ డయ్యెను
దీనికి నా దురదృష్టమె హేతువు
రాక్షస హృత భార్యను ప్రియురాలిని
దృఢవిక్రముఁ డాతఁడు విడిపింపక
యూర కుండుటకు వేఱు కారణము
కనఁగా రాదని జనకజ వగచెను. శ్రీ

---

1 చెంత 2 ముసలితనమును మృతియు 3 పోయినధైర్యముకలదై
4 దయగలవాఁడు 5 దయలేనివాఁడు.

205

జనస్థానమున చతుర్దశాసుర
సహస్రములఁ[1] విచ్చలవిడి చంపెను
దండ కాటవిని దైత్యు విరాధుని
నవలీలగ[2] సంహతుఁ గావించెను
అల్ప వీర్యుఁ డగు నసురనాయకుని
అని చంపుట రాముని కతిసులభము
అతని బాణముల కడ్డ మేది యిట
నేల రాఁడో యని యిలాజ తలఁచెను. ॥శ్రీ॥

206

క్రూరుఁ డసురపతి కూల్చె జటాయువు
విడిచె నసువు లా వీరుఁడు నాకయి
ప్రతికి యున్న నా వార్త తెలుపఁడే
లక్ష్మణునికి శ్రీరామచంద్రునికి
ఏ విట నుండుట యె ట్లెఱుంగుదురు
దశరథాత్మజులు తా మెఱిఁగినచో
అరాక్షసము[3] చేయరె కోపంబున
జగ మంతయు నని జనకజ తలచెను. ॥శ్రీ॥

---

1 14 వేలమంది రాక్షసులు 2 విలాసముగ (సులభముగ) 3 రాక్షసులు లేనిదానిగా.

207

సముద్ర మధ్యస్థము లంకాపురి
దుర్గమ మైన[1] నిరర్గళ శౌర్యులు
రామ లక్ష్మణులు రఘు కుల సోములు
నే నిట నుండుట నెఱిగి యున్నచో
రయమున నీ నగరమ్ము సమస్తము
ప్రేతభూమి[2] కావింప కుందురే
ఇంకింపరె వారిధి నీ రావణు
హతమార్పరె యని క్షితిసుత తలచెను. ॥శ్రీ॥

208

గర్వితు లగు రాక్షసుల వర్తనమె
వారి వినాశము తీరు[3] తెల్పెడిని
దుర్నిమిత్తములు[4] తోఁచు లంకలో
నవి సూచించెడి నశుభము దానికి
సలక్ష్మణుఁడు కౌసల్యా తనయుఁడు
లోకము లన్నియు రోసి[5] నాకొఱకు
వచ్చి యిటకు రావణుని రక్కసుల
చంపి తీరు నని జనకజ తలఁచెను. ॥శ్రీ॥

---

1 ప్రవేశింప శక్యము కానిదైనను 2 శ్మశానము 3 విధము 4 చెడ్డ శకునములు 5 వెదకి.

గతభర్తృక యగు[1] కాంత వోలె నీ
లంకాపురము విలాస హీన మగు
ఏ నివు డిచ్చట నేడ్పు నట్టుగా
పురి ప్రతిగృహమున పౌలతు[2] లేడ్చెదరు
పాప కార్య తత్పరు లీ రక్కసు
లెఱుగరు తాం మొనరించు దుష్కృతులు
వారి అధర్మమె వారి చేటునకు[3]
దారి చూపు నని ధరణిజ తలంచెను, (శ్రీ)



210



దితిజాధిప నిర్దిష్టము సమయము
సమీపించె నను చంపుదు రసురులు 
విడిచి రాము జీవింపఁ జాల నిఁక
నెవ రైన నను విష మిత్తురె నా కిట
నను వెదకరె లక్ష్మణుఁడు రాముఁడును
రా రేటికొ యీ లంకానగరికి
వెదకియుఁ గానక హతాశులై[4] వా
రరిగిరొ దివి[5] కని అవనిజ వగచెను. (శ్రీ)

---

1 విధవ 2 రాక్షస స్త్రీలు 3 కీడునకు రావణునిచే నిర్దేశింపఁబడిన కాలము 4 పోయిన ఆశకలవారై 5 స్వర్గమునకరిగినరో (మరణించిరో).

## 211

ధన్యులు సుర గంధర్వ మహర్షులు
రాముని గని హర్షమున తేలుదురు
నా కా భాగ్యము లే కున్నది గుణ
హైన్యమొ[1] దౌర్భాగ్యమొ[2] తన్మూలము
అనఘుఁడతని విడి యున్నట కంటె మృతి
నొందుటయే యెంతో యుక్తం బగు
అక్కటకట! నా కా మృతి యైనను
కలుగ దయ్యె నని యిలాజ[3] వగచెను. శ్రీ

## 212

త్యక్త కిల్బిషులు[4] ధన్యులు మౌనులు
ప్రియ మప్రియములును లేవు వారలకు
ప్రియము వలన వర్తిల్లదు దుఃఖము
నగు నప్రియమున నధిక మౌ భయము
రెండు విడిచి వర్తింత్రు మహాత్ములు
మహితులు[5] వారికి మన్నమస్కృతులు
ప్రియుఁడు విడిచె నప్రియునికి చిక్కితి
మను బెంగుల కని మైథిలి తలఁచెను. శ్రీ

---

1 గుణములేమియో 2 దురదృష్టమో 3 సీత 4 విడువఁబడినపాపము కలవారు 5 పూజ్యులు.

ప్రియ విరహితనై భీత హృదయనై
భరింపఁజాల నపార దుఃఖమును
తన కుల మెంచక తన గతి యెంచక
వలవని[1] సతి రావణుఁడు కోరెడిని
ఎడమ పాదమున నేని అతనిని
స్పృశింప[2] నన మోహింతునె మనసున
అసురాంగనలారా! నను చంపుఁడు
తినివేయుం డని జనకజ పలికెను. శ్రీ

## సర్గము 27

214

జనకజ పల్కులు విని కోపము కని
ఘోరదర్శనలు[3] కొందఱు కాంతలు
రావణాసురుని కా విషయంబును
ఎఱిఁగించుటకై యరిగిరి రయమున
కొందఱు ధరణీ నందన చెంతకు
పోయి కెంపుచూపులు[4] పరగించుచు
నేఁడు దానవులు నీ మాంసంబును
తిందురు సుఖముగ నని బెదరించిరి. శ్రీ

1 ప్రేమింపని 2 ముట్టను 3 భయంకరమైన ఆకారములుకలవారు
4 కోపముతోఁగూడిన ఎఱ్ఱని చూపులు.

## 215

ఆ తర్జింపుల[1] నాలకించి అట
శయనించిన రాక్షసి త్రిజటాభిధ[2]
"ఇంతులార! మీ రేల యీ సతిని
నపయఁజేయుదురు[3] నను భక్షింపుఁడు
ఈమె జనక రాజేంద్రుని కూఁతురు
దశరధ ధరణీ ధవునికి కోడలు
కంటిని దైత్య క్షయము[4] రాము జయ
మును తెల్పెడి కల వినుఁ డని పలికెను.

శ్రీ

## 216

హస్తి దంత మయ[5] మంతరిక్షగము[6]
హంస సహస్రోదంచిదివ్యము
వాహనమున సిత వస్త్ర మాల్యములు
ధరించి వచ్చిరి దశరథాత్మజులు
సితాంబ రావృత సీత[7] వారినిధి
పరిక్షిప్త మగు[8] పర్వతాగ్రమున
రామ సహితయై రవితో ప్రభ[9] వలె
అలరె నని త్రిజట కల వివరించెను.

శ్రీ

---

1 బెదరింపుల 2 త్రిజట అను పేరుగలది 3 బాధింతురు 4 రాక్షసనాశము 5 ఏనుఁగుదంతములతోఁగూడినది 6 ఆకాశమున పోవునది 7 తెల్లని వస్త్రముతో నావరింపఁబడినది 8 సముద్రముతో చుట్టఁబడిన 9 కాంతి

217

చతుర్దంత మగ సంకాశం[1] బగు
గజము నెక్కి రాఘవుఁడు సానుజుఁడుఁడు[2]
సితమాల్యాంబరయుతుఁడై తిరుగుచు
నానందంబున నవనిజ చేరెను
ఆగిరి శిఖరం బందున రాముఁడు
పట్టి సీతఁ గరిపై నెక్కించెను
భర్త చెంత భూభవ[3] తాఁకెను రవి
శశుల[4] నని త్రిజట స్వప్నము తెలిపెను. శ్రీ

218

అంత రాఘవులు నా కరి నెక్కిరి
కదలి యదియు లంకపైకి వచ్చెను
మఱి యొకచో దాశరథి రాఘవుఁడు
ఎనిమిది తెల్లని ఎద్దుల పూన్చిన
అరద[5] మెక్కి భార్యాసమేతుఁ డయి
యీ పురిపై కేతెంచుచుండఁగా
వేల్పులు మౌనులు విరుల వాన[6] కురి
యించి రని త్రిజట యెఱిఁగించెను కల. శ్రీ

---

1 నాలుగు దంతములు కలది, పర్వతసమానము 2 తమ్మునితో కూడిన నాఁడు. సీత 4. సూర్యచంద్రులను 5 రథము పూలవాసన.

219

లక్ష్మణ సహితుఁడు రాముఁడు సతితో
అర్క సన్నిభం బైన[1] పుష్పకము
నెక్కి యుత్తరపు దిక్కున కరుగఁగ
నప్సరసలు నృత్యంబు లొనర్చిరి
తపసులు శుభమంత్రంబులు పఠించిరి
సిద్ధులు వేల్పులు చేసిరి వినుతులు[2]
రాము జయింపఁగ రా దెవ్వరికే
నని త్రిజటాభిధ తన కల తెలిపెను. ||శ్రీ||

220

రావణాసురుఁడు రక్తాంబరుఁడై[3]
గన్నేరుదండలు గళమునఁ[4] దాలిచి
తైలాక్తాంగుఁడు[5] త్రాగుచు మత్తిలి
పుష్పకచ్యుతుఁడు పుడమిని బడియెను
ముండితశీర్షు[6] నఖండబలముతో
నింతి యొకతె భువి నీడ్చుచు నుండెను
ఖరయుక్తం బగు[7] నరదమున నతని
కంటి నని త్రిజట కల యెఱిఁగించెను. ||శ్రీ||

---

1 సూర్యసమానమైన 2 స్తుతులు 3 ఎఱ్ఱని వస్త్రముకలవాఁడై 4 కంఠమున 5 నూనెతోఁ పూయఁబడిన దేహముకలవాఁడు 6 క్షౌరముచేయఁబడిన శిరముకలవానిని 7 గాడిదలతోఁగూడిన.

221

అతఁడు ఖరముపై యామ్యదిక్కునకు[1]
వడిగా నరుగుచు పడె తల క్రిందుగ
వేగ లేచి మదవిహ్వలుఁడై దు
ర్భాషలతో మలపంకము చొచ్చెను
కాళి[2] యొకతె రక్తాంబర కంఠముఁ
గొని యాతని దక్షిణముగ లాగెను
పాపాత్ముఁడు కుంభకర్ణుఁ డట్టులె
కనఁబడె నని తన కల తెలిపె త్రిజట. శ్రీ

222

అసురనాయకుని ఆత్మజు[3] లందఱు
తైల సముక్షిత తనులుగ[4] నుండిరి
పంది నెక్కి రావణుం డొంటెపై
కూరుచుండి యా కుంభకర్ణుఁడును
ఇంద్రజిత్తు మకరేంద్ర స్థితుఁడై[5]
యామ్యదిక్కుగా నరుగుచునుండిరి
విపరీతము లీ వింత దృశ్యములు
కనఁబడె నని తన కల తెలిపె త్రిజట. శ్రీ

---

దక్షిణ దిక్కునకు 2 నల్లనిస్త్రీ 3 కుమారులు 4 నూనెతోపూయఁబడిన దేహములుగలవారు 5 మొసలిపైనున్నవాఁడు.

## 223

ఆ విభీషణుం డనఘుఁ[1] డొక్కఁడే
చతుర మాత్య సంవృతుఁడై[2] నభమును
శైల సన్నిభము చతుర్దంతమును
గజము నెక్కి శంఖధ్వను లొలయఁగ
శుక్ల మాల్య భాసుర కంఠుండై[3]
స్వచ్ఛాంబర గంధానులేపుఁడై
వివిధవాద్యములు వినబడ కనఁబడె
నని తన కల తెలిపెను త్రిజటాభిధ. ॥శ్రీ॥

## 224

రాక్షసు లందఱు రక్తమాల్యులై
పానమత్తులై పడుచుండిరి ధర
కూలిన తోరణ గోపురములతో
రథ హయములతో లంక వార్ధి[4] పడె
రామ దూత బలి భీమ విక్రముఁడు
కాల్చె నొకఁడు లంకా పుర మంతయు
బూడిద మిగిలిన పురమును చొచ్చిరి
దనుజు లని త్రిజట తన కల తెల్పెను. ॥శ్రీ॥

---

1 పాపరహితుఁడు 2 నల్గురు మంత్రులతో కూడినవాఁడై 3 తెల్లనిదండలతో ప్రకాశించు కంఠముగలవాఁడై 4 సముద్రమందు.

225

పొందు రాఘవుఁడు భూసుత, దైత్యుల
నాతఁ డింక సంహారము చేయును
విడువుఁడు పరుషపు నుడువు లా సతిని
సవినయంబుగా సంప్రార్థింతము
ప్రణిపాతుల యెడ[1] ప్రసన్న[2] జానకి
కాపాడును రాక్షసుల నందఱిని
లేని యెడల మన కౌను మహాపద
యనుచు త్రిజట తెలిపెను దానవులకు శ్రీ

226

అగపడ దీ వికచాబ్జనేత్ర యెడ
నవలక్షణ[3] మిసు మంత యేనియును
నా కల యీమెకు నానాశుభములు
చేకుఱు నని సూచించుచు నున్నది
అదరు నీమె వామాక్షి భుజంబులు[4]
కరికరాభ మంకము[5] స్ఫురియించెడి[6]
అగు నీమెకు సర్వార్థసిద్ధు లని
త్రిజట తెలిపె నా దితిజాంగనలకు. శ్రీ

---

1 వినతులయెడ 2 అనుగ్రహముకలది 3 చెడ్డలక్షణము 4 ఎడమ నేత్రములు బాహువులు 5 తొడ 6 అదరుచున్నది.

227

పాదప శాఖోపవిష్ట విహగము[1]
మనోహరము లగు మధుర రావముల
స్వాగతమును సాంత్వనవాక్యంబులు[2]
పలుకుచు శుభమును తెలుపుచునున్నది
సూచించెడి నీ శుభశకునంబులు
సతి కీమెకు నక్షయ సౌఖ్యంబును
రాముని విజయము రావణు నాశము
ననుచు త్రిజట తెలిపెను ధను జాలికి. శ్రీ

## సర్గము 28

228

అసుర నాయకుం డాడిన మాటలు
దానవాంగనల తర్జనంబులను[3]
దలఁచి జనక సుత కలఁత నందె మది
దారుణాటవీ త్యక్త బాల వలె[4]
అకాలమున చా వబ్బ[5] దని పెద్ద
లాడు నుడులు సత్యములే యక్కటా!
ప్రతిదిన మిట్టులు భర్త్స్యమానయై [6]
బ్రతికియుంటి నని వెత[7] గని యేడ్చెను. శ్రీ

---

1 చెట్టుకొమ్మపై కూర్చున్న పక్షి 2 అనునయవచనములు 3 బెదరింపులు 4 భయంకరమైన అడవిలో విడువఁబడిన బాలికవలె 5 కలుగదు 6 బెదరింపఁబడుచున్నదాననై 7 వ్యథ.

## 279

సుఖవిరహితమును శోకమయము నగు
హృదయము నాయది యెంత కఠినమో
వజ్రాహత పర్వతశృంగము వలె[1]
భిన్నము కా దాపన్నం[2] బయ్యెను
గడువులోన రాఘవుఁడు రానిచో
ననుఁ జంపును రావణుఁడు నిక్కముగ
పరదినమున[3] మృతి పడయు దోషి గతి
నుంటిని నే నని యుర్విజ వగచెను. శ్రీ

## 280

అమ్మా! ధరణీ! అత్త! సుమిత్రా!
కౌసల్యా! రాఘవ! రామానుజ[4]
వాతాహత యై వార్ధి నౌక[5] వలె
నిట నశింతు నే హీనభాగ్యనై
శశినిభవదనా![6] సత్యవ్రతరత!
రామచంద్ర! సర్వలోకహితకర!
అసురనాయక నిహన్యమాన[7] నగు
నను నెఱుఁగవె యని జనకజ యేడ్చెను. శ్రీ

---

1 వజ్రముచేఁగొట్టఁబడిన కొండశిఖరమువలె 2 ఆపదపొందినది 3 మరుసటిరోజున 4 లక్ష్మణా 5 ఓడ 6 చంద్రునితోసమానమైన ముఖముకలవాఁడా 7 రావణునిచే చంపఁబడుచున్న.

281

అపుడు కాలుఁడే[1] హరిణరూపుఁడై[2]
నా యెద భ్రమ పడు నట్లుగఁ జేసెను
ఆర్యపుత్రు రామానుజు నిర్వుర
పంపితి బలవంతముగ మూఢనై
అశనిచేత[3] సింహద్వయ మట్టులు
మృగరూపధరుం డగు దానవుచే
హతు లై రేమో ఆ రఘుపుత్రులు
నా కరమున నని శోకించెను సతి. ॥శ్రీ॥

282

నియమవ్రతనై నేల శయించుట[4]
పతివ్రతాత్వము పరమక్షమయును[5]
కృత ముపకారము[6] కృతఘ్ను నెడ వలె
రామచంద్ర! వ్యర్థంబై పోయెను
నినుఁ గనకయు నిన్నే మది తలఁచుచు
నిరాశనై మరణింపఁ గోరఁగా
శస్త్రం బైన విషంబు నైన నిట
నెవ్వ రిత్తు రని యిలాజ వగచెను. ॥శ్రీ॥

---

1 యముఁడ 2 లేడిరూపుఁగలవాఁడై 3 వజ్రముచేత 4 పరుండుట
5 గొప్ప ఓర్పు 6 చేయఁబడిన ఉపకారము.

## 233

అని బహువిధముల అలమటఁ జెందుచు
దాశరథినె చిత్తమున తలంచుచు
మృతి చెందుటకే కృత నిశ్చయయై[1]
చేరి సీత పుష్పిత[2] మశోకమును
వివర్ణాస్య యై వేపమానయై[3]
యెదయం దురిగా జడ నమర్చుకొనె
అంతట శుభములు నాశాపహములు
బహు నిమిత్తములు[4] ప్రకటము లయ్యెను. (శ్రీ)

## 234

వక్ర పక్ష్మమై పార్శ్వ శుక్లమై[5]
కృష్ణ తారమై కెంపు కొనలు గల
మహితనయా వామ నయన మప్పుడు
మత్స్యాహత పద్మము వలె[6] నదరెను
పరార్ధ్య[7] కాలా గరు గంధార్హము
పీన వర్తులము విటప ప్రతిమము[8]
దాశరథికి నుపధానమై[9] తనరు
నామె వామ భుజ మవుడు స్ఫురించెను[10]. (శ్రీ)

---

1 చేయఁబడిన నిశ్చయము కలదై 2 పుష్పించిన 3 కంపించుచున్నదై 4 పెక్కు శకునములు 5 ప్రక్కలందు తెల్లనై 6 చేపచేకొట్టఁబడిన పద్మమువలె 7 ముఖ్యమైన. శ్రేష్ఠమైన 8 చెట్టు కొమ్మతో సమానమైనది 9 తలగడ 10 అదరెను.

## 285

కరి కరోపమము కడు సుందరమును
పీన సంహతము నైన భూమిసుత
వామాంకము ప్రస్పంద మానమై[1]
పురః స్థితుని రాముని సూచించెను[2]
బింబ ఫల ప్రతిమం బధరోష్ఠము
సుందరాక్షులును శుక్ల దంతములు
గల భూమిజ వక్త్రం బొప్పారెను
రాహు ముక్త[3] చంద్ర మండలము వలె ॥శ్రీ॥

## 286

ఈ నిమిత్తముల[4] నితర సూచనల
ఆశ్వసిల్లి[5] జన కాత్మజ యలరెను
ఆతప వాతాహత మయి నష్ట
ప్రాయము బీజము[6] వర్షముచే వలె
వీడి యధైర్యము విగత శోకయై
ఆనం దాతిశ యాత్త సత్త్వయై
ఆననమున నొప్పారె సీత సిత
పక్షపు శశి బింబము[7]చే నిశ వలె. ॥శ్రీ॥

---

1 ఎడమతొడ అదరుచున్నదై 2 ముందున్నవానిని 3 రాహువుచే విడువఁబడిన చంద్ర మండలమట్లు 4 ఈ శకునముల 5 ఊఱటచెంది 6 విత్తనము 7 శుక్లపక్షపు చంద్రుని.

# సర్గము 30

237

రాక్షస వనితల రూక్ష[1] వాక్యములు
త్రిజట వారలకు తెల్పిన స్వప్నము
విని నందన వనమున దేవత వలె
నున్న సీత వాయునందనుఁడు కని
దేవి కాంచితిని రావణు పురమును
గంటి నతని సంగతి కనుఁగొంటిని
పతి దర్శన తత్పర యగు నీ సతి
నాశ్వాసించు[2] టెట్లని మది తలఁచెను. శ్రీ

238

సతత దుఃఖ సంహతాత్మ[3] నీమెను
ఆశ్వాసింప కే నరుగుట దోషము
అరిగినచో దుఃఖాంతం బెఱుఁగక
యీమె ప్రాణముల నేఁడే విడుచును
లలనా దర్శన లాలసుఁ డా పతి
అవనీ సుత యే మనె నని యడిగిన
నేమి చెప్పఁగల నెటు లోదార్చెద
నని మది చింతించెను మరుత్సుతుఁడు[4]. శ్రీ

---

1 పురుష 2 ఓదార్చుట 3 ఎల్లప్పుడు దుఃఖముచే బాధింపఁబడుచున్న హృదయముగల 4 ఆంజనేయుఁడు.

239

దనుజ కామినులు వినుచుండఁగ నే
పగిది నీమెతో తెగి[1] భాషించుట
ద్విజుని[2] చందమున దేవ భాషలో
పలికిన నెట్టి భాష కపి కగును
దనుజ వరుఁడు రావణుఁడే పేఁ డని
చిత్తమునఁ దలఁచి సీత భీత యగు
దానవు లెఱుఁగని మానవ సంస్కృత
మున పల్కెద నని హనుమ తలంచెను. ॥శ్రీ॥

240

వానరుండ నే మానవ భాషను
పలికిన నను రావణుఁ డని తలఁచుచు
త్రాసిత పూర్వయు[3] తర్జిత పూర్వయు
నగుట నీమె వెఱ[4] నాక్రందించును
విని దానవ కామిను లాయుధములు
ధరించి నను తాఁక వచ్చెదరు
నను నా విక్రమమును గని పిల్తురు
దనుజుల నని[5] యగు నని కపి తలఁచెను. ॥శ్రీ॥

---

1 సాహసించి 2 బ్రాహ్మణుని విధమున 3 ఇదివఱకు భయపెట్టబడినది
4 భయముచే 5 యుద్ధము.

## 241

అసురులు బహు సంఖ్యాకు లగుటచే
పట్టవచ్చు చంపంగ వచ్చు నను
సీతకు నెవ్వరు చెప్పుదు రప్పుడు
రాము వార్త కార్యము భగ్నం[1] బగు
నేను లేనిచో వానరులం దెవ
రంబుధి దాటుదు రతి విస్తీర్ణము
దిక్కు లేక పృథ్వీజ కృశించుచు
త్యజింప బ్రాణము లని కపి తలంచెను. 

## 243

అని[2] నసురుల హతమార్ప నేర్తు నను
నురు ధైర్యము నా కున్నది, యైనను
సంగ్రామంబున జయాపజయములు
సందిగ్ధంబులు సబలుల[3] కైనను
సీతతోఁద భాషించిన చక్కఁగు
భాషింపమి యాపదకు హేతు వగు
ససంశయము[4] కర్జంబును ప్రాజ్ఞులు
సలుపరా దనుచు తలచెను మారుతి[5]. 

---

1 పొడగును 2 యుద్ధమున 3 బలముతోఁగూడినవారి కైనను 4 సందేహముతోఁగూడినకార్యమును 5 హనుమంతుడు.

243

దూత వివేక విదూరుఁ[1] డైనచో
కార్య మకార్యము కనగా జాలడు
అర్కు[2] నుదయమున నంధతమము వలె
నపుడు సిద్ధ కార్యములె నశించును
పండిత మాను[3] లపరిణత చిత్తులు[4]
దూతలు కార్య విఘాత మొనర్తురు
కార్య మెట్లు విఘ్నము కాకుండునొ
అట్లు చేయవలె నని తలచెను కపి. శ్రీ

244

అనఘుఁడు విది తాత్ముండును నగు
రాము మహిమ కీర్తన మొనరించెద
తద్గత మానస ధరణీసుత యది
విని యుద్వేగము[5] విడి ప్రసన్న యగు
దశరథసుతుఁ డే ధర్మయుక్తములు
పలుకులు పలికెనో వానిని
మధురమ్ముగ నమ్మకము కల్గు గతి
చెప్పెద నని తలఁచెను హనుమంతుఁడు. శ్రీ

---

1 అవివేకి యైనచో 2 సూర్యుని 3 పండితులమని అనుకొనువారు 4 అపరిపక్వహృదయముకలవారు 5 దుఃఖము.

# సర్గము 31

245

అయోధ్య యను పురి అమరపతి సముఁడు[1]
రథ కుంజర హయరాజి రాజితుఁడు[2]
చక్రవర్తి కుల జాతుఁ డహింసా రతుఁ
డక్షుద్రుఁడు లక్ష్మీవంతుఁడు
చతః పయోనిధి సంవృత భూ పతి[3]
అమల యశుఁడు రాజర్షి శ్రేష్ఠుఁడు
దశరథుఁ డను భూ దయితుఁ డుండె నని
హనుమ రాము కథ నారంభించెను. శ్రీ

246

అతని అగ్రసుతుఁ డంబుజ వదనుఁడు[4]
ధర్మ రక్షకుఁడు ధనుష్మ ద్వరుఁడు[5]
జీవ లోక సంజీవనుఁ డరికుల
భయంకరుఁడు సర్వజ్ఞుఁడు రాముఁడు
సత్య సంధుఁ డగు జనకు వచనమున
సపత్నీకుఁడును ససోదరుఁడు నయి
చని యడవికి రాక్షసుల ననేకుల
కసి మసంగ[6] నని కపి కథ తెలిపెను. శ్రీ

---

1 ఇంద్రసమానుఁడు 2 రథముల,ఏనుఁగులఁ గుఱ్ఱముల సముదాయముతో ప్రకాశించువాఁడు 3 నాల్గు సముద్రములచేచుట్టఁబడినభూమికి రాజు 4 పద్మము(చంద్రుని)వంటిముఖముకలవాఁడు 5 విలుకాండ్రతో శ్రేష్ఠుఁడు 6 చంపెను.

247

జనస్థానమున దనుజుల పలువుర
ఖర దూషణ విఖ్యాత నాయకుల[1]
దశరథ నృప నందనులు చంపిరని
యెఱిఁగి రావణుఁడు పరమ కోపమున
మృగ రూపుఁడు మారీచ దనుజుచే
మోసగించి రాముని యిల్లాలిని
జనక రాజనందిని యగు సీతను
హరించె నని కపివరుఁడు తెలిపె కథ. శ్రీ

248

వెదకుచు భార్యను వీరుఁడు రాముడు
కపి కులపతి యగు ఘను సుగ్రీవుని
బడసి మిత్రునిగ వాలి తదగ్రజు[2]
చంపి కీశ రాజ్య[3] మిచ్చె నతనికి
కృతజ్ఞుండు సుగ్రీవుం డాతని
భార్య వెదకుటకు వానర సేనల
సహస్ర సంఖ్యల సకల దిక్కులకు
పంపె ననుచు కపివరుఁడు తెలిపె కథ. శ్రీ

---

1 ఖరుఁడు, దూషణుఁడు మొదలగు ప్రసిద్ధులైన రాక్షస నాయకులు
2 అతని అన్నను 3 వానర రాజ్యము.

పక్షి రాజు సంపాతి వచనమున
శత యోజన విస్తృతము సాగరము[1]
నా పతికై వేగాతిశయంబున
నేను దాటి చేరితి లంకాపురి
ఏ రూపే సిరి[2] యే రంగామెకు
కలదని రాముఁడు తెలిపె న వన్నియు
కలిగిన నతి కనఁగల్గితి ధన్యుఁడ
నైతి ననుచు కథ హనుమ ముగించెను     శ్రీ

250

జనకజ యా కథ విని విస్మితయై[3]
భీతి శింశుపా వృక్షము నరసెను
శ్రీరాముని స్మరియించుచు నెదలో
ప్రక్కకు క్రిందికి పైకి చూచుచును
తూర్పు కొండపై తోఁచు నర్కు[4] వలె
మెఱయుచు శాఖాంతర సంస్థితుఁడై
యున్న మహామతి నూర్జిత[5] సత్త్వుని
నరసె హనుమ పింగాధిపు[6] మంత్రిని.     శ్రీ

---

1 సముద్రము  2 శోభ  3 ఆశ్చర్యము పొందినదై  4 సూర్యునివలె
5 గొప్ప సత్త్వము (బలము) కలవానిని  6 వానరరాజు మంత్రిని.

# సర్గము 32

251

చలిత హృదయమున శాఖాంతర గతు[1]
విద్యు త్పింగళు వేష్టిత[2] సిత పటు
తప్త కనక నేత్ర ద్వయ రాజితు
ఫుల్లాశోక సు మోల్లసి తాఘుని
మరు త్సుతుని భీమం బగు తద్రూపము
కని జానకి రాముని సౌమిత్రిని[3]
మనమున నెంచుచు మంద స్వరమున
విలపించెను భయవిహ్వల మతియై. శ్రీ

252

క్షితి రుహ శాఖల క్రిందికి మెల్లగ
దిగిన వాన రాధిపుని యమాత్యుని[4]
బుద్ధి మంతు పృథు ప్లీఘుగ్న వక్త్రు[5] గని
సీత తొలుత మూర్ఛిల్లి తేరుకొని
స్వప్నమందు నే శాఖామృగమును[6]
వికృ తాకారము వీక్షించితి నిది
శాస్త్ర నిషిద్ధము స్వస్తి రాఘవుల
కగుఁ గా కని తన యాత్మ తలంచెను శ్రీ

---

1 కొమ్మల నడుమ నున్నవానిని 2 చుట్టఁబడిన తెల్లనిబట్ట కలవానిని 3 లక్ష్మణుని 4 హనుమంతుని 5 పెద్దదియువంకరైనదియు నగుముఖము గలవానిని 6 కోతిని.

253

స్వప్నము కా దిది శర చ్చంద్ర ముఖు[1]
రాముని వీడి నిరంతర దుఃఖము
రాపాడఁగ నిద్రా విరహిత నయి
నవయు[3] నాకు స్వప్నం బెటు వచ్చును?
అనయము దశరథ తనయునె తలఁచుచు
నతని రూపమునె మతి భావించుట
అతని కథయె వి న్నట్లుగ నొక భ్రమ
కలిగె నేమొ యని తలఁచె మది మరల సతి. శ్రీ

254

మనోభిలాషము[4] ననుసరించుటయే
కనఁబడు నా కి ట్లని తలపోసెద
పరిశీలింపఁగ భ్రాంతి యై నటులు
తోఁపదు కోర్కెకు రూప ముండునే?
వ్యక్త రూపుఁడై పలికెను సీతఁడు
జోతలు[6] గురు వజ్రులు[5] కజాగ్నులకు
ఈ కపి చెప్పిన దెల్ల సత్య మగు
గావుత మని జనకజ ఆశించెను. శ్రీ

---

1 శరత్కాల మందలి చంద్రునివంటి ముఖము కలవానిని 2 క్రమ్ముఁగా
3 బాధపడు 4 మనసునందలి కోరిక 5 నమస్కారములు 6 బృహస్పతికి
ఇంద్రునికి, బ్రహ్మకు, అగ్నికి.

# సర్గము 33

## 255

అంత కపి మహీరూహము[1] నుండి దిగి
శిరమున నంజలి చేర్చి సీతఁ గని
ఎవతె వమ్మ? పద్మేక్షణ! పొద ప
శాఖ నూది[2] యిచ్చట నిలబడితివి?
అబ్జ దళ చ్యుత మంబువు[3] వలె నీ
కన్నుల నేటికి కారు బాష్పములు
సులక్షణమ్ములు చూడ రాజ సతి
వలె తోఁచెదు తెలుపవె యని యడిగెను. శ్రీ

## 256

సురవనితవ? కిన్నర భామినివా?
యక్షకాంతవా?, రక్షఃస్త్రీవా?
రుద్రుల వసుల మరుత్తుల సతివా?
శీతాంశుని[4] విడిచిన రోహిణివా?
వసిష్ఠముని కోపంబున త్యజించి
అరుదెంచిన ఆ ఆరంజోతివా?[5]
దివ్య కాంత వలె తేజరిల్లెదవు
తెలుపవె యని కపి యిలాజ నడిగెను. శ్రీ

---

1 చెట్టు 2 చెట్టు కొమ్మను పట్టుకొని 3 తామర రేకులనుండి జారు నీరు వలె 4 చంద్రుని 5 అరుంధతివా.

## 257

తండ్రియు దయితుఁడు[1] తనయుఁడు
భ్రాతయు[2] నెవ రమ్మా నీ కెఱిఁగింపఁ గదే
నిట్టూర్పులచే నేల స్పృశించుట
దివ్యపు కా వని తెలియవచ్చెడిని
దశగళుఁడు జస్థానమునుండియు
బలవంతముగా పట్టి హరించిన
రామచంద్రు భార్య వైన తెలుపుము
భద్రం బగు వని పలికెను మారుతి.[3] శ్రీ

## 258

రామ నామ సంశ్రవణ ముదిత యై[4]
అంత సీత ఆ హనుమంతునిఁ గని
రాజవరుఁడు దశరథునికి కోడల
జనక తనయ, రాముని యిల్లాలను
జనకుని సత్యంబును నిల్పుటకై
విడిచి రాజ్య మడవికి పతి రాఁగా
నతనితోడ వచ్చితిమి నేను ల
క్ష్మణుఁ డను మఱఁదియు నని యెఱింగించెను. శ్రీ

---

1 ప్రియుఁడు 2 సోదరుఁడు 3 హనుమంతుఁడు 4 రాముని పేరు విను టచే సంతోషించినదై

259

దండకలో మే ముండిన వేళను
రాముండును లక్ష్మణుఁడు లేని యెడ
మోసగించి సన్యాసి వేషమున
రావణుండు నను లంకకు తెచ్చెను
ఇంక రెండు నెల లిచ్చె దురాత్ముఁడు
గడువు పిదప నే విడుతు జీవితము
పతి విరహితనై[1] బ్రతుక నేర్తునే
అని పవనజునకు[2] జనకజ తెలిపెను. శ్రీ

## సర్గము 34

260

జనకజ మాటలు విని హనుమంతుఁడు
తప్త చిత్త[3] నోదార్పఁ దలంచుచు
దేవి! రాము సందేశమ్మును గొని
యిచటికి దూతగ నేగుదెంచితిని
దశరథు తనయులు కుశలులు రాముం
డడిగె తల్లి! నీ దగు కౌశలమును[4]
శిరమున నంజలి చేర్చి లక్ష్మణుఁడు
అభివాదన[5] మిడె నని యెఱిఁగించెను. శ్రీ

---

1 భర్తృహీననై 2 హనుమంతునకు 3 దుఃఖించిన హృదయము కలది
4 కుశలమును 5 నమస్కారము.

261

మఱఁది పతియు క్షేమం బను పలుకులు
విని నంతనె భూతనయ ముదితయై
జనుఁడు మనిన శతసమల కేని[1] శుభ
మొందు ననెడి ఆర్యోక్తి యథార్థమె
అని తలంచి రాము నుండి వచ్చిన
దూత యనుచు సంతోషము చూపెను
అనిలసుతుండును[2] హర్షచిత్తుఁడయి
సీత సమీపము చేరె మెల్లగను. శ్రీ

262

మారుతి చెంతకు చేరిన కొలఁదిని
అసురపతియె రూపాంతరమును[3] గొని
వచ్చెనేమొ యని వసుంధరాసుత[4]
శంక నొంది తరు శాఖను వీడుచు
నేల మీదనే నిషణ్ణయై[5] కడు
భయమున నేమియు పలుకక యుండెను
హనుమ యామె భయ మందుట
కనుఁగొని మ్రొక్కి కరంబులు మోడ్చి ఫాలమున శ్రీ

---

1 వంద సంవత్సరములకైనను 2 హనుమంతుఁడు 3 మఱొకరూపమును
4 సీత 5 కూర్చుండి.

263

వందమానుఁ[1] డగు వాసరపతిఁ గని
ఉర్వీ జాత[2] నిట్టూర్పులు పుచ్చుచు
రావణుఁడవె మాయావేషము గొని
వచ్చి నాకు నుపవాస కృశాంగికి
భీతి మరల కల్పించెద వేనియు
నీకు శుభము కానే కాదు సుమా
కాక నీవు రాఘవుని దూతవే
యగుచో భద్రం బగు నని పలికెను. శ్రీ

264

మనః ప్రియము రాముని కథ నాకగు
నతని గుణమ్ముల నభివర్ణింపుము
కాదు స్వప్న మిది కా దున్మాదము[3]
కాదు వాతగతి కాదు మనోభ్రమ
హరిశ్రేష్ఠ! ని న్నారసి నంతనె
నా మనమున కానందము కల్గెడి
ఐన నసుర[4] మాయాగుణ మెంచిన
భయమయ్యెడి నని పలికెను జానకి. శ్రీ

---

1 నమస్కరించుచున్న 2 సీత 3 పిచ్చి 4 రావణుని.

## 265

క్ష్మాసుత మనమునఁ గల సందేహము,
సరసి యామె కాహ్లాద మిడఁగ కపి
జననీ! రాముఁడు శశి[1] వలె రమ్యుఁడు
పద్మ బాంధవుని[2] వలె తేజోనిధి
హరి [3]వసువున సమ యశో విక్రముఁడు
మదనుని[4] వలె శ్రీమంతుఁడు సుభగుఁడు
స్థానక్రోధుఁడు సత్యవచనుఁ డని
రాము గుణప్రకరము వర్ణించెను. శ్రీ

## 266

అసురేంద్రుఁడు[5] నిను హరించి తెచ్చిన
దాని ఫలము సత్వరమే పొందెడి
జ్వాల దగ్ధుల[6] వలె వెలుఁగు శరంబుల
రాముఁడు వధించు రావణహతకుని
త్వద్వియోగ[7] బా ధార్తుం డాతఁడు
నను దూతగ పంపెను నీ చెంతకు
రాఘవులును కపిరాజు తదాప్తుఁడు
అడిగిరి కుశలం బని కపి పలికెను. శ్రీ

---

1. చంద్రుని 2. సూర్యుని 3. విష్ణువవలె 4. మన్మధుని 5. రావణుఁడు 6. ప్రకాశించు అగ్నులవలె 7. నీ యెడబాటు వలని.

267

భాగ్య వశంబున బ్రతికియుంటి వీ
దారుణ దితి జాధముల[1] మధ్యమున
కపుల నడుమ రాఘవుల రవి సుతుని
కను శుభకాలము కలుగు వేగమే
కీశేంద్రుండు[2] సుగ్రీవు నమాత్యుండ[3]
నసుర నాథు తల నడుగు పెట్టుటకు
వచ్చితి తరించి వార్ధి శంక విడి
అమ్మ! నమ్ము మ న్నని కపి పలికెను. శ్రీ

## సర్గము 35

268

హనుమంతుండు పల్కిన సాంత్వనములు[4]
విని జానకి యాతనిం గని ప్రియమున
కపిసత్తమ! రాఘవులకు నీకును
సంసర్గం [5]బే సరణి కల్గినది?
నరవానరులకు పరిచయ మే గతి
జరిగె రామ లక్ష్మణుల చిహ్నములు
వారల రూపము వారి భుజోరువు[6]
లెట్టివో తెల్పంగదే యని యడిగెను. శ్రీ

1. దుర్మార్గులైన రాక్షసులు 2. కపిరాజు (సుగ్రీవుడు) 3. మంత్రిని
4. అనునయ వాక్యములు 5. కలయిక 6. బాహువులు తొడలు.

269

ఎఱిగియు న న్నీ [1]ధరణీనందన
అడుగు చున్న దని హనుమ తలంచుచు
జననీ! రాముఁడు జలజ దళాక్షుఁడు[2]
సర్వ మనోజ్ఞుఁడు సకల గుణాఢ్యుఁడు
తేజంబున నాదిత్య సమానుఁడు
బుద్ధి బృహస్పతి భూమి సముఁడు క్షమ[3]
సద్యశమున వాసవ సంకాశుం[4]
డని తెలిపెను రాముని గుణగణములు — శ్రీ

270

స్వ జన భువన రక్షకుఁ[5] డా రాముఁడు
ధర్మ కర్మ వృత్త వర్ణ రక్షణు[6]
డఖిల లోక మర్యా దాభిజ్ఞుఁడు
సాధు కృతజ్ఞుఁడు సర్వారాధ్యుఁడు
వేదముల ధనుర్వేదమునందును
రాజ నీతి సర్వ కళల చతురుఁడు
శీల శ్రుత భాసితుఁడు[7] వినీతుం
డని తెలిపెను రాముని గుణగణములు — శ్రీ

---

1. సీత 2. పద్మపు రేకులవంటి నేత్రములు కలవాఁడు 3. ఓర్పున 4. ఇంద్రునితో సమానుఁడు 5. తన జనులను లోకములను రక్షించువాఁడు 6 రక్షించువాఁడు 7 శీలము చేతను వేదాది విద్యల చేతను ప్రకాశించువాఁడు.

## 271

శంఖగళుం డా జాను బాహుం దతం
డతి విపు లాంసుడు ప్రతాప వంతుడు
శుభాననుడు దుందుభి నిర్ఘోషుడు[1]
సమ విభక్త భాస్వర సర్వాంగుడు
జలద స్నిగ్ధ శ్యామల వర్ణుడు[2]
వ్యూఢో రస్కుం[3] డున్నత రూపుం
డాతని తమ్ముం డట్టి వాడె యని
కపి తెలిపెను రాఘవగుణ మూర్తులు శ్రీ

## 272

జననీ! రామ లక్ష్మణులు నీకొఱకు
నిఖి లాశల[4] నన్వేషణ చేయుచు
చనుదెంచిరి ఋశ్యమూక మనియెడు
పాదప సంకుల పర్వత భూమికి
అచ్చట సుగ్రీ వాభిదు నగ్రజావ
రోపితు[5] నధిపతిం గొల్చుచు
వసించు చుంటిమి వానరు లందఱ
మని కపి తమ వృత్తాంతము తెలిపెను. శ్రీ

1. దేవతావాద్యములవంటి కంఠధ్వని కలవాడు 2. మేఘములవలె నిద్దమైన శ్యామల వర్ణముగల సకలావయవములు కలవాడు 3. వెడల్పైన వక్షము కలవాడు 4. అన్నిదిక్కుల 5. అన్నచే సింహాసన భ్రష్టుడుగా జేయబడినవాడు.

## 273

వారి సోదరుల చీర[1] వసనులను
ధనుష్పాణులను[2] కని సుగ్రీవుఁడు
భయమోహితుఁడై వారి దరికి నను
పంపెను నేనును పరమ వినయమున
చేరి వారి తెచ్చితి కపి నాథుని
చెంతకు, వారికి స్నేహ మేర్పడెను
అని నర కీశ సమాగమ వృత్తము[3]
జనకజ కెఱిఁగించెను మరుత్సుతుఁడు[4] ॥ శ్రీ ॥

## 274

భ్రాతృ నిరస్తుని[5] వానర నాథుని
నోదార్చెను మధురోక్తుల రాముఁడు
కీశేశుని[6] కెఱిఁగించె లక్ష్మణుఁడు
త్వద్విరహజ సంతప్తుని రాముని
భూతల పాతితములు నీ తొడవులు[7]
కపి యొసఁగి రాఘవునికి చూపితి
వాని నంకమున[8] పూని పొగిలె[9] నతఁ
డని మారుతి జరిగిన కథ తెలిపెను. ॥ శ్రీ ॥

---

1 వల్కలధారులను 2 విండ్లు చేతఁగలవారిని 3 నరులకు వానరులకు సమాగమము జరిగిన కథ 4 హనుమంతుఁడు 5 అన్నచే నిరసినపఁబడిన వానిని 6 కపిపతికి (సుగ్రీవునకు) 7 నగలు 8 తొడపై 9 దుఃఖించెను.

## 275

జనని నీ విరహమున[1] రఘు నాథుఁడు
వినిద్రుఁడై[2] కంపించు తపించును
భూకంపముచే భూమి ధరము[3] వలె
వహ్నిచే నసల పర్వతంబు[4] వలె
రమ్య వనంబులు ప్రస్రవణంబులు[5]
నదులు కనియు నానందింపఁడు మది
ఎంతనురాగం బెంత గౌరవం బని
సీతకు హనుమంతుఁడు తెలిపెను

శ్రీ

## 276

నిను వెదకించెద నని సుగ్రీవుఁడు
హరింతు వాలి నటంచు రాముఁడును
పరమ స్నేహ నిబద్ధ చిత్తులై
వహ్ని సాక్షిగా[6] ప్రతినలు చేసిరి
రాముఁడు వాలిని రణమున వధించి
అర్కజు[7] కపి రాజ్యంబున నిల్పెను
కపి పతి, నిను వెదకఁగ నలుదెసలకు
పంపె కపుల నని పావని[8] తెల్పెను.

శ్రీ

---

1 ఎడఁబాటుచే 2 నిద్రలేనివాఁడై 3 పర్వతము 4 అగ్ని పర్వతము
5 సెలయేర్లు 6 అగ్నిసాక్షిగా 7 సుగ్రీవుని 8 హనుమంతుడు.

277

వర బలాఢ్యు లగు వానరు లెందఱొ
అన్ని దెసల ని న్నన్వేషింతురు
అపార విక్రముఁ డైన వాలిసుతు
నాధిపత్యమున యామ్య దిక్కునకు[1]
నరుగు దెంచి మే మంబ! వింధ్య గిరి
నష్టాధ్వులమై[2] నవయుచు[3] నుండగ
జటాయు సగ్రజుఁ డిట నీ వుండుట
మాకు వినిచె నని మారుతి తెలిపెను. శ్రీ

278

ఇట్లు రామ సుగ్రీవుల కైక్యము[4]
తనరె వారి దూతగ నే వచ్చితి
నినుఁ గాంచిన వార్తను వానరులకు
తెలిపి దుఃఖితుల కలత తీర్చెదను
అబ్ధి లంఘనము[5] సార్థం బయ్యెను
నిను చూచిన యశమును గనఁజాలితి
చంపి రావణుని స మిత్ర బాంధవు[6]
నిను పొందును పతి! యని కపి తెలిపెను. శ్రీ

---

1 దక్షిణ దిక్కునకు 2 దారి తప్పిన వారమై 3 బాధపడుచుండగా
4 మైత్రి 5 దాఁటుట 6 మిత్రులతోడను బంధువులతోడను గూడినవానిని

279

మాల్యవంత మను మహీధర రాజము[1]
నను వసించు మజ్జనకుఁడు కేసరి
గోకర్ణాభిధ కుధరమునకు[2] చని
దనుజు శంబసాదను[3] వధియించెను
వాయువుచే తద్భార్యకు పుట్టితి
హనుమంతుఁడ నైతిని స్వ కర్మమున[4]
ఇవి యన్నియు వచియించితి నమ్మిక
నీకు కల్గ నని నివేదించె కపి. ॥శ్రీ॥

280

ఆ మాటలు విని ఆనందము కని
హర్ష బాష్పముల నవనిజ[5] విడిచెను
భాసిల్లెను తద్బంధుర వదనము
రాహు ముక్త చంద్రబింబమ్ము వలె
హనుమంతుఁడు చెప్పిన దాశరథుల[6]
గుణముల బట్టియు గుర్తులబట్టియు
ఆతఁ డసురుఁడు[7] కాఁ డనియు రాఘవుం
డనిపిన దూతయె యనియును నమ్మెను. ॥శ్రీ॥

---

1 పర్వత శ్రేష్ఠము 2 పర్వతమునకు 3 రాక్షసుని 4 నా కర్మముచే (తాను చేసిన పనికి ఫలితముగా) 5 సీత 6 దశరథకుమారుల 7 రాక్షసుడు.

281

అమ్మ! భద్ర మగు సమాశ్వాసిల్లుము
మదిని నీకు నమ్మకము కల్గుటకు
రామాంకిత మగు రమ్య ముంగరము
తెచ్చితి నని కపి యిచ్చె జనకజకు
అది గ్రహించి పతి నారసి నట్లే
పొందె నామె యానంద మఖండము
రాహు ముక్త మగు రాకా శశి[2] వలె
నామె ముఖము శో భాకర[3] మయ్యెను. శ్రీ

282

కపివర! నీ విక్రమ మెన[4] లేనిది
ఉగ్ర మసుర పుర మొకఁడవె చొచ్చితి
శత యోజన విస్తృత మంభోనిధి[5]
ఖల జవముల గోష్పదీకరించితి[6]
పరాక్రమంబును పరీక్ష చేయక
నా కడ కంపునె నాథుడు దూతను
భయపడ వసురకు ప్రాకృతుండవే[7]
నీ వని జనకజ కపిఁ బ్రశంస చేసెను. శ్రీ

1 తూలుట చెందుము 2 పున్నమనాఁటి చంద్రునివలె 3 కాంతి నిలయము 4 సాటి 5 సముద్రము 6 ఆవు పాదమువలె చేసితివి (అంత సులభముగా దాఁటితివి) 7 సామాన్యుడవే (కాదు).

283

సౌమిత్రియు దాశరథి కుశలు లని
తెలిపితి హర్షము కలిగె నా మదికి
కుశలి యైన కాకుత్స్థుఁ[1] డలుక నీ
పుడమి నేల కాల్చుఁడు లయాగ్ని వలె[2]
శక్తిమంతుఁ డయ్యును రాఁ డిచటికి
నా చింతకు నంతము[3] లే దేమో
నాకయి వెత[4] నొందఁడె తపింపఁడే
యని హనుమంతుని నడిగె నవనిసుత.   శ్రీ

284

భ్రాంతి దైన్యములు వడయక[5] ననుపొం
దఁగ నాథుఁడు యత్నము లొనరించునె
అర్థోపాయము లరి మిత్రుల[6] యెడ
జిగీషు[7] వయి యొప్పుగ పాటించునె?
తగిన సమయముల దైవ పౌరుషము
లతని యెడల నిత్యములై వర్తిల్లునె
నా యెడ ప్రేమము మాయదు[8] కద? యీ
ప్రవాసమున రఘుపతి కని యడిగెను.   శ్రీ

---

1 రాముఁడు 2 ప్రళయకాలము నందలి అగ్నివలె 3 తుది 4 బాధ
5 పొందక 6 శత్రుమిత్రుల విషయమున 7 జయింప నిచ్ఛకలవాఁడయి
8 నశింపదు.

285

అయోధ్యయందలి ఆప్తబంధువులు[1]
సేమముమె భాసిల్లు చుందురే
నాకొఱకై సైన్యంబును పంపునె
భ్రాతృభక్తు[2] డగు భరతుం డనఘుఁడు
కీశేశుఁడు[3] సుగ్రీవుఁడు నాకై
అరుదెంచునె కపి వర వాహినితో[4]
రణమున దశకంఠుని మృతి వేగమ
కనజాలుదునే అని సతి అడిగెను. (శ్రీ)

286

ధర్మ నిమిత్తము త్యజించి[5] రాజ్యము
నడవికి వచ్చుచు నతఁడు కలంగఁడు
అనన్య లభ్యం[6] బతనికి నా యెడఁ
గల యను రాగము కరుణయు నమ్మిక
నా వియోగమున నా విభు ముఖ ప
ద్మము వాడదు గద తమ్మి యొండ[7] వలె
తత్ప్రవృత్తి[8] విను దాక నెట్టులో
బ్రతుకఁ దలఁతు నని పలికెను జనకజ.

---

1 సన్నిహిత బంధువులు 2 అన్నయెడ భక్తిగల 3 కపిరాజు 4 సేనతో
5 విడిచి 6 ఇతరులకు పొందశక్యము కానిది 7 పద్మ మెండయందువలె
8 అతని వార్త.

287

జనకజ పలుకులు విని హనుమంతుఁడు
శిరమున నంజలి చేర్చి వినతుఁడై
ఎఱుగఁడు రాముం డీ విట నుండుట
జనని! నేను తెల్పిన తోడ్తోడనె
శరధి[1] దాటి వానర సేనలతో
వచ్చి లంక విధ్వంస మొనర్చుచు
నీ విరహంబున నెంజిలి గను సిం[2]
హార్దిత కరి వలె[3] నని వచియించెను. ॥శ్రీ॥

288

భుజియింపఁడు రాముఁడు మాంసము మధు
వానఁడు[4] తిను వన్యము లగు ఫలములె
త్వర్గత మగు చిత్తమున మేనిపై
వన దంశమ్ములు[5] వ్రాలిన త్రోలఁడు
నీ వియోగమున నిత్య దుఃఖితుఁడు
ధ్యాన పరుం డయి తలపఁ డన్యమును
నిద్ర కనఁడు కను నేనియు సీతా!
యనుచు లేచు వెస నని కపి తెలిపెను ॥శ్రీ॥

---

1 సముద్రము 2 మనోవ్యథ 3. సింహముచే బాధ పెట్టఁబడిన యేనుఁగువలె 4 మద్యము త్రాగఁడు 5 అడవి యీగలు.

తల్లి! అతఁడు పరితప్యమానుఁడై[1]
సీత యనుచు నిన్నే తలఁచు సదా
మనోజ్ఞ[2] మగు కుసుమమునొ ఫలమునో
కాంచు నపుడు ప్రియ! యంచు నెంచు నినె
వ్రతస్థుఁ డయి నినుఁ బడయుటకొ అతే
నిత్య మతఁడు యత్నించు సత్వరమె
చారు కుండల విశాల నేత్ర మగు[3]
తన్ముఖమును కసు దని కపి పలికెను. శ్రీ

## సర్గము 37

290

ప్రియ సంకీర్తన వీత శోక యయి[4]
యాశ్వసిల్లి యపు డవనిజ కపిఁ గని
శరదాగతి[5] జలధర కించి ద్వృత
శశి బింబ మ్మగు[6] నిశ వలె తోఁచుచు
అనఘ! రాఘవుఁ డనన్య మానసుఁ
డతి శోక పరాయణుఁ డని చెప్పెడి
పలుకు నీది విష మిశితం[7] బగు సుధ
వడువున[8] కనిపించెడి నని తెల్పెను. శ్రీ

---

1 మిక్కిలి తపించుచున్నవాఁడై 2 అందమగు 3 అందమైన కుండలములు వెడల్పైన కన్నులు కల 4 ప్రియుని సంకీర్తనచే తొలఁగిన దుఃఖము కలదై 5 శరత్కాలము రాకయందు 6 మేఘములచే కొలఁది గ చుట్టఁబడిన చంద్రబింబమువలె 7 విషముతో కలుపఁబడిన 8 విధమున.

291

వ్యసనమునం[1] దైశ్వర్యమునందును
త్రాస వోలె నరు లాగు కృతాంతుఁడు[2]
లక్ష్మణుఁడు శ్రీరాముఁడు నేను
ఎట్లు వ్యసన మోహితులమొ చూడుము
ప్రాణి తతి కపరిహార్యం[3] బగు విధి
అందు నెపుడు దుఃఖావధి?[4] రాముఁడు
ఉదధి హ తోడుపు[5] డొడ్డును వలె నని
మహీనందిని హనుమంతుని కనియెను. శ్రీ

292

రెండు నెలలు గడు విచ్చె నసురపతి
విభీషణుఁడు నయవిదుఁడు యత్నమున
నెంత చెప్పినను ఈఁ నొల్లఁడు[6] న
న్నని మృతి దా పయ్యెను[7] కాఁబోలును
ఘనుఁడు విభీషణు కన్య అనల నా
కఁబా ప్రేషిత[8] యయి యిది తెల్పెను
అంతరాత్మ నాయది శుద్ధము మే
లెఱిఁగించెడి నని యిలాజ తెల్పెను. శ్రీ

---

1 దుఃఖమునందును 2 విధి (యముఁడు) 3 తొలఁగింపఁదగనది.
4 శోకాంతము 5 సముద్రమున చెడిన తెప్పగలవాఁడు 6 ఈయనంగీకరింపఁడు 7 సమీపించెను 8 తల్లిచే పంపఁబడి.

293

సత్త్వ మానృశంస్యము[1] కృతజ్ఞతయు
ఘన వీర్యము రాఘవునం దున్నవి
అరు లెవ్వరు నిల్తు రతని ముం దని
నెఱుఁగుదు నాతని యురుపరాక్రమము
శరకరములఁ[2] దాశరథి భాస్కరుఁడు
అరి రాక్షస[3] తోయము నింకించును
ఎపుడు వచ్చునో యీ లంకాపురి
కెపుడు కనునో యన్నని సతి పలికెను. శ్రీ

294

అశ్రు పూర్ణయై యా నిజ పల్కిన
పల్కులు విని కపి వరుఁడు వినతుఁడై
జననీమణి! నే చని తెలుపఁగనే
కపి సేనలతో కదలివచ్చు పతి
అంత యేల అగు మమ్మ పృష్ఠగత[4]
విప్పుడ నిను చేర్చెద రఘునాథుని
హుత హవ్యము పురుహూతు[5] నగ్ని వలె
నని మహిదుహితకు[6] హనుమ వచించెను. శ్రీ

---

1 దయ 2 బాణములనెడి కిరణములచే 3 శత్రువులైన రాక్షసు లనెడి
లమును 4 నా వీపుపై కూర్చున్నదానవు 5 ఇంద్రుని 6 సీతకు.

295

సరావణంబుగ సర్వలంకఁ గొని
వచ్చిన యట్టులె వార్ధి దాటఁగల
బల మున్నది సేవకునకు తల్లీ!
అనుమానింపక యాన తీఁగదవె
నినుఁ గొని నే చను చుండఁగ లంకా
వాసులు నను వెంబడింపఁ జాలరు
త్వద్విర హానల తప్తుఁడు[1] రాముఁడు
నినుఁగన గోరెడి నని కపి పలికెను. శ్రీ

296

అన విని జానకి హరియూధప![2] నీ
కపిత్వమును వ్యక్తము[3] గావించితి
అల్ప తనుఁడ వె ట్లధిపు దరికి నను
కాని పోఁజాలుదు వని వచియించెను
అంత పరాభవ మంది నట్లుగా
జననిఁ అకట! నా సత్త్వ మెఱుంగదు
నమ్మక మొదవగ నా స్వరూపమును
చూపెద నని కపి శూరుఁడు తలఁచెను. శ్రీ

---

1 నీ యెడఁబాటనెడి అగ్నిచే తపింపఁబడుచున్నవాఁడు 2 వానర సమూహాధిపతీ 3 కోతితనమును.

## 297

వహ్ని ప్రభుఁడై[1] వర్ధిలి మారుతి
సీత ముందు నిలిచెను మేరువు వలె
వజ్ర దంష్ట్రినఖు పర్వతోన్నతుని
కని కపి జనకజ కని యాశ్చర్యము
అనఘ! నీ బల మహత్త్వము లెఱిఁగితి
వాయు జవుండవు[2] వహ్ని తేజుఁడవు
ప్రాకృతు లెవ్వరు వార్ధి దాటి యీ
యవనికి రాఁగల రని వచియించెను. శ్రీ

## 298

కలదు నీకు నత్యలఘు శక్తి నిజ
మనఘు రాము కార్య జయ మెంచ వలె
అరుగుచుండ నీ వనిల వేగమున[3]
వార్నిధి నే పడవచ్చును భయమున
[4]అధిప ప్రేరితు లైన రాక్షసులు
కడువడి నీ వెంబడి రావచ్చును
కాన నేను నీతో నరుదెంచుట
[5]ఆపత్కర మగు నని సతి పల్కెను. శ్రీ

---

1 అగ్ని తేజస్సువంటి తేజస్సుగలవాడై 2 వాయువేగము గలవాఁడవు
3 వాయువేగమున 4 రావణునిచే ప్రేరేపఁబడిన 5 ఆపద కలిగించునది.

సాయుధ మగు రాక్షసవర్గముతో
నిరాయుధుఁడ[1] వగు నీ వని చేయుచు
నను నెట్టులు రక్షణ చేయుదువు
అని జయాజయము లవ్యవస్థములు[2]
పృష్టమునుండియు క్రిందఁ పడినచో
చత్తు నొండె[3] రాక్షసులు చంపుదురు
అపుడు నీ పడిన అంత శ్రమంబును
వ్యర్థం బగు గద యని సతి పలికెను.

శ్రీ

300

రాఘవుఁడును తద్భ్రాత లందఱును
రాజకులంబును రవిజ వానరులు[4]
నా కతమున సంతోష భరితులై
ఆర్తి కృశించెద రది యథార్థమే
కాని కపివరా! కౌసల్యా సుతు
నందుఁ గలుగు భక్త్యతిశయంబుచే
నతని తప్ప నే నన్యపురుష దే
హము స్పృశింప[5] నని సతి పలికెను.

శ్రీ

---

1 ఆయుధహీనుఁడవు 2 నిశ్చయము లేనివి 3 లేక 4 సుగ్రీవుఁడును కపులును 5 తాకఁజాలనని

301

అసురుల నందఱ నసహాయుఁడవై
మడియింపఁగ[1] దక్షుఁడ[2] వీ వగుదువు
కాని దాన రాఘవుని యశమునకు
కళంక మేర్పడు కావున కపివర!
చని రాఘవులను సైన్యంబులతో
తెచ్చి దశాస్యు[3] వధింపఁగఁ జేయుట
వారి ప్రతిష్ఠకు వారి వీర్యమున
కుచితం బగు నని ఉర్విజ పలికెను. శ్రీ

302

ఎఱుఁగుదు రాము నహీన విక్రమము
సములు కా రతని కమరాదులు నని
సలక్ష్మణుని కౌసల్యాతనయుని
నని లేరిత దీ ప్తానలమును[4] వలె
యుద్ధరంగమున నోర్వఁగల రెవ్వ
రనిఘ! కపులతో నా సోదరులను
తెచ్చి యిటకు సార్తిని[5] నను హర్షిత
నొనరింపవె యని ఉర్విజ పలికెను. శ్రీ

---

1 చంపుటకు 2 సమర్థుండవు 3 రావణుని 4 గాలిచే ప్రేరేపఁబడి ప్రకాశించు నగ్నివలె 5 ఆర్తితోఁ గూడిన దానిని.

# సర్గము 38

303

జనకజ వాక్కులు విని వాక్నిపుణుఁడు[1]
హనుమంతుఁడు కడు హర్షచిత్తుడై
దేవి! నీ పలుకు స్త్రీ స్వభావ సా
ధ్వీత్వంబులకును[2] వినయంబునకును
కడు తగి యున్నది కాంత వగుటఁజే
శతయోజన విస్తృత మగు వార్ధిని
నిను నా వీపునఁ గొని యేగుట సా
ధ్యము కా దది సత్యమె యని పలికెను. శ్రీ

304

దశరథ నందను తప్ప నొం డొకని
స్పృశింప నని భాషించితి వది యా
ఈడ్యు[3] సతికి నీకే తగి యున్నది
ఈవు తప్ప న ట్లెవరు పల్కుదురు?
రాముని యందలి ప్రేమ నా బలిమి[4]
అబ్ధి మదన్యుల కసాధ్య మౌటయు
తలఁచి యట్లు నే పలికితి దేవీ!
నను మన్నింపవె యని కపి పలికెను. శ్రీ

---

1 మాట నేర్పరి 2 స్త్రీ స్వభావమునకును పాతివ్రత్యమునకును
3 స్తుత్యుఁడగు రాముని 4 బలము.

305

నిను రామునితోడను చేర్పఁగ వలె
నను మాత్రంబు ననన్య సాధ్య[1] మగు
హృద్గత భక్తియు ప్రేరణ సేయఁగ
నటు పల్కితి నన్యథా తలంపకు
నీ భాషితములు నీ చేష్టితములు
నన్నియు తెలిపెద నా రఘుసుతునకు
నమ్మక మొదవఁగ నా కెది యైనను
అభిజ్ఞాన[2] మిమ్మా యని పలికెను ॥శ్రీ

306

అంత సీత దుఃఖాకుల గళయై
అనఘా! తెలిపెద నానవాలొకటి
చిత్రకూటమను క్షితిధరపాదము
నందు[3] సురాపగ కతి సమీపమున
మును సిద్ధాశ్రమమున వసించు తఱి
నా వహిలిన[4] వృత్తాంతము చెప్పెద
నది రహస్యముగ నర్కాన్వయ మణి[5]
కెఱిఁగింపవె యని యిలాజ పలికెను. ॥శ్రీ

---

1 ఇతరులకు సాధ్యముకాని 2 గుర్తు: చిహ్నము 3 పర్వతము క్రింద భాగమున 4 జరిగిన 5 సూర్యవంశ రత్నమునకు (రామునికి).

307

ఒక దివసంబున ఉపవనంబులో
విహరించుచు ప్రస్విన్న గాత్రినై[1]
కూరుచుండ పతి యూరువుపై[2] నొక
కాకి మాంసమును కాంక్షించుచు నను
పొడిచె ముక్కుతో నడరి[3] లోష్టమున[4]
వారించిన నది వదలదాయె తమి
సవరించుచు వస్త్రము నే నుండగ
హసించె పతి యని అపనిజ తెలిపెను. శ్రీ

308

సిగ్గును కోపము నగ్గలించగా[5]
కన్నుల నశ్రులు కారుచుండగా
మరల రాము దగ్గర కే నేగితి
జడియక[6] కాకయు పొడిచె తిరిగి నను
జడిగొను నశ్రులు[7] తుడుచుకొనెడి నను
కని నవ్వుచు రాఘవుడు నోదార్చెను
అలసి యుంట నే నతని యంకమున[8]
శయనించితి నని జనకజ తెలిపెను. శ్రీ

---

1 చెమట పట్టిన దేహముకలదాననై 2 తొడపై 3 విజృంభించి
4 మంటిగడ్డతో 5 అధికముగా 6 భయపడక 7 కురియు కన్నీరు
8 తొడపై.

309

సేదదేరి[1] లేచితి నే నంతట
పతి నా యూరువుపై నిద్రించెను
వచ్చి వాయసము[2] వ్రచ్చె[3] నా యురము
తడిసె నతని గాత్రము రక్తముచే
బోధితుఁడై రాముఁడు న న్నారసి
అలిగిన భుజగము[4] వలె నిట్టూర్చుచు
రమణీ! నీ యురము వ్రచ్చె నెవ్వఁ డను
చరసె నల్దెసల నని సతి పలికెను. ॥శ్రీ॥

310

కనఁబడె నతనికి కాకి సరక్తము[5]
లైన గోళ్ళతో నభిముఖగతమై
అతికోపంబున పతి ఆ కాకిని
చంపఁగోరి సంస్తరమునుండి వెస
గ్రహించి యొక దర్భను బ్రహ్మాస్త్రము
నభిమంత్రించుచు నతనిపై విసరె
నది కాలానల[6] మట్టులు మండుచు
తఱిమె కాకి నని ధరణిజ తెలిపెను. ॥శ్రీ॥

---

1 తేఱుకొని 2 కాకి 3 గాయము చేసెను 4 పాము 5 రక్తముతోఁ గూడినవి 6 ప్రళయకాల మందలి అగ్ని

## 811

కాకి యంత రక్షణమును కోరుచు
తల్లడ[1] మందుచు ముల్లోకములకు
పఱువిడె నింద్రుడు సురలు మహర్షులు
పాపి[2] దాని కాపాడ లేరయిరి
దిక్కు లేక అది తిరిగి వచ్చి కౌ
సల్యా సుతునే శరణము చొచ్చెను
వధార్హ మగు[3] నా వాయసమును పతి
ప్రోవ నెంచె నని భూమిజ తెలిపెను. శ్రీ

## 812

అబ్జ జాస్త్ర[4] మది అమోఘ[5] మగుటను
రాముడు కాకి తలంపు గుర్తెఱిగి
దానిచేత తద్దక్షిణ[6] నేత్రము
పొడిచి దాని నసువులతో విడిచెను
అది రాఘవునకు నా దశరథునకు
ప్రణతు లిడుచు తన వాసము చేరెను
శరణాగత రక్షకు డా రాముని
దయ అమేయ[7] మని ధరణిజ తెలిపెను. శ్రీ

---

1 కలత 2 పాపియైన ఆ కాకిని 3 చంపుటకు దగిన 4 బ్రహ్మాస్త్రము 5 వ్యర్థముకానిది 6 కుడికన్ను 7 అనంతము.

313

నా నిమిత్తమున హీన పక్షిపై
బ్రహ్మాస్త్రమునే ప్రయోగించె పతి
అట్టివాఁడు నను హరించి తెచ్చిన
అమ రారాతిని[1] క్షమించె నేటికొ
ఆనృశంస్యమే[2] అఖిల ధర్మముల
కగ్రగణ్య మని అతఁడే చెప్పియు
నాపై దయ పూనక యిటు విడుచుట
యుక్త మగునె యని యుర్వీజ పలికెను. శ్రీ

314

దీప్తానల సమ[3] తేజు లింద్రసము
లస్త్రవిదులలో నగ్రేసరు లగు
దశరథాత్మజు లుదారులు కరుణా
సాంద్రులు వీరులు సమర్థు లయ్యును
తీక్ష్ణ శరంబుల దితిజ సంతతుల[4]
కసిమసంగి[5] నను కాపాడుటకై
ఏతేరరు నే నే మహా దురిత[6]
మొనరించితినో యని సతి పలికెను. శ్రీ

---

1 దేవతల శత్రువును (రావణుని) 2 దయయే 3 ప్రకాశించు నగ్నితో సమానమైన తేజము గలవారు 4 రాక్షస సమూహముల 5 చంపి 6 పాపము

315

జనకజ పల్కులను విని హనుమంతుఁడు
ధరణీసుత నోదార్పఁ దలంచుచు
తల్లి! త్వద్విరహ తప్తుఁడు[1] రాముం
డన్నిట విముఖుం డై కృశియించెడి
కని సోదరు లక్ష్మణుఁడు తపించెడి
వచ్చ రాక్షసుల ద్రచ్చి[2] తీరుదురు
వారలకును కపి పతికి తెల్పఁదగు
నుడులు[3] చెప్పు మని యడిగె వినయమున శ్రీ

## సర్గము 39

316

అంత సీత హనుమంతుని నారసి
అనఘ! రామచంద్రునికి నా బదులు
వినతి[4] చేసి సుఖమును పృచ్ఛింపుము[5]
అట్లె లక్ష్మణుని నడుగు కౌశలము[6]
తల్లిని తండ్రిని ఎల్ల భోగముల
విడిచి వచ్చినాఁ డడవికి మాతో
నన్ను జనని వలె నన్నుఁ దండ్రి వలె
నరయు శ్వశురసముఁ[7] డని వచియించెను. శ్రీ

---

1 నీ యెడఁబాటుచే తపించుచున్నవాఁడు 2 ఖండిచి 3 మాటలు 4 నమస్కారము 5 అడుగుము 6 కుశలము 7 మామగారితో సమానుఁడు.

317

దాశరథులు సంతాపము విడి న
న్నెటులు బ్రోతురో యటులు వచింపుము
ఒక నెల మాత్రమె యిఁక జీవించెద
నింతలోనె హరి[1] యింద్రు సిరిని వలె
నను బ్రోవఁగ వలె నని యెఱిఁగింపవె
యని వచించి దివ్యమును శుభంబును
అంబర గతపురుష[2] నగు చూడామణి
పతి కిమ్మని మారుతికి[3] నొసంగెను. శ్రీ

318

హనుమంతుం డా మణి రత్నంబును
గ్రహించి సీతను గాంచిన హర్షము
మది నుప్పొంగఁగ ప్రదక్షిణము
వచ్చి యా సతికి వందన మొనరించి
మనమున దశరథ తనయులఁ దలఁచుచు
వాత విధూతం[4] బయి విముక్త మగు
అద్రి[5] యట్లు సుఖి తాంతరంగుఁ[6] డయి
మగిడి పోవ నెమ్మది నూహించెను. శ్రీ

---

1 విష్ణువు (వామనుఁడు) 2 వస్త్రమందున్నది 3 హనుమంతునికి 4 గాలిచే నెగురఁగొట్టఁబడి విడువఁబడిన 5 పర్వతము 6 సుఖించిన హృదయము కలవాఁడు.

319

జనకజ చూడామణి హనుమంతుని
కిచ్చి దీని పతి[1], యెఱుఁగు బాగుగా
అరసి దీని మువ్వురి, నను దశరథు
జనని ధారుణిని[2] స్మరించు రాముఁడు
ఈ కార్యంబున నీవె ప్రమాణము
కపివర! దుఃఖ క్షయ కరుఁ[3] డగుమా
అని పలికిన కపి యట్లే యని తల
వంచి చేసి నతి పయనం బయ్యెను. శ్రీ

320

ప్రస్థితుఁ[4] డగు కపివరుఁ గని జానకి
అశ్రు గద్గదం[5] బగు కంఠముతో
అనఘ! రాము లక్ష్మణుని కపీశ్వరు
నఖిల వానరుల నడుగుము కుశలము
బ్రతికి యుండఁగా పతి నన్నాపద
తరింపఁజేసెడి తెఱఁగొనరింపుము
నీ మాటలు విన నిజము రాఘవుని
పౌరుషంబు పెంపగు[6] నని పలికెను. శ్రీ

---

1 రాముఁడు 2 తల్లియైనభూమి 3 శోకమును నాశము చేయువాఁడవు
4 బయలుదేఱినవాడు 5 కన్నీళ్ళచే డగ్గుత్తికగల 5 విధము 6 అధికమగును.

321

అంత హనుమ మాతా! గొని వచ్చెద
రామలక్ష్మణుల ఁ యమున నిచటికి
వచ్చి వారు కపివర సేనలతో
నీదు శోకమును నివర్తించెదరు[1]
సురాసురులు నా పూరుల శరముల
వేడి[2] సైచి జీవింపఁ జాలుదురె
త్వన్నిమిత్తమై భాను నిందు[3] యము
నైన నోర్తు[4] వా రని వచియించెను. శ్రీ

322

ఆ మాటలు విని అవనిజ యాకని
నరసి గౌర వాదరము లెలర్పఁగ
వలతు[5] వేని కపివర! యొక దిన మిట
విశ్రాంతిని గొని వెడలు రేపకడ[6]
త్వ త్సన్నిధిలో భాగ్యహీన నగు
నా కించుక సంతాప శాంతి యగు
అరుగుదేని పునరాగతి[7] వఱకును
బ్రదుకు సంశ యాస్పద[8] మని పలికెను. శ్రీ

---

1 పోఁగొట్టెదరు 2 తీక్ష్ణత 3 చంద్రుని 4 ఓడింతురు 5 కోరుదువేని
6 రేపు ప్రాతఃకాలముననే 7 తిరిగి వచ్చుట 8 సందేహమునకు నెలవు.

823

సందియ మొక్కటి డెందము కలచెడి
వానర సేనలు నా నృపసూనులు
గరుడుఁడు నీవును గాలియు మాత్రమె
తరింపఁ గల దుస్తర[1] మగు వార్నిధి
నెట్లు దాటఁ గల రిందు కుపాయము
మతిమద్వర[2]! నీ మతి నూహింపుము
నీ వొకండవే నేర్తు నన్ను భయ[3]
వార్ధి మగ్న ప్రోవఁగ నని పలికెను. శ్రీ

824

హేతుమంతములు[4] సీత వచించిన
వాక్యంబులు విని వాయు తనూజుఁడు
జనని! కపీశ్వర సైన్య సంవృతుఁడు
సుగ్రీవుఁడు పరశూర భీకరుఁడు
నిను రక్షింపఁగ నిశ్చయించె నతఁ
డరుగుదెంచి సంహరించు నసురుల
కపుల విక్రమ మఖండము భూనభ[5]
ముల వారలు చనఁ గల రని తెలిపెను. శ్రీ

---

1 తరింప శక్యముకాని 2 బుద్ధిమంతులలో శ్రేష్ఠుఁడా 3 భయమనెడి సముద్రమునందు మునిఁగినదానిని 4 యుక్తియుక్తములు 5 భూమి యందును ఆకాశమునందును.

825

మత్స్యమానులును మద్వి శిష్టులును[1]
కల రెందఱో ఆ కపి వీరులలో
వారు ససాగర-పర్వతమును ధర[2]
వలగొని వత్తురు వాయు మార్గమున
నేనే దాటఁగ నేర్చితి వారిధి
వారికి లెక్కయె వర బల[3] నిధులకు
ప్రకృష్టులను[4] పంపరు దూతలుగా
పనుతురు[5] హీనుల నని కపి తెలిపెను. ॥శ్రీ॥

826

తల్లి! యెడఁద సంతాపము విడువుము
ముట్టడించు నీ పురి కపి సేనలు
నా పృష్ఠంబున నరవర[6] సూనుల
నుదిత చంద్రసూర్యుల వలె తెచ్చెద
రఘు నందనుఁడు సరాక్షసు రావణు
హరిగొని[7] నిను గొనిపోవు నయోధ్యకు
అచిర కాలమున నంబ దుఃఖసా
గరపారము[8] కనఁ గల వని తెలిపెను. ॥శ్రీ॥

---

1 నాకంటె నధికులు 2 భూమిని ప్రదక్షిణము చేసి 3 గొప్ప బలము
నకు నిధానములైన వారికి 4 గొప్పవారిని 5 పంపుదురు 6 పీవున
7 చంపి 8 దుఃఖమనెడి సముద్రము నవ్వలియొడ్డును.

రామ లక్ష్మణుల లంకా ద్వారము
నందు కాంతు వానర వీరులతో
రామునికంటెను లక్ష్మణుకంటెను
అధిక వీరు లెవ రవనిని తల్లీ!
అసుర భీకరం[1] బగు నే తావున
చిర మిఁక నీవు వసింపవు వనరకు[2]
మరిగి నేను దశరథుల కనుషఱ
కోర్చుకొనవె యని యోదార్చెను కపి.

## సర్గము 40

328

హనుమంతుని వాక్యములు సీత విని
ప్రియ వచనుని కపివీర! నిన్ను కని
అర్ధ జాత[3]సస్యము ధర వృష్టిని
పొంది వలె మహానందము నొందితి
అతి శోకాకుల మగు నపయవతతి
నా పురుషోత్తము శ్యామగాత్రము[4] స్పృ
శించి తమి[5] పరవశింపఁజేయవే
నన్నని దీనానన యై పలికెను.

---

1 రాక్షసులచే భయంకరమైన 2 విచారింపకుము 3 సగము మొలిచిన పైరుగల భూమి 4 నీలదేహము 5 ప్రేమతో.

329

అనఘా! మణి యొక అభిజ్ఞానమును[1]
తెలిపెద నమ్మిక కలిగించుటకై
ము న్నొక సమయమ్మున నా తిలకము[2]
చెదిరి పోవ మణిసిలతో[3] నాతఁడు
గండ పార్శ్వమున[4] కమనీయముగా
దిద్దె తిలక మది తెలుపు మాతనికి
అట్టి వాఁ డసురులందు నాయునికి
నోర్చె నెట్టు లని యుర్విజ పలికెను. శ్రీ

380

వారి సంభవము[5] వర చూడామణి
మించు వేడ్క రక్షించుచు నుంటిని
వ్యసన కాలమున[6] నసువులు వీడక
మనఁ జాలితి దీనినె వీక్షించుచు
సైప నేర రక్కసుల దురుక్తులు[7]
దను జేంద్రుని నిర్దయ వీక్షణములు[8]
బ్రతుక నొక్క నెలపై క్షణ మేనియు
నని చెప్పవె యని అవనిజ తెల్పెను. శ్రీ

1 గుర్తును 2 బొట్టు 3 ఎఱ్ఱమన్ను (జేగురు) 4 చెక్కిలి పక్క
5 జలమున పుట్టినది 6 దుఃఖసమయమున 7 చెడ్డమాటలు 8 దయలేని (క్రూరములైన) చూపులు.

331

జనకజాత బాష్పాకులాక్షి యై[1]
పలికిన వాక్యమ్ములు విని మారుతి
దేవి! దశరథాధీశుని తనయులు
అనిశము[2] నిను కనుఁగొన కాంక్షింతురు
వచ్చి రావణుని వధించి లంకా
పురము భస్మసాత్కరింత్రు[3] నిక్కము
వారి విక్రమ మపారము ధృతిఁ[4] గని
అరిగి వత్తు సెల వి మ్మని యడిగెను. శ్రీ

332

అంత సీత వీరాళి మౌళి[5] మణి
వర్ధమాను[6] పావని జిగమిషుఁ[7] గని
రాజసుతుల కపిరాజు వానరుల
సేమము పృచ్ఛించితి నని చెప్పుము
తెల్పు పతికి నా దీనస్థితి దా
నవనాథుని నానా తర్జనములు[8]
"పంథాన[9] స్తే భవంతు శుభదా"
చని రమ్ము రయమ్మున నని పలికెను. శ్రీ

1 కన్నీటిచే కలఁగిన నేత్రములుకలదై 2 ఎల్లప్పుడు 3 బూడిద చేయుదురు 4 ధైర్యము వహించి సెలవిమ్ము 5. వీరుల సముదాయమునఁ శిరోమణి (శ్రేష్ఠుండు) 6 వృద్ధిపొందుచున్నవానిని 7 పోవఁగోరువానిని 8 పలువిధములైన బెదరింపులు 9 నీకు మార్గము శుభకర మగుఁగాక.

# సర్గము 41

## 333

ప్రొక్కి జనకజకు పుణ్య చరిత్రుఁడు
శూరుఁడు కపి అచ్చోటు విడిచి చని
దేవిని[1] కంటి నదృష్ట వశమ్మున
అల్పశిష్టమే[2] యగు కార్యం బిఁక
ఇట కరుదెంచియు నీ యసురుల బలం
మంతయు నెఱుఁగక యరిగితి నేనియు
స్వామి కార్యము నసంపూర్ణముగా
నొనరించినవాఁడనె యని తలఁచెను. శ్రీ

## 334

పని యే దేనియు ప్రభువు[3] పంచు నెడ
అవిరోధంబుగ[4] ననే కార్యములు
ధృతి నెవ్వఁడు సాధింపఁగ నేర్చునొ
అతఁడే యగు కార్య కరణ[5] దక్షుఁడు
స్వల్ప కార్య నిర్వహణకు నైనను
కారణ[6] మొక్కటి కాదు సమర్థము
ఎవఁ డుపాయము లనేక మెఱుంగునొ
అతఁడె సమర్థుం డని కపి తలఁచెను. శ్రీ

---

1 సీతకు 2 కొలఁదిగా మిగిలినది 3 స్వామి 4 చెప్పిన పనికి విరోధము లేకుండ 5 పనిచేయుటయందు సమర్థుఁడు 6 సాధనకు.

## 335

సా మోపాయ మసాధ్య ముసురు లెడ
దానము సాగదు ధనవంతుల యెడ
భేదము బలదర్పితు[1] లెడఁ గూడదు
పరాక్రమంబే ఫలవంతం బగు
కొంద అసురులను కూల్చితి నేనియు
తక్కువారు మార్దవము[2] వహింతురు
అసుర పతికి[3] నా పస[4] తెలుపఁగ క
య్యంబే[5] తగు నని హనుమ తలంచెను ॥శ్రీ॥

## 336

తలపడి[6] రావణు తత్సైన్యంబు
త ద్బల మెఱిగియు తరలి పోయెదను
ఈ యశోక వన మింద్ర వరోపమ
మసు రేంద్రున కత్యంత ప్రియం బగు
అనలం బెడిన వనము నట్లు దీ
నిని భగ్న[7] మొనర్చిన దానవ పతి
పంపు బలంబును చంపి దానినే
మగిడి పోదు[8] నని మారుతి తలఁచెను. ॥శ్రీ॥

---

1. బలముచేత గర్వించినవారు 2 మృదుత్వము 3 రావణునకు 4 బలము 5 యుద్ధమే 6 మార్కొని 7 అగ్ని 8 తిరిగిపోదును.

337

అంత క్రుద్ధుఁడై[1] అనిల తనూజుఁడు
ఊరు వేగమున నుర్వీరుహములఁ[2]
నానా ద్విజ[3] సంతాన యుతంబుల
పర్వతాగ్రముల భగ్నము చేసెను
విఱిగిన తరువుల ద్విజ కూజితముల[4]
వాడిన చివుళుల పడిన లతాళుల
విదళిత గృహముల బెదరిన మృగముల
వనము చెడియె దవ[5] వహ్ని హతము వలె    శ్రీ

338

అశోక పాదప విశోభితము వన
మపుడు శోక[6] విహ్వల మైపోయెను
అసుర పతి[7] ప్రమ దాహ్లాద కరం
బగు వన మపు డముదావహ[8] మయ్యెను
ఇట్లు రావణుని ప్రియ మగు వనమును
రూపు మాపి తా నేపు[9] మీఱి కపి
అసుర బలముతో నని చేయుటకై
తోరణభాగము చేరి నిలంబడె    శ్రీ

---

1 కోపించినవాఁడై 2 చెట్లను 3 వివిధ పక్షి సమూహములతోఁ గూడిన వానిని 3 పక్షికూఁతలచే 4 కార్చిచ్చుచే కాల్చఁబడిన దానివలె 5 దుఃఖముచే కలఁతపడినది 6 రావణుని స్త్రీలకు సంతోషము కలిగించు 7 మోదము కలిగింపలేనిది 8 గర్వము 9 ద్వారభాగము.

## సర్గము 42

339

పక్షి నాదములు వృక్ష భంగములు[1]
విని లంకాపురజనము కలంగెను
సుప్తోత్థితలై[2] చూచిరి దానవ
కాంతలు కపి భగ్నం[3] బగు వనమును
వారల మనమున భయ మొదవుటకై
హనుమంతుఁడు దాల్చెను పెను రూపము
భీతలు[4] వారలు సీత చేరి కపి
యెవఁడు వచ్చె నిట కే లని యడిగిరి. (శ్రీ)

340

అంత సీత కామాకృతు లసురులు
వారి విషయ మెప్పగిది నెఱుంగుదు
నెవరో ఆ కపి యేమి చేయునో
రక్కసు లగు మీరలె యెఱుంగ వలె
పాము పాదములు పాములె యెఱుఁగును
అతని చూడ భయ మాయెను నాకును
కామ రూప రాక్షసుఁ డెవ్వఁడో అటు
వచ్చె నేమొ అని వారికి తెలిపెను. (శ్రీ)

---

1 చెట్లను విఱుచుట 2 నిద్రించి లేచిన వారై 3. హనుమంతునిచే భగ్నము చేయఁబడిన 4 భయమొందినవారు 5 ఇచ్ఛవచ్చిన రూపు ధరింపఁగలవారు.

341

జనకజ వాక్యములను విని కొందఱు
దితిజులు[1] భయపడి దిశలకు పాఱిరి
దశకంఠుని చెంతకు చని కొందఱు
అధిప! భీమవపు వగు[2] కపి యొక్కఁడు
అశోక వనమున కరుగుదెంచి సుం
దర మగు వనమును ధ్వంసము[3] చేసెను
ముట్టలేదు భూపుత్రిక యుండిన
ఆ తరు వొక్కటె అని వచియించిరి. శ్రీ

342

సంభాషించెను జనకజతో నతఁ
డెవరో యామె వచియింపఁగ నొల్లదు[4]
వాసవుఁడో[5] వైశ్రవణుఁడో[6] రాముఁడో
పంపి యుండు రా వానరు దూతగ
జనకజాత రక్షణము చేయుటే
అతని తలంపని వ్యక్త మయ్యెడిని
తద్దండమునకు[7] తగిన ప్రయత్నము
చేయ వలయు నని చెప్పిరి దితిజులు శ్రీ

---

1 రాక్షసులు 2 భయంకరమగు దేహముకలవాఁడు 3 నాశము
4 అంగీకరింపదు 5 ఇంద్రుఁడో 6 కుబేరుఁడో 7 అతని శిక్షించుటకు.

343

రక్కసి కాంతల వాక్కులు వినఁగనె
కోప ఘూర్ణి తాక్షుఁడు[1] దశకంఠుఁడు
మండిపడి పడెను హుత మగు ననలము[2] వలె
రాలె నేత్రముల రక్త బిందువులు
శంకాకులుఁడై సబలుని వానరు
నిగ్రహించుటకు[3] నుగ్ర విక్రముల
కింకరనామాంకితుల బలాఢ్యుల
నంపె నశీతి సహస్ర సంఖ్యులను[4] శ్రీ

344

వారలు ఘో రాకారులు వివిధా
యుధములు దాలిచి యుద్ధోన్ముఖులై
మిడుత లగ్నిపై వడువున[5] కపిపై
పడి బాణ గదా పరిఘము వేయుచు
చుట్టు ముట్ట నా శూరుఁడు వాలము
ధరణిఁ గొట్టి పెను ధ్వని యొనరించెను
ఆ శబ్దము విని అలికి[6] విహంగము[7]
లపగత జీవము లై[8] భువి పడియెను. శ్రీ

1 కోపముచే తిరుగుడుపడిన కన్నులు కలవాఁడు 2 అగ్ని 3 శిక్షించుటకు 4 ఎనుబదివేల సంఖ్య కలవారిని 5 విధమున 6 భయపడి 7 పక్షులు 8 పోయిన ప్రాణముకలవై.

345

జయము రామునికి జయ మతి బలునకు
సౌమిత్రికి[1] తరుచర పతికి[2] జయము
దాసుఁడ దశరథ తనయున కరివర
మర్దనుండ[3] హనుమంతు డ మారుతి[4]
అని[5] రావణ సాహస్రము నా కెన
గాదు తరుల రాగములను[6] విసరుచు
నడిచి లంక కన నఖి లాసురులు కృ
తార్థత[7] చనియెద నని కపి యఱచెను. శ్రీ

346

ఆ గర్జకు భయ మంది కింకరులు
భీ మాధయుధములు విసరి రతనిపై
అంత తోరణం బందలి పరిఘము
గ్రహించి కపి రాక్షసుల హరించెను
హత శేషులు[8] భయ మంది అసురపతి
చేరి కింకరుల చే[9] టెఱిఁగింపఁగ
నాతఁడు కినుక ప్రహ స్తపుత్రు రణ[10]
దుర్జయు హనుమంతునిపై కంపెను. శ్రీ

---

1 లక్ష్మణునికి 2 వానరపతికి (సుగ్రీవునకు) 3 శత్రువులను మర్దించు వాఁడను 4 వాయుసుతుఁడను 5 యుద్ధమున 6 శిలాసమూహములను 7 ధన్యతతో 8 చంపఁబడఁగా మిగిలినవారు 9 ఆపద 10 యుద్ధమున జయింప శక్యముకానివానిని.

# సర్గము 43

### 347

ఇంతలోన హనుమంతుఁడు చైత్య
ప్రాసాదము విధ్వంసము[1] చేయఁగ
నెంచి దానిపై కెగిరి బాహువులు
చఱచి భీమ నిస్వన మొనరించెను
రాఘవులకు కపిరాజునకు జయం
బని యెలుఁగెత్తి జయ ధ్వని చేసెను
చైత్యపాలు[2] రాశబ్దము విని కపి
నావరించి[3] బాణాదులు విసరిరి



### 348

ఆగ్రహ వివశుండై కపి వర్యుఁడు
శత ధారము[4] ప్రాసాదపు కంబము[5]
తివిచి వేగముగ త్రిప్పెను గిరగిర
ఒదవె[6] నగ్ని యం దుండి భీమమై
క్షణకాలంబున చైత్యం బంతయు
గడ్డి వోలె దగ్ధంబై పోయెను
హనుమ యంత నా యసురుల నందఱ
చంపి యంతరిక్షంబున[7] కెగిరెను.



---

1 నాశము 2 చైత్యమును కాపాడువారు 3 చుట్టుముట్టి 4 నూఱంచులు గలది 5 స్తంభము 6 పుట్టెను 7 ఆకసమునకు.

349

వేలకొలది ననుఁ బోలు వానరులు
దశ శత సహస్ర దంతి బలాఢ్యులు[1]
కీశేశుఁడు[2] సుగ్రీవుని యానతి
ధరణీ తలమున తిరుగుచు నుండిరి
వత్తురు రయమున వార లిచ్చటికి
రామునితో వైరము వహియించియు
మీరు రావణుఁడు మీ లంకయు నిఁక
నుందురె యని వాయుజుఁడు వచించెను శ్రీ

## సర్గము 44

350

అంత ప్రహస్తుని ఆత్మ జాతుఁ[3] డగు
జంబుమాలి దుర్జయ పరాక్రముఁడు
అసురేంద్రునిచే నాదిష్టుండై[4]
తరలి వచ్చి గర్దభ యుత రథమున[5]
శోరణస్థ కపి వీరుని ముఖమున
నిశిత శరంబును విసరె దానిచే
హనుమ తామ్ర ముఖ[6] మమరె శరత్తున
రవి కర హతి ఫుల్లము[7] వనజము వలె. శ్రీ

---

1 పదివందలవేల యేనుఁగుల బలసంపద కలవారు 2 కపిరాజు 3 కుమారుఁడు 4 ఆజ్ఞాపింపఁబడినవాఁడై 5 గాడిదలతోఁ గూడిన రథమందు 6 ఎఱ్ఱనిమోము 7 సూర్యకిరణముల తాకిడిచే వికసించిన పద్మము.

351

అసురు నమ్ముచే[1] నభిహతుఁడై కపి
ప్రక్కనున్న పెనురాతిని గైకొని
విసరె నసురుపై నసురుఁ దలుకమై
పరగఁజేసె శత శరములు కపిపై
కపి యంతట పరిఘంబును[2] చేకొని
జంబుమాలి వక్షమ్ముపై కొట్టెను
పరి ఘూహతి ఘన బలుఁడు రాక్షసుఁడు
చూర్ణిత తను భూషుఁడు[3] భువిఁ గూలెను. శ్రీ

## సర్గము 45

352

ప్రహస్త సుతు దుర్మరణము విని దశ
వదనుడు కోప వివర్తి తాక్షుఁడై
తప్త కనక చిత్ర ధను ర్ధారుల[4]
నమాత్య పుత్రుల[5] నంపె హనుమపై
వారు వచ్చి యబ్దము[6] జల ధారల
వలె శరములు కపిపై కురియించిరి
బాణావృతుఁడై వానర వీరుఁడు
వర్ష పిహిత పర్వత[7] మట్లలరెను. శ్రీ

---

1 బాణముచే 2 ఇనుపగుదియ 3 చూర్ణము చేయఁబడిన శరీరమందలి నగలు కలవాఁడు 4 పుటము పెట్టిన బంగారమువలె చిత్రవర్ణము గల విండ్లు ధరించినవారు 5 మంత్రికుమారులను 6 మేఘము 7 వర్షముచే కప్పఁబడిన పర్వతమువలె.

## ౮53

హనుమ అంబరంబున[1] విహరించుచు
వారి శరంబుల వ్యర్థము చేసెను
సలీలముగ ముష్టులచే[2] కొందఱ
నఖాగ్రముల చరణంబులఁ గొందఱ
కొందఱ ఱొమ్మున కొందఱ నూరుల[3]
నేలఁ గూల్చె దుర్నిరీక్ష్య బలుఁడై
భట సైన్యంబులు పాఱ నల్దెసకు
హనుమ మరల తోరణమునఁ జేరెను. (శ్రీ)

## ౮54

మంత్రి కుమారుల మరణ వార్త విని
దశకంఠుఁడు చింతాక్రాంతుండై
వానరవరు నిర్బంధించుటకై
సవాజి రథ గజ సైన్యంబులతో[5]
యూపాక్షుండు విరూపాక్షాఖ్యుఁడు
ప్రఘసుఁడు దుర్ధర భాసకర్ణు లను
పంచ చమూపతి[6] వర్యుల సంగర
మారుత వేగ సమానుల[8] పంపెను. (శ్రీ)

---

1. ఆకాశమున 2. పిడికిళ్ళచే 3. తొవలతో 4. చూడశక్యముగాని బలము గలవాఁడై 5. గుఱ్ఱములతో రథములతో ఏనుఁగులతోఁ గూడిన సేనలతో 6. అనఁది 7, ఐదుగురు సేనానాయకులను 8. యుద్ధమునందు వాయువు యొక్క వేగముతో సమానులైనవారిని.

355

క్రియల[1] బట్టి తర్కించి చూడఁగా
ఆతఁడు వానరుం డని మది తోఁపదు
నాకై తపమున నాకేశుఁడు[2] ఘన
దర్పము[3] నీ భూతము సృజియించెనొ
అస్మన్నిర్జితులైన[4] యక్ష గం
ధర్వులె యీ పన్నగము పన్నిరొ
వాన రాకృతిని వచ్చె మహాస[5]
త్వం బని తెలిపెను వారి కసుర పతి ॥ శ్రీ

356

దర్శించితి నెందఱినో కపులను
వాలి జాంబవ న్నీలాదుల మును
వారియందు కనఁబడ లే దీదృశ[6]
తేజో గతి బల ధీ విక్రమములు
మూఁడు లోకములు కూడ మీ యెదుట
నిలువఁ జాల వది నిక్కమె యైనను
ఆత్మ రక్షయం దప్రమత్తులై[7]
పట్టుఁడు కపి నని పలికె రావణుఁడు ॥ శ్రీ

---

1. పనులనుబట్టి 2. ఇంద్రుఁడు 3. గొప్పగర్వముగల 4. నాచేనోడింపఁబడిన 5. గొప్పశక్తి 6. ఇట్టి తేజస్సు గమనము బలము బుద్ధి విక్రమము 7. ప్రమాదము లేనివారై.

౩౫౭

పతి మాటలు విని పంచచమూపతు[1]
లరిగిరి వానర వరు నెదిరింపఁగ
అరదంబులతో కరివరములతో
వాజులతో[2] హుతవహసమ[3] తేజులు
రశ్మిమంతుఁడై రవి ప్రాగ్గిరి[4] వలె
తోరణమున తేజో రాజితుఁడై
అలరు హనుమఁ గని అతని యంగముల
పరగించిరి వా రురవడి శరముల శ్రీ

౩౫౮

శర నిహతుఁడు వానరవరుఁ డంతట
సదరఁగ దిశదిశ లఱచుచు మింటికి[5]
నెగిరి వాని వారించె మారుతము[6]
పయో దాంతమున[7] వారిదమును[8] వలె
నేల వ్రాలి ధరణీజము[9] గైకొని
ఒక్కొక్కరినే జక్కాడఁచెను[10] కపి
వారి దేహములు ధారుణి కూలెను
వజ్రాహత పర్వత శిఖరము లన శ్రీ

---

1. సేనాపతులు 2. గుఱ్ఱములతో 3. అగ్నితో సమానమైన తేజస్సు గలవారు 4. తూర్పుగిరి 5. ఆకసమునకు 6. వాయువు 7. వర్షాకాలముచివర 8. మేఘమును 9. చెట్టును 10. చంపెను.

359

పవనజుఁ డంతట వాయు వేగమున
సమ రాంగణ[1] సంచారము చేయుచు
కరి నికరంబును కరి నికరముతో
తురగ గణంబును తురగ గణముతో
రథ నిచయంబును రథ నిచయముతో
భటుల భటులతో ప్రహత[2] మొనర్చెను
హరి రథ కరి దేహంబులతో[3] ధర
తాంతంబై[4] రుద్ధాధ్వం[5] బయ్యెను. ॥శ్రీ॥

360

పంచ వాహినీ పతుల మరణమును
విని దశకంఠుఁడు ఘన శోకంబున
నగ్ర భాగ గతు[6] నక్షకుమారుని
దర్శించె రణోత్సాహయుతాత్ముని
పితృ వీక్షణ సంప్రేరితుఁ[7] డాతఁడు
బాల భాస్కర ప్రభోజ్జ్వలుండై
అరద మెక్కి సర్వాయుధ పూర్ణము
నేగె హనుమ నెదిరింప సేనతో ॥శ్రీ॥

1. యుద్ధరంగమున 2. చంపెను; కొట్టెను 3. గుఱ్ఱముల రథముల ఏనుఁగుల కళేబరములతో 4. నిండి 5. అడ్డగింపఁబడిన మార్గముకలది 6. ముందున్నవానిని 7. తండ్రి చూపుచే ప్రేరేపఁబడినవాఁడు.

361

లయకాలంబునఁ[1] ప్రజాక్షయంబును
చేయు నగ్ని వలె చెలగు కపివరుని
అతని వేగము పరాక్రమ మారసి
హిమ క్షయంబున[2] నిను[3] వలె వర్ధిలి
అక్షకుమారుం డాతనిపై మూ
డమ్ముల నతి నిశితమ్ముల[4] విసరెను
సాటి లేని తత్సమాగమం బపు
డయ్యె సంభ్రమద మమరాసురులకు

362.

కపి నేత్రంబుల కార శోణితము[5]
అంశుమాలి[6] యగు నర్కుని కైవడి
వెలుఁగుచు నేత్రానల దీధితులను[7]
దహించె నక్షుని తత్సైన్యంబును
అక్ష మహాంబుద మపు డదరించెను
పవన జాద్రి పై[8] బాణ వర్షమును
వివృద్ధ తేజో వీర్యు నక్షుఁ గని
గర్జించెను భీకరముగ మారుతి

శ్రీ

1. ప్రళయకాలమున 2. మంచునాశమైనపుడు 3. సూర్యుని 4. మిక్కిలి వాడియైవనానిని 5. రక్తము 6. కిరణసమూహముగల 7. నేత్రము లనెడి అగ్నికాంతులతో 8. అక్షుఁడను గొప్ప మేఘము 9. హనుమంతుఁడను పర్వతముపై

363

తృణాచ్ఛాదితము[1] ఘనకూపంబున[2]
గజ మటు లక్షుఁడు కపివరు చేరెను
అక్ష శరాహతుఁడై యతఁ డభ్రము[3]
పై కెగిరెను వడి బాహులు విసరుచు
అది గని అక్షుం డమ్ములు చిమ్ముచు
నరదముతో నంబరమున కెగసెను
వాయువు వలె తద్బాణమధ్యమున
శ్వసన సుతుఁడు[4] సంచారము చేసెను. శ్రీ

364

రాక్షస బాణ వ్రణిత వక్షుఁడై[5]
కన[6] లచ్చెరువును కలుగ పవనజుఁడు
బాలుం డీతఁడు భానుప్రభుఁడై
ప్రదర్శించు నప్రతిమ విక్రమము
సుర లసురులు నీ శూరవరుని కని
వెఱతు రీతని నుపేక్ష సేయ రా
ఁపుడ చంప వలె వృద్ధి పొందు శిఖి[7]
నార్పకుండ రా దని మది తలఁచెను, శ్రీ

1. గడ్డిచే కప్పఁబడినది 2. గొప్పనూతిని 3. ఆకాశము 4. వాయుకుమారుఁడు 5. రాక్షసుని బాణములచే గాయపఱుపఁబడిన ఱొమ్ము కలవాఁడై 6. కోపము 7. అగ్నిని.

363

అంత నాతఁడు తలాహతి[1] నక్షుని
అష్ట హయంబుల సరదము నడువఁగ
నతఁడు వానితో నవనిని కూలియు
విల్లమ్ములు కొన వింటికి[2] నెగిరెను
ఖగనాథుఁడు[3] భుజగమ్మును వలె కపి
పదములు రెండును పట్టి గట్టిగా
వేమాఱులు వినువీథి త్రిప్పి భువి
విసరె నతఁడు పడె విగత జీవుఁడై[4] (శ్రీ)

364

తిరిగెను ధర రిద్ధర, కంపించెను
కులపర్వతములు, కలఁగెను వార్థులు[5]
దివి, శబ్దించెను, తేజము[6] వాసెను
రవి, భయ మందెను రావణాసురుఁడు
మునులు యక్షులును భూతము లమరులు
నమరేంద్రుఁడు త న్నచ్చెరువునఁ గన
ప్రళయ కాల సమవర్తిని[7] బోలుచు
తోరణ సీమకు చేరె మరల కపి. (శ్రీ)

---

1. అఱచేతిదెబ్బచే 2. ఆకసమునకు 3. గరుడుఁడు 4. మరణించి 5. సముద్రములు 6. సూర్యుఁడు కాంతి కోల్పోయెను 7. ప్రళయకాల మందలి యముని.

367

అక్షుఁడు కపి హతుఁ డౌట రావణుఁడు
విని శోకము మనమున నడంచుకొని
అధిక రోషమున నగ్ర కుమారుని
ఇంద్రజిత్తు నమరేంద్ర కల్పు[1] గని
అక్షుఁడు కింకరు లమాత్య పుత్రులు
ప్రహస్త తనయుఁడు పంచ చమూపులు[2]
దుర్మరణము పొందుటయు కపీంద్రుని
అద్వితీయ శౌర్యము నెఱిఁగించెను. శ్రీ

## సర్గము 48

368

అస్త్ర శస్త్ర విద్యా వరిష్ఠుఁడవు
దేశ కాల నిర్దేశ విదుండవు[4]
మతి మంతుండవు మహనీయ తపో
బల సంపదచే వలరు ధన్యుఁడవు
సురాసురులలో దురమున[5] నీతో
నెదిరి పోర లే రెవ్వరు నిక్కము
ఎఱిఁగి నీ బలము నెదిరి బల[6] మ్మని
ఓర్చి రమ్ము శత్రువు నని పంపెను. శ్రీ

---

1. ఇంద్రసమానుని 2. అయిదుగురు సేనాపతులు 3. శ్రేష్ఠుఁడవు 4. దేశకాలముల సూచన నెఱుంగువాఁడవు 5. యుద్ధమున 6. శత్రువు బలము.

జనకుని మాటలు విని యా వీరుం
డాతని వలగొని[1] యాహ వోత్సుకుఁడై
పర్వ సమయముల పాథోనిధి[2] వలె
పొంగుచు త న్నా ప్తులు పొగడంగా
జవవంతము[3] లగు చతు ర్గజమ్ముల
నిం బొందెడి రథ మెక్కి రయమ్మున
హనుమ యున్న తోరణమును జేరుచు
సలిపె భీకరము జ్యా నినాదమును[4] శ్రీ

370

చాపధ్వని విని శ్వసన తనూజుఁడు[5]
తనువు పెంచి యుద్ధతుఁడై యఱచెను
ఇంద్రజిత్తు తీవ్రేషులు[6] విసరఁగ
తప్పుకొంచు కపి యుప్పర[7] మెగసెను
అసురు నంతరము ననిల సుతుఁడు రా
క్షస వీరుం డా కపి యంతరమును[8]
ఎఱుఁగ లేక యొం డొరుల కసాధ్యం
బగు గతి ఘోరాహవ[9] మొనరించిరి శ్రీ

---

1. ప్రదక్షిణించి 2. సముద్రము 3. వేగముతోఁగూడిన 4. వింటినారి ధ్వనిని 5. హనుమంతుఁడు 6. వాడి బాణములు 7. ఆకసమునకు 8. తారతమ్యము 9. భయంకర యుద్ధము.

# 371

నిశితము[1] లయ్యును నిజబాణమ్ములు
కపియెడ వ్యర్థత గాంచుట నారసి
అతఁ డవధ్యుఁ[2] డని అసురపతి సుతుం
డెఱిగి యుపాయాం[3] తరమును గానక
అఖిలాస్త్రజ్ఞుం డౌట నతనిపై
ప్రయోగించె వడి బ్రహ్మాస్త్రంబును
అనిల[4] తనూజుం డా యస్త్రముచే
బద్ధుండై భూపతితుం డయ్యెను ॥ శ్రీ ॥

# 372

శ్వసన తనూజుఁడు సమర్థు డయ్యును
వనరుహాసనుఁడు[5] మును తన కిచ్చిన
వరము స్మరించుచు బ్రహ్మాస్త్రముచే
కొండొక వడి బద్ధుండై యుండఁగ
నెంచి రావణుని కాంచి యతనితో
మాటాడుట కొక మహావకాశము
కలుగ వచ్చు నక్కతమున[6] నని మది
నూహించుచు పడి యుండెను కదలక ॥ శ్రీ ॥

---

1. వాడివయ్యును 2. వధింప శక్యముకానివాఁడు 3. అన్యోపాయము
4. హనుమంతుఁడు 5. బ్రహ్మ 6. ఆ కారణమున.

## 373

మాచ నిర్విచేష్టుని కపివీరుని
శణ[2] వల్కావనిజాత చీరముల
కట్టిరి దనుజులు కదలకుండె కపి
అసురేంద్రుడు తన్నరయ వచ్చు నని
బ్రహ్మాస్త్రము పర[3]బంధము సైపని
కతమున విడిచెను కపి నది వెంటనె
కని యది రావణ తనయుడు తన శ్రమ
వ్యర్థ మయ్యె నని వనరెను నెమ్మది.

## 374

హనుమంతుడు బ్రహ్మాస్త్ర[4] విముక్తిని
ఎఱుగ కట్టుచే యిల పడియుండెను
క్రూరు లసురు లా వీరునిఁ గొనిపో
యిరి రావణుకడ కఱచుచు పొడుచుచు
ఇంద్రజిత్తు తండ్రికి నెఱిఁగించెను
కరివలె బద్ధుని కపివరోత్తముని
కని రక్కసు లాతని నొండొరుతో
నుడివిరి రుష[5] చంపుడు మ్రింగుం డని

1. చేష్టారహితుని 2. జనుపనార చెట్లవల్కలములు మున్నగు వానితో
3. ఇతరమైనకట్టు 4. బ్రహ్మాస్త్రమునుండి విడువఁబడుట 5. కోపముతో.

## 375

అసురేంద్రుఁడు కపి నారసె, హనుమయు
రవి తేజుని నా రావణు కాంచెను
అంత రావణుం డతని యుదంతము
నడుగ నమాత్యుల[1] కాజ్ఞాపించెను
ఎవఁడవు నీ విట కే కార్యార్థము
వచ్చినాఁడ వని వా రడుగఁగ కపి
కీశేశుఁడు[2] సుగ్రీవుని దూతను
అతఁడు పంప వచ్చితి నని పల్కెను.

## 376

మణి కాంచన మయ మకుట[3] శోభితుని
వజ్ర యుక్త సౌవర్ణ భూషణుని
అంజన వర్ణుఁడు[4] హార భూషితుఁడు
నౌట బలాక యు[5] తాబ్ద సన్నిభుని
రక్తాక్షంబులు లం బాధరములు
తీక్ష్ణ దంష్ట్రములు[6] దీప్యమానములు
నగు దశ శిరముల నలరెడు వానిని
అసురనాథు సభ నారసె మారుతి

---

1. మంత్రులకు 2. కపిరాజు. 3. కిరీటము 4. కాటుకవంటి రంగు కల వాఁడు. 5. కొంగలతోఁ గూడిన మేఘముతో సమానుని 6. వాడికోరలు.

377

అతఁ డుపవిష్టుం[1] డయ్యెను స్ఫాటిక
చిత్ర రత్న మయ సింహాసనమున
వ్యజ నాలంకృత[2] హస్తలు ప్రమదలు
విడువ కతని సేవించుచు నుండిరి
ప్రహస్త దుర్ధర ప్రముఖు లమాత్యులు
పల్వురు ధనుజులు పరివేష్టింపఁగ
అమర పరివృతుం డగు[3] నమరేంద్రుని
వలె నాతఁడు సభ భాసిలు చుండెను.

378

దనుజ నాయకుని కనుఁగొని మారుతి
అతని తేజమున కచ్చెరు వందుచు
ఏమి రూప రుచు లేమి సత్త్వ ధృతు
లేమి యితని సర్వేద్య లక్షణత[4]
అధర్మ మొక్కఁడె అసదై యుండిన[5]
నితఁడు త్రిలోకాధీశుఁడు కాఁ దగు
క్రుద్ధుఁ డైన యితఁ డిద్ధర యేకా
ర్ణవము[6] చేయఁ జాలఁడె యని తలఁచెను

1. కూర్చుండెను 2 వింజామరలచే సలంకరింపఁబడిన చేతులు కలవారు స్త్రీలు 3. దేవతలచే చుట్టఁబడిన 4. స్తుత్యమైన సర్వలక్షణ సంపన్నత 5. అల్పమై (లేకుండిన) 6. ఒకే సముద్రము.

379

## సర్గము 50

తేజ స్సంపద[1] దీప్యమానుఁ డగు
కపిని గాంచి రాక్షస లోకేశుఁడు[2]
కైలాసంబును కదలింపఁగ మును
నను శపియించిన నందియొ యితఁడు
బాణాసురుఁడే వానర రూపము
నంది వచ్చెనో యని శంకించుచు
నితఁ డెవరు వనం బేల చెఱిచి దై
త్యుల చంపెనొ యని తెలియఁగఁ గోరెను.

380

అంత ప్రహస్తుఁడు హనుమంతునిఁ గని
వానర ! భయమును వదలి వచింపుము
పంపి రెవరు నిను వాసవుఁడా? వై
శ్రవణుఁడ?[3] వరుణుఁడ? శమనుఁడ?[4] హరియా?
వానర రూపం బైనను తేజము
వానరమై[5] కనుపట్టదు సీ యెడ
బ్రదికెదు సత్యము పల్కిన నసృతము
పల్కినచో మన[6]వన వచియించెను

1. కాంతిసంపదచే 2. రావణుఁడు 3. ఇంద్రుఁడా, కుబేరుఁడా
4. యముఁడా 5. వానర సంబంధమై 6. జీవింపవు.

881

## సర్గము 51

ఆ మాటలు విని హనుమంతుఁడు నను
పంప లేదు హరి వరు ణేం ద్రాదులు
జాతిచేత వనచరుఁడనె[1] రావణు
చూడఁ గోరి వని పాడు చేసితిని
అసురులు తలపడ నాత్మ రక్షకై
రణము చేసి వారల వధియించితి
అజు వరమున[2] నఖి లాస్త్రాసాధ్యుఁడ
నని వచించి రావణుఁ గని పలికెను

882

దశరథేశ నందనుఁ డగు రాముని
భార్య సీతఁ గొని వచ్చితి వంచన
ఆతఁ డామెకై అన్వేషించుచు[3]
నేతెంచెను సుగ్రీవుని చెంతకు
వానర పుంగవుఁ డైన వాలి వి
జ్ఞాత పూర్వుఁడే[4] కద నీ కతనిని
అని[5] నొక శరమున హరించి యిడె రా
జ్యము రవి సుతునకు[6] నని కపి తెలిపెను.

---

1. వానరుఁడనె 2. బ్రహ్మవరముచే 3. వెదకుచు 4. ఇదివఱకు తెలియఁ
బడినవాడే 5. యుద్ధమున 6. సుగ్రీవునకు.

## 383

కృతజ్ఞుఁ డగు సుగ్రీవుఁడు జనకజ
నన్వేషింపఁగ నన్ని దిక్కులకు
పంపెను వానర వరులను వినతా
సుత జవులను[1] మారుత సమ వేగుల
వారు భూమి నంబరము కుతలమును[2]
వెదకుచు నున్నా రతి తత్పరతను
ఏను నంగదుఁడు నితర కపులు యా
మ్య దిశకు[3] వచ్చితి మని ఽపి తెలిపెను.

## 384

హనుమ న్నాముఁడ ననిల నందనుఁడ
శత యోజన విస్తృత మగు వార్నిధి
క్షితి సుతకై లంఘించి[4] వచ్చి యిట
నామెను గాంచితి నదృష్ట పశమున
రాజకార్య సంప్రాప్తుఁడ వానర
పతి సుగ్రీవుఁడు పంపఁగ వచ్చితి
అతఁడు నీకుశల మడిగి హితము[5] పం
పెను సందేశము విను మని పలికెను.

---

1. గరుడుని వేగమువంటి వేగము కలవారిని 2. పాతాళమును 3. దక్షిణ దిక్కునకు 4. దాఁటి 5. మేలుచేయు సందేశము.

385

ధర్మజ్ఞుండవు[1] తపస్వి వరుఁడవు
తగునే? పర వనితలఁ గొని వచ్చుట
మూల విఘాతుకములు[2] పను లొనరిం
తురె? బల ధీ మంతులు భవాదృశులు[3]
చేసి రామునికి సేగి[4] త్రిలోకము
లందు నెవరు సుఖ మందఁ జాలుదురు?
లక్ష్మణ ముక్త శరమ్ముల సైపఁగ
నగునె ఎవరికే నని కపి తెలిపెను శ్రీ

386

హిత మిచ్చించెద వేని రాఘవున
కనఘున కుర్వీతనయ నొసంగుము
అవనిజాత పంచానన యగు ప
న్నగి[5] యని తెలియక నాశ మొందెదవు
లంకాపుర నాశంకారిణి[6] యగు
కాళ రాత్రి[7] నెఱుఁగవు నీ వామెను
ఎవ రామెను సైరింతురు? విష మి
శ్రాన్నము కైవడి[8]నని కపి తెలిపెను. శ్రీ

---

1. ధర్మము తెలిసినవాఁడవు 2. మూలమునకు హాని యొనరించు 3. నీవంటివారు 4. కీడు 5. ఐదు ముఖములు కల ఆడు పాము 6 నాశ మొనరించు 7. ప్రళయకాలరాత్రి 8. విషముతోఁ గలసిన అన్నము వలె.

887

వర బలమున దేవతలు రాక్షసులు
నను చంపఁగ లే రని గర్వింపకు
కీశేశుఁడు సుగ్రీవుఁడు రాముఁడు
కారు దేవతలు కారు రాక్షసులు
కారు యక్షులును గంధర్వాదులు
కారు పన్నగులు[1] కారు కిన్నరులు
దనుజనాథ ! నీ మనంబునం దిది
యాలోచింపుమ యని కపి పలికెను. శ్రీ

888

చేసి తపము నార్జించితి[2] పుణ్యము
భోగ రూపమున పొందితి ఫలమును
శేషించెను[3] చేసిన యధర్మమే
తత్ఫలమును పొందఁగలవు నీ విఁక
భూమి సుతా రాముల కోపాగ్నులు
కాల్చివైచె లంకా పుర మంతయు
పది శిరస్సు లిరువది నేత్రమ్ములు
తనరిన కనలే పని కపి పలికెను. శ్రీ

---

1. ఉరగులు 2. సంపాదించితివి 3. మిగిలెను.

389

రాముని కెదురుగ రణమున నిల్వఁగ
నలవి కాదు వేల్పులకు దైత్యులకు
నాగ యక్ష గంధర్వ సిద్ధులకు
విద్యాధరులకు విధాతృ శివులకు
అట్టి వాఁడు హర్యక్ష సన్నిధిని
ప్రతిన పట్టె నీ లంకను కూల్పఁగ
ప్రోతు రెవ్వ రిఁక భూమిజ నాతని
కర్పింపఁగదే యని కపి పలికెను.

## సర్గము 52

390

హనుమ మాటలను విని యసురేంద్రుఁడు
కనలి యాన తిచ్చెను కపి చంపఁగ
అంత విభీషణుఁ డగ్రజాతుఁ గని
రాక్షసేంద్ర ! ఆగ్రహము త్యజింపుము
ధర్మజ్ఞుఁడవు కృతజ్ఞుఁడ వీవె
కోపవశుఁడవై భూపధర్మమును[5]
భంగము చేయుట పాడి గా దపుడు
వ్యర్థమె వైదుష్యం బని పలికెను

---

. శక్యము 2. బ్రహ్మకు శివునను 3. వారలును 4. అన్నను 5. రాజ
ధర్మమును 6. పాండిత్యము.

391

పరావరజ్ఞులు[1] ధరణీపతు లరు
ల[2]ప్రియ మెంతటి దాచరించినను
చనువెంచిన దూతను వధియింపరు
ఎన్నియో యున్నవి యితరదండములు
ముండన[3] మంగమ్ముల వైరూప్యము
కశాఘాత లక్షణ విన్యాసము[4]
చేయ వచ్చు నౌచిత్యము నారసి
కోపము విడు ప్రాజ్ఞుఁడ వని పలికెను. (శ్రీ)

392

స్వయముగ నీతఁడు చనుదేఁ డి[5]తరులు
పలుకు మన్న వాక్కులె వచియించెను
దూత వధము కడు దోషం బీతని
వధియించిన నే ప్రయోజనం బగు
వీని నెవరు పంపించిరో వారల
నని నిర్జింపఁగ యత్న మొనర్పుము
ఈతని చంప వే ఱెవరు రామ ల
క్ష్మణుల నిటరు తేఁగల రని పలికెను. (శ్రీ)

---

1. ఉచ్చనీచముల నెఱిఁగినవారు 2. శత్రువులు 3. తల గొరిగించుట
4. కొరడాతో కొట్టుట ముద్రలు వేయుట 5. రాఁడు.

393

ని న్నెదిరింపఁగ నేర రెవ్వరును
విక్రమవంతులు వీరులు యోధులు
దనుజులు నీ వాహిని[1] కల రెందఱో
వార లేగి యీ వానరు పంపిన
రాజసుతుల సంగ్రామ రంగమున[2]
నోర్చి నీదగు మహోన్నత సత్త్వము
బలము ప్రభావము ప్రకటించుట తగు
మది నెంచుము ధర్మము నని పలికెను. శ్రీ

394

అనుజుని[3] మాటలు విని యసురేంద్రుఁడు
తగదు దూత వధ తగ దిది నిజమే
వేఱు దండనము విధియింపఁగవలె
ధూర్తుఁ డైన యీ దూతకు ఖలునకు
కోతుల కగు లాంగూలం[4] బిష్టము
దాని కాల్చి యీ వానరు వీథుల
ద్రిప్పుఁడు దనుజులు దీను నితని కని
హర్షించెద రని ఆజ్ఞాపించెను. శ్రీ

---

సేనయందు 2. యుద్ధరంగమున. 3. తమ్ముని 4. తోఁక.

### 395

అది విని రాక్షసు లానందంబున
పవనజు తోఁకకు ప్రాత వస్త్రములు
కార్పాసంబులు[1] కట్టి పోసి తై[2]
లము నేయియు ననలము దరికొల్పిరి[3]
వృద్ధులు బాలురు స్త్రీలు దానవులు
అనల దీప్తవాలుని[4] కపి చూడఁగ
వచ్చిరి ప్రీతిగ వానరుఁ డంతట
విసరి తోఁక భయపెట్టెను వారల ॥ శ్రీ ॥

### 396

దితిజు లంత బంధింపఁగ పవనజు[5]
నతఁడు రామ కార్యార్థము క్లేశము[6]
భరింతు, నే నీ బంధము లన్నియు
త్రెంచి వీరి మర్దింపఁగఁ[7] జాలుదు
నైన సరిగ లంకా నగరము పగ
లరయ వచ్చు నని యట్లే యుండెను
సలుపుచు భేరీ శంఖ నాదములు
పుర మంతయు త్రిప్పి రతని నసురులు ॥ శ్రీ ॥

---

1. దూదిని 2. నూనెయు 3. అంటించిరి 4. అగ్నిచే మండుచున్న తోఁక గలవానిని 5. హనుమను 6. బాధ 7. కొట్టఁజాలుదును.

397

దీప్తవాలు[1] నా ధీరు కనుంగొని
సీత కడకు చని చెచ్చెర[2] దనుజులు
నినుఁ గని సంభాషణ మొనరించిన
కపివరు నసురులు కాల్చి వాలమును
పుర మంతయు త్రిప్పుచు నున్నా రని
యశుభోదంతము[3] నావేదించిరి[4]
ఆత్మ హరణ తుల్యము[5] నా వార్తను
విని ధరణిజ నెమ్మనమున పొగిలెను. శ్రీ

398

మంగళమ్ము హనుమంతుని కొనరుపఁ
బూని యామె వైశ్వానరుఁ[6] దలఁచుచు
నేను పతివ్రత నైన తపస్విని
నైన కపివరున కగుము శీతుఁడవు
రాముఁడు నా శీలము తత్పరతయు
నమ్మిన హనుమకు కమ్ము శీతుఁడవు[7]
కపిపతి మద్రక్షణము చేయునే
నగుము శీతలుఁడ వని ధ్యానించెను. శ్రీ

---

1. మండుచున్న తోఁకగలవానిని 2. వేగముగా 3. అమంగళ వార్త 4. తెల్పిరి
5. తన చావుతో సమానమైన 6. అగ్నిని 7. చల్లనివాఁడవు.

## 399

అంత నగ్ని హనుమంతునకు శుభం
బగు నని యనఘుకు నపనీ జాతరు
తెలుపఁగనో యన తీక్ష్ణ జ్వాలల[1]
నణగించి ప్రదక్షిణ శిఖుఁ డయ్యెను
హనుమత్పిత[2] వాలానలగతుఁ డగు
శ్వసనుఁడు సీతకు సాంత్వన కరుఁడై
గంధసార హిమ కర్పూరాదుల[3]
వలె మిక్కిలి శీతలుఁడై వీచెను. శ్రీ

## 400

భూరి జ్వాలా పూర్ణుం డయ్యును
అగ్ని దహింపక అతిశీతలుఁడై
యుండుట గని కపి యోహో! రాముని
అనుభావం[4] బే మని వర్ణింతును?
అంబుధి[5] మైనాకాచలములె యటు
లాదృతి చూపఁగ నగ్ని చూపఁడే?
రాముని మహిమ ధరాజ[6] సత్త్వమున
తండ్రి చెల్మి[7] కాల్పం డని తలఁచెను. శ్రీ

---

1. తీవ్రమైన మంటలను 2. హనుమంతుని తండ్రి (వాయువు) 3. చందనము, మంచు, కర్పూరము మున్నగువాని వలె 4. మహిమ 5. సముద్రము 6. సీత 7. నాతండ్రియైన వాయువుతోడి స్నేహముచే.

## 401

అంత హనుమ తీక్ష్ణాకారుండై
త్రెంచుకొనెను బంధించిన కట్లను
క్రమ్మర శైలాకారము[1] దాలిచి
తోరణసీమను చేరి వేగమే
పరిఘంబును చేపట్టి రక్షకుల
నందఱ చంపి యనన్య శౌర్యమున
పురమును చూచుచు పుచ్ఛానల[3] రుచి
నర్చిమాలి[4] రవి యట్లు వెలింగెను. (శ్రీ)

## 402

దనుజులకు మనస్తాప మధికముగ
సలుపఁ దలంచుచు శ్వసన తనూజుఁడు[5]
నగర దుర్గమును నాశము చేసెద
కాల్చక నా కుపకార మొనర్చిన
లాంగూ లాగ్నికి[6] రాక్షసగృహముల
తృప్తి కూర్తు నని యెద నూహించుచు
వాల వహ్ని[7] దీప్తంబై మండఁగ
ముదమున భవనంబులపై కురికెను. (శ్రీ)

---

1. పర్వతమువంటి ఆకారము 2. ఇనుపగుదియ 3. తోఁకయందలి అగ్ని యొక్క కాంతిచే 4. కిరణమాలియైన సూర్యునివలె 5. హనుమంతుఁడు 6. తోఁకయందలి అగ్నికి 7. తోఁకయందలి అగ్ని.

403

ప్రహస్తేంద్రజిద్వజ్రదంష్ట్రశుక
సారణ రోమశ జంబుమాలులయు
మహాపార్శ్వ కుంభకర్ణ విద్యు
జ్జిహ్వ దంష్ట్ర హస్తిముఖాద్యులయును
గృహరాజముల దహించి పవనజుఁడు
దనుజనాథు[1] సౌధను నంటించెను
విడువలే దెవరి వేశ్మము[2] నొక్క వి
భీషణు గృహమునె విడిచె కృతజ్ఞత ॥శ్రీ॥

404

శ్వసనుని[3] సంగతి వర్ధిల్లెను కా
లాంత వహ్ని వలె నా హుతాశనుఁడు[4]
చేసిన పుణ్యము క్షీణము కాఁగా
అభ్రి పతత్సిద్ధాలయముల వలె[5]
మణిమయములు కాంచనజాలమ్ములు
దగ్ధములై సౌధమ్ములు కూలెను
గృహ రక్షణ శక్తి లేక యసురులు
పరువిడి రటు నిటు భయమున నఱచుచు ॥శ్రీ॥

---

**1.** రావణుని 2. గృహము 3. వాయువు కూడికచే **4.** అగ్ని **5.** ఆకాశమునుండి పడుసిద్ధుల గృహములవలె.

## 405

తృణకాష్ఠంబుల[1] ననలము వలె కపి
తృప్తి కనం డిం డ్లెన్ని కాల్చినను
కుంకుమ కింశుక[2] సంకాశములై
ప్రకాశించె ఘోరాగ్ని జ్వాలలు
కపి ఆకృతి నక్కట! యేతెంచెను
కాలాగ్నియె[3] యని కాంతలు వనరుచు
దహ్యమాన సౌధములం గూలిరి
మెఱుపు తీగె లంబరమునుండి[4] వలె ॥శ్రీ॥

## 406

వజ్రియొ,[5] యముఁడో, వాయువొ, వహ్నియొ,
ధనదుఁడొ[6] రుద్రుఁడొ, ఇనుఁడొ, సోముఁడో,
అఖిల పితామహుఁ డైన విధాతృని
రక్షో హరణ కర[7] ప్రకోపమో
అసుర వినాశము నాచరింప ను
త్సాహము గొను వైష్ణవతేజమ్మొ
వానరు రూపున వచ్చె నేమొ యని
దనుజులు తలఁచిరి దగ్ధపురముఁ[8] గని ॥శ్రీ॥

---

1. గడ్డిచే కట్టెలచే 2. మోదుగుపువ్వు 3. ప్రళయాగ్నియే 4. ఆకాశము నుండి 5. ఇంద్రుఁడో 6. కుబేరుఁడో 7. రాక్షసులను హరింపవలెనను గొప్ప కోపమో 8. దహింపబడిన నగరము.

407

సగజరథాశ్వము[1] సపక్ష విహగము
సానోకహ రాక్షసము[2] దగ్ధమై
కపి కినుకను లంకాపుర మంతయు
ఉర్వి కూలె శాపోపహతమ్మై
అయ్యో! తండ్రీ! అయ్యో! కొడుకా!
అయ్యో! మిత్రమ! అయ్యో! జీవితమ
అని రోదించెడి[3] అసురుల సకరుణ
దీన స్వనములు దిక్కుల నిండెను. శ్రీ

408

పాడుచేసి తరువర యుత వనమును
చంపి యుద్ధమున సకలరాక్షసుల
కాల్చి పురము మణి కనక మందిరము
వాలాగ్ర లసద్వహ్ని జ్వాలుఁడు[4]
కపి త్రికూట శృంగాగ్ర భాగమున
అంశుమాలి యగు నాదిత్యునివలె
నలరుచు రాముని నాత్మ తలంచెను
అచ్చెరువడె[6] భూతాళి యతనిఁ గని. శ్రీ

---

1. ఏనుఁగులతో, రథములతో, గుఱ్ఱములతోఁ గూడినది 2. చెట్లతో, రాక్షసులతోఁ గూడినది 3. ఏడ్చెడి 4. తోఁక చివర ప్రకాశించు నగ్ని మంటలు కలవాఁడు 5. సూర్యుని 6. ఆశ్చర్యపడెను.

## 409

అంత హనుమ వాలాగ్ని వారినిధి[1]
నార్పి దగ్ధపుర మంతయు నారసి
అయ్యో! కోపమున ననాలోచితము
చేసితి పురి కాల్చితి నక టకటా!
ధరణిజాత సైతము వహ్నిం బడి
సమసెనొ[2] మూల ధ్వంస మొనర్చితి
అఘ మెయ్యది చేయఁడు క్రుద్ధుం[3] డది
అడఁచు వాఁడు ధన్యుం డని తలఁచెను శ్రీ

## 410

లంకాపురమున లవలేశంబును[4]
కానఁబడ దదగ్ధంబు[5] ప్రదేశము
జనకజయును భస్మంబై యుండును
నా ప్రజ్ఞా హైన్యంబున నకటా !
సాహస వశమున స్వామి కార్యమును
భగ్న మొనర్చితి పాపాత్ముండను
బ్రతికి యుండి లాభము లే దనలము
నందుఁ గొంతు మృతి నని కపి తలఁచెను. శ్రీ

---

1. సముద్రమునందు 2. మరణించెనేమో 3. కుపితుఁడు 4. అత్యల్పమైనను 5. కాల్పఁబడనిది.

411

సీకయె మరణము చెందిన దశరథ
తనయులు వానరుఁడును రవిసుతుఁడును[1]
అసువులు విడిచెద రంత భరతుఁడును
ఇనవంశము నాశనముం బొందెడి
క్రోష దోషమున లోక వినాశము
కావించిన దుష్కర్ముఁడ[2] నైతిని
అని హనుమంతుం డనుకొనుచుండఁగ
కలిగె మరల శుభములు శకునంబులు

412

అంత నతఁడు ధైర్యాంతరంగుఁ డయి
ధర్మాత్ముం డగు దశరథనందను
భార్యను పాతివ్రత్య నిధానము
తాకఁ డగ్ని శిఖి[3] దహించునే శిఖి
రాముని మహిమ ధరాజ పుణ్యమున
కాల్చకుండె నా కాయమె యనలుఁడు
అట్టి యాతఁ డా అమలచరిత్రను
కాల్చునె యని మది కపి తలపోసెను.

---

1. సుగ్రీవుఁడు 2. పాపాత్ముండను 3. అగ్ని.

413

అంత రాక్షస గృహంబులు కాలిచి
సాధించెను దుష్కర కార్యము కపి
దైత్య బాల వనితా[1] వృద్ధాదుల
రోదనముల[2] నద్రులు మారోమ్రోగెడి
భస్మ మయ్యె పుర వరము జనక సుత
దగ్ధముకా లే దద్భుత మియ్యది
అను చారణ వాక్యములు విని హనుమ
స్వయముగ జనకజ కన వని కరిగెను. శ్రీ

## సర్గము 56

414

అక్షత[3] యగు జనకాత్మజఁ గనుఁగొని
హనుమంతుఁడు వందన మొనరించెను
జనకజ యాతని కని వానరవర !
ప్రశస్త మగు నీ బలము సాహసము
ప్రోవఁగ నను నర్హుఁడ వీ వొకఁడవె
లంకను పతి నారాచ[4] సంకులము
నొనరిచి ననుఁ గొను టురు యశస్కరం
బా పని సాధింపవె యని పలికెను. శ్రీ

1. రాక్షసబాలురు, స్త్రీలు, ముదుసలివారు మున్నగువారి 2. ఏడ్పులచే
3. హాని పొందనిది 4. బాణములచే కలఁత నొందినది.

415

అర్థోపహితం[1] బగు నా వాక్యము
విని పవనజుఁ డో జనని! వేగమే
రాఘవుండు హర్యక్ష బలముతో[2]
వచ్చి యోర్చి రావణు తత్సైన్యము
తొలఁగించును నీ దుఃఖ మనుచు నో
దార్చి తిరిగిపోఁ దలఁచి చేసి నతి[3]
స్వామి దర్శన[4] త్వరిత చిత్తుఁడై
అరిష్ట పర్వత మారోహించెను.[5] ॥శ్రీ॥

416

కపి పద ఘట్టన[6] కంపమానమై
భూమిధర మఖిల భూత నినాదము[7]
నాల్గు దెసల నిండఁగ పెను శబ్దము
నానరించుచు క్రుంగెను కుతలమునకు
యక్ష లురగ విద్యాధర కిన్నరు
లతి భయమున మరు దధ్వము[8] చేరిరి
లవణార్ణవమును లంఘించుటకై
కపివతంసుఁ డాకసమున కెగిరెను ॥శ్రీ॥

---

1. అర్థముతోఁ గూడినది 2. వానర సేనతో 3. నమస్కారము 4. ప్రభువును చూచుటయందు త్వరగల చిత్తముగలవాఁడై 5. ఎక్కెను 6. వానరుని పాదముల హతిచే కదలుచున్నదై 7. పర్వతము 8. ఆకాశము.

# సర్గము 57

417

మారుత గతి హనుమంతుఁడు గగనము
దాఁటె నంబునిధి మేటి నౌక[1] వలె
చొచ్చుచు ఘనముల[2] వచ్చుచు బైటికి
కనఁబడె గూ ఢోద్గత చంద్రుని వలె[3]
వినతానందను[4] విధమున నెగురుచు
నరుగుదెంచె సాగర మధ్యమునకు
మైనాకుని ప్రేమను చేఁ దాకుచు
ముందు కరిగె జ్యా ముక్త శరము[5] వలె ‖శ్రీ‖

418

ఎదుట మహేంద్రాద్రిని కని యాతఁడు
సుహృద్దర్శ నోత్సుకుఁడై[6] మదమున
గర్జించెను మేఘము వలె నభమున
ఘన లాంగూలము[7] కదలించెను వడి
విని యా శబ్దము ఘనుఁడు జాంబవం
తుఁడు నిక్కము హనుమంతుఁడె వచ్చెడి
అకృత కార్యుఁ[8] డగు నతని నినాదం
బిట్టు లుండ దని హితులకు తెలిపెను. ‖శ్రీ‖

---

1 ఓడ 2 మేఘములందు 3 ప్రచ్ఛన్నుఁడు పైకివచ్చినవాఁడు నగు చంద్రునివలె 4 గరుడుని 5 వింటినారిచే విడువఁబడిన బాణమువలె 6 మిత్రుని చూచుటయందు కుతూహలము కలవాఁడై 7 పెద్ద తోఁక 8 చేయఁబడని కార్యము గలవాఁడు.

419

అంత కపులు నభమందు[1] దూరమున
హనుమంతునిఁ గని ఆనందంబున
నటు నిటు దుమికిరి అంబరమ్ము వలె[2]
కదలించిరి వృక్షముల శాఖలను
ఇంతలోన హనుమంతుఁడు వ్రాలెను
భిన్న పక్ష[3] మగు క్షితి ధరంబు వలె
ముదమున వానర పుంగవు లాతని
చుట్టు చేరి ప్రస్తుతు లొనరించిరి.

420

హనుమ జాంబవంతునికి వృద్ధులకు
అంగదునికి వినయంబున మ్రొక్కుచు
కంటి సీత లంకాపురి నశోక
వని మధ్యంబున నని వచియించెను
కంటి నన్ను నుడి వింటయె తడవుగ
కపులు కొందఱురు గర్జ లొనర్చిరి
కొంద ఱెత్తి లాంగూలము[4] లఱచిరి
దరిసి[5] కొంద ఱాతని మై[6] తాకిరి.

---

1. ఆకసమున 2. వస్త్రమ్మనువలె 3. భగ్నమైన ఱెక్కలు గల
4. తోఁకలు 5. సమీపించి 6. దేహము

421

అంత నంగదుఁడు హనుమంతునిఁ గని
శరనిధి[1] తరించి తిరిగి వచ్చితివి
నీ మహా ధృతియు[2] స్వామి భక్తియును
సత్త్వ వీర్యము లసామాన్యంబులు[3]
జనకజ కని రాముని వానరులయు
ప్రాణంబులు కాపాడితి వనఘా !
అని నుతించె కపు లందఱు కూడిరి
శిఖరి[4] యపూర్వశ్రీ శోభిల్లెను. ॥శ్రీ

## సర్గము 58

422

అంతట సంతుష్టాంతరంగుఁ డయి
జాంబవంతుఁ డా శ్వసనాత్మజు[5] కని
జనకజ నెట్టులు కనఁ జాలితి వా
సతి యె ట్లున్నది దితిజ మధ్యమున
ఏ విధమున వర్తించు నామె యెడ
కఠినాత్ముఁడు దశకంఠుఁడు తెల్పుము
కార్య నిశ్చయము కావించెద మది
వినిన యనంతర మని పృచ్ఛించెను.[6] ॥శ్రీ

1. సముద్రము 2. గొప్ప ధైర్యమును 3. అసాధారణములు 4. పర్వతము 5. వాయుసూనుని 6. అడిగెను.

## 423

అట్లు నియుక్తుం[1] డై హనుమంతుఁడు
జనకసుతకు నెమ్మనమున మ్రొక్కుచు
దాటి యంబునిధి దశకంఠుని పురి
చేరి యచట చూచిన యొనరించిన
వింతలు పనులు సవి స్తరంబుగా
తెలిపి రాఘవుని తేజంబున దయ
సాటి లేని మీ సద్భావంబున
నిది[2] చేయఁగ నేర్చితి నని పలికెను. శ్రీ

# సర్గము 59

## 424

జనకజ విషయంబున దశరథ రవి
తనయుల యత్నము తప్పక ఫలించు
నామె యాగ్రహము నందిన రావణు
క్షణములోన భస్మము[3] కావించెడి
కాని రాముఁడే కపి సేనలతో
తరలి[4] యతని సంగరమున నోరిచి
తనుఁ గొని రా వలె నని యావని
తామణి కోరెడి నని హనుమ వచించెను శ్రీ

---

1. అడుగఁబడినవాఁడై 2. సముద్రలంఘనాదికార్యమంతయు 3. బూడిద
4. పయనమై వెళ్ళి.

425

ఏ నొకండనే యెల్ల రాక్షసుల
రావణు వధించి రాఁగల రణమున
అస్త్ర శస్త్ర విద్యా విశారదులు
బలవంతులు కపివరు లొక్కొక్కరె
సరావణము[1] రాక్షస బల మంతయు
వధించి రాఁగలవా రసంశయము
కాని యా జనని పూనిక[2] సఫలము
కావలదే యని పావని[3] పలికెను.

426

అశోకవనమం దసుర కామినీ
పరివృతయై[4] యా పరమ పతివ్రత
ఏకవేణిధర శోకపరాయణ
పతిగతమానస క్షితితలశయాన[5]
యయి మరణింపఁగ నాత్మ తలంచుచు
నుండ నెట్టులో యూఱట[6] నమ్మిక
కలుగఁజేసి యిట కరుదెంచితి కా
ర్యము నూహింపుం డని కపి పలికెను.

1. రావణునితోఁ గూడిన 2. యత్నము 3. హనుమంతుఁడు 4. రాక్షస స్త్రీలచే పరివేష్టింపఁబడినదై 5. వట్టి నేలమీద పరుండునది 6. ఓదార్పు.

# సర్గము 60

427

ఆ మాటలు విని అంగదుఁ డందఱి
కని పవనజుఁ డొక్కఁడె లంకాపురి
కాల్చి వచ్చె నిఁక కపి సేనా యుతుఁ
డై యరిగిన చేయని దే ముండును?
బల శౌర్యంబుల ప్లవన విక్రమము[1]
లందెన[2] త్రిజగములందు మన కెవరు
జనకజ కని యామెను గొని పోవక
యరుగుట యనుచిత మగు నని తెలిపెను. శ్రీ

428

వాలి నందనుని[3] వాక్యంబులు విని
జాంబవంతుఁ డుత్సాహ పూర్ణుఁడై
రాజపుత్ర! విక్రమమం దెవ్వరు
మన కెన కా రను మాట యథార్థమె
ఉర్విజఁ గొనిపోకుండ నరుగుటయు
ననుచితమే యైనను రామునిఁ గని
యతఁ డే విధమున నాన తిచ్చునో[4]
అట్లు చేఁత[5] తగు నని వచియించెను. శ్రీ

1. లంఘన పరాక్రమములందు 2. సాటి 3. అంగదుని 4. [illegible]
5. చేయుట.

429

మతిమంతుఁడు జాంబవంతు పలుకులు
విని కపి వీరులు హనుమ త్ప్రముఖులు[1]
రాఘవ దర్శన లాల సాత్ములై[2]
ప్రయాణమై యా పర్వతమును విడి
అర్క తనూజున[3] కతి ప్రియంబై
అతని మాతులుం[4] డగు దధిముఖ కపి
రక్షణమున పరులకు నధృష్యమై
తనరారెడి మధువనమును గాంచిరి

శ్రీ

430

కని యానందమున కపు లంగదు
మధు వానఁగ[6] ననుమతి నర్థింపఁగ[7]
నతఁడు హృదయమున హర్షము ప్రీతియు
మీఱఁగ నంగీకార మొసంగెను
అంతట కపివరు లమిలోత్సాహులు
కొందఱు గానము కొందఱు నాట్యము
కొందఱు హాసము కొందఱు ఖేలన[8]
మొనరించుచు మధువనమును జొచ్చిరి

శ్రీ

---

1 హనుమంతుఁడు మొదలైనవారు 2 రాముని చూచుటయం దాస క్తమైన చిత్తములు కలవారై 3 సుగ్రీవునకు 4 మేనమామ 5 ముట్టడింప రానిదై 6 త్రాగుటకు 6 కోరఁగా 8 క్రీడనము.

481

తరువునుండి యొకఁ డుఱుక వే ఱొకఁడు
క్రిందినుండి పై కెగిరి కొమ్మలకు
ఒకఁడు నవ్వ వే ఱొక్కఁడు రోదన[1]
మును నటించు చాతనిపైఁ బడియెను
ఒకఁ డొక్కని త్రోయుచు నుండఁగ వే
ఱొకఁ డాతని మీదికి లంఘించెను[2]
తేనెలు తృప్తిగ నాని కపివరులు
వింత పనులు కావించిరి మదమున



482

మధు ప్రపా నోన్మత్తులు[3] వానరు
లేడ్చుచు నెగురుచు నిలబడి దొర్లుచు
పం డ్లికిలించుచు పటపట కొఱుకుచు
పాదప శాఖలు[4] భగ్న మొనర్చిరి
పిందెలు కోసిరి విసరిరి ఫలములు
పూవులు రాల్చిరి మొగ్గలు త్రుంచిరి
అడ్డ మాక[5] లే కటు నిటు తిరుగుచు
యథాభిలాష[6] విహారము చేసిరి



1 ఏడుపు 2 దుమికెను 3 తేనెలు త్రాగుటచే మత్తిల్లినవారు 4 చెట్ల కొమ్మలు 5 నిషేధము 6 ఇచ్చవచ్చినట్లు.

## 483

వనరక్షకుఁ[1] డగు వానర నాథుఁడు
దధిముఖుఁ డద్ధ్వయంతయు కని కనలుచు[2]
పరుషోక్తుల కొందఱ నదలించెను[3]
తరువులతో కొందఱ ప్రహరించెను[4]
కపివర్యులు లక్ష్యం బొనరింపక
చుట్టుముట్టి యా శూర వానరుని
కతమ్ముఁల గొట్టుచు కఱచుచు తన్నుచు
కలఁచుచు పలు భంగుల బాధించిరి శ్రీ

## 484

అంగదుండు పవనాత్మజుఁ[5] డేమియు
వారింపక కపివరుల యథేచ్ఛగ
తేనె లానుఁ డని యాన లిచ్చి రా[6]
వనచరు లుద్ధతి[7] చని భూజములకు
ప్రాగిరి తేనెలు తనివి తీరఁగా
తెట్టెలు విసరిరి తినిరి ఫలంబులు
మొత్తిరి లతలను మహీరుహంబుల
బహువిధముల విధ్వంసము చేసిరి. శ్రీ

---

1. మధువనరక్షకుఁడగువాఁడు 2. కోపించుచు 3. బెదరించెను 4. కొట్టెను 5. హనుమంతుఁడు 6. గర్వముతో 7. చెట్లు.

485

మధువన పాలురు దధిముఖు నానతి
నేగుదెంచి వారించిరి కపులను
కపులు వారి వృక్షంబులు విసరుచు
నఖముల[1] గీఱుచు నానావిధముల
బాధింపఁగ నోర్వఁగఁజాలక వా
రేగి దధిముఖున కెఱిఁగించిరి వెత[2]
అంత నతఁడు తన యనుచర తతితో[3]
తరుచర వీరుల[4] తాకఁగ వచ్చెను,

486

వానరులకు వనపాల భటులకు
శాఖల తరువుల సాగెను యుద్ధము
హనుమ దాదు లా వనపాలకులను
బాధించిరి పయి భంగుల మత్తిలి
తన్ను తలపడిన[5] దధిముఖు నంగదుఁ
డనుఁగు తాత[6] యని యాలోచింపక
భువి పడఁద్రోయుచు మోదగఁ[7] నాతఁడు
మూల్గుచు వేదన మూర్ఛ మునింగెను.

---

1. గోళ్ళతో 2. బాధ 3. సేవక సమూహముతో 4. వానర వీరుల
5. ఎదుర్కొనిన 6. ప్రియుఁడైన తాత 7. కొట్టఁగా

కొంత వడికి నా కిష్కింధ తేరుకొని
దధిముఖుఁ డుద్ధత తరుచర వీరుల[1]
వారించు టసంభవ[2] మని తలఁచుచు
ననుచర వర్గం బనుసరింపఁగా
సుగ్రీవుని కా యుగ్ర వానరుల
ధౌర్త్యంబును[3] దుర్మత[4] తెలుపుటకు
నరిగి యతని పాదాబ్జంబులపై
వ్రాలి లేచి విహ్వలుఁడై[5] నిలిచెను. శ్రీ

438

దధిముఖునకు సాంత్వనవాక్యంబుల[6]
నభయ మిచ్చి సూర్యసుతుఁడు మాతులా![7]
వనము కుశలమే యని యడుగఁగ నతఁ
డలికభాగమున[8] నంజలి ఘటించి
దేవ! నీజనకుఁ డా వాలియు నీ
వధి కాదరమున నభిరక్షించిన
వనము కపులు విధ్వంసము చేసియు
మదమున నడిచిరి[9] మ మ్మని తెలిపెను. శ్రీ

---

1. గర్వించిన వానర వీరులను 2. అసాధ్యము 3. ధూర్తత్వము
4. దమింప శక్యముకాని తనము 5. కలఁత నొంది 6. ఓదార్పుమాటలతో
7. మామా 8. ఫాలభాగమున 9. కొట్టిరి.

## 439

అది విని లక్ష్మణుఁ దర్కజు[1] నీ కపి
ఎవ్వ రేమి వచియించు దుఃఖితుఁడు
అని యడుగఁగ రవితనయుం డీతఁడు
దధిము ఖాభిధుఁడు మధువనపాలుఁడు
యామ్య దిశకు[2] జనకాత్మజ వెదకఁగ
నరిగిన వాలిసుతాది వానరులు[3]
వనము చెఱిచి మధు వాని కాపరుల
నడిచినార లట యని వివరించిను.

## 440

వారు జనకసుత నారసి యుందురు
హనుమంతుఁడు సర్వార్థసాధకుఁడు[4]
జాంబవంతుఁ డా శ్వసన తనూజుఁడు
నంగదుఁ డెట నాయకులై యుందురొ
అట తప్పక కార్యము సిద్ధించును
పని చక్కఁగ నిర్వహింప కుండిన
వన మిట్టులు విధ్వంస మొనర్తురె
పాన[5] లేల యని పలికె రవిసుతుఁడు.

---

1. సుగ్రీవుని 2. దక్షిణ దిక్కునకు 3.అంగదాదులగు వానరులు 4. అన్ని కార్యములను సాధించువాఁడు 5. సందేహ మెందులకు.

441

సుగ్రీవముఖ చ్యుత వాక్యంబులు
విని దాశరథులు[1] మనమున పొంగిరి
దధిముఖు నారసి తరణి తనూజుఁడు[2]
మన వారలు వని మధువుల నానుట
క్షమియించితి కృతకార్యులు[3] ముదమున
చేసిన పని హర్షింపఁగవలయును
వారలఁ గన సంభ్రమించు[4] హృదయము
పోయి వేగ పంపుమ యని పలికెను, ॥శ్రీ॥

442

దధిముఖుఁ డంతట దశరథసుతులకు
మ్రొక్కి సత్వరమ పోయి వనమునకు
అంగదుఁ గని తల నంజలి ఘటించి
ప్రభునందన! అపరాధుల[5] కావుము
ఎఱుఁగక మిము వారించితి మీ వని
అరిగి రవిసుతున కంతయు తెల్పఁగ
హర్ష మంది మి మ్మందఱ వెస ర
మ్మని యానతిచ్చె నని వచియించెను. ॥శ్రీ॥

---

1, రామలక్ష్మణులు 2. సుగ్రీవుఁడు 3. చేయఁబడిన పని కలవారు
4. తొందరపడుచున్న 5. దోషులను.

443

అంగదుఁ డా వాక్యమ్ములు విని పని
సాధించియు నిట జా[1] గొనరించుట
తగదు పితృవ్యుఁడు[2] తరణి తనూజుం
డున్న చోటికే క్రన్నన[3] పోదము
యువరాజత్వం బున్నను కార్యము
చేసిన మిము శాసించు టనుచితము[4]
కర్తవ్యం బెఱుఁగంగఁ జెప్పఁ దది
కావింతము వేగమ యని పలికెను. శ్రీ

444

వాలి తనూజుని వచనంబులు విని
హర్ష చిత్తులై హరివరు[5] లందఱు
ప్రభు లయ్యును నీ వడువున[6] పల్కెడు
రెవ రిల నది నీ కే తగియున్నది
పోవుద మా సుగ్రీవుని సన్నిధి
కిప్పుడ యనిరి సరే యనె నతఁడును
యంత్రోత్క్షిప్తము[7] లగు గిరు లట్టులు
వార లంత నభమ్మున[8] కెగిరిరి. శ్రీ

---

1. ఆలస్యము 2. పినతండ్రి 3. వేగమే 4. ఆజ్ఞాపించుట తగదు
5. వానరవరులు 6. విధమున 7. యంత్రముచే త్రోయఁబడిన
8. ఆకసమునకు.

445

కపివీరుల ఆగమనముకొఱకై[1]
ప్రతీక్షించు[2] రఘుపతిఁ గని రవిజుఁడు
కనక జనకజను గడువు మీఱ కపు
లరుగుదెంచు సాహస మొనరింపరు
పితృపైతామహ[3] మతిప్రియం బగు
వనము నట్లు విధ్వంసము చేయరు
కని యుందురు జనకాత్మజ నిప్పుడె
వినఁగల మా శుభ మని యోదార్చెను. శ్రీ

446

హనుమంతుఁడె ఆమెను కని యుండును
అతనియందె కార్యము సాధించెడి
ధీసంపద[4] సిద్ధియు వ్యవసాయము[5]
బలము వీర్యమును కల వపారముగ[6]
జాంబవ దంగద సాహాయ్యంబున
పని యతఁ డేదైనను సాధించును
శోకము విడువుము శుభ ప్రవృత్తిని[7]
వినఁగల మని రవితనయుఁడు పలికెను. శ్రీ

---

1. [illegible] 2. ఎదురుచూచు 3. తండ్రి తాతలకు సంబంధించిన
4. బుద్ధిసంపద 5. ప్రయత్నము 6. అనంతముగ 7. మంగళకర వార్తను

447

అంతలోన నభమందు వినఁబడెను
కపివీరుల యాగమన నిస్వనము[1]
కనుచుండనె యంగద పురస్సరులు
వానరు లచ్చట వ్రాలిరి మదమున
హనుమ రామునికి నంజలించి నియ
తాక్షత[2] జనకాత్మజ నెఱిఁగించెను
రామలక్ష్మణులు రవిసుతుఁ డాతని
వీక్షించిరి సంప్రీతి బహూకృతి[3] శ్రీ

448

అవనిజ అక్షత[4] యని విని రాముఁడు
విస్మృత విరహజ వేదనార్తి యై[5]
ఎట్లున్నది సతి? యెట్లు నాయెడలం
వర్తిల్లెడి తెలుపవె యని యడిగెను
అంత హనుమ యామ్యాననుఁడై[6]
మ్రొక్కి మనంబున భూమి తనయకు
తోయధి దాటుటఁ దొట్టి[7] లంకలో
ధరణిజ చూచిన వఱ కెఱిఁగించెను. శ్రీ

---

1. వచ్చు శబ్దము 2. నియమముతోఁ గూడినది హాని పొందనిది [illegible]రవముతో 4. హాని పొందనిది 5. మఱవఁబడిన విరహవేదనలని [illegible] కలవాఁడై 6. దక్షిణ దిక్కునకు త్రిప్పిన మొగము కలవాఁడై 7. మొదలుకొని.

449

రామ? జనని ఖల రాక్ష సాంగనా
తర్జ్యమానయై[1] తలంచుచు నినె మది
నిలిపి యాశ లన్నియు నీ యందే
ఏక వేణియై[2] శోక మగ్నయై
ఇలాశయ్యయై హి మాగమంబున[3]
పద్మిని[4] వోలె వివర్ణత నున్నది
పలికి స్వాంత్వనంబులు[5] విశ్వాసము న
మరిచి వచ్చితి నని కపి పలికెను.

450

ఇంక నొక్క నెలయే జీవించెద
రామచంద్ర దర్శన లాలసనై
వ్రతము పూని భావమునం దతనినె
తలంచుచు కాలము తరలించెద[6] నని
అలిక భాగమున[7] తిలకము[8] చెదరంగ
మణిసిలతో నీ వునుచుట తెల్పెను
ఈ చూడామణి నిచ్చె నింద[9] మని
హనుమంతుడు రామునికందిచ్చెను. ॥ శ్రీ

1. బెదరింపబడుచున్నదై 2. ఒకటే జడ కలదై (జడ కట్టిన కేశములు కలదై) 3. హేమంత ఋతువు రాకచే 4. పద్మలత 5. ఓదార్పు మాటలు 6. పుచ్చెదను 7. నుదుట 8. బొట్టు 9. ఇదిగో కొనుము.

451

రాముఁ డంత చూడామణి హృదిపై
నుంచి బాష్పముల నోడ్చుచు రవిసుత !
కాంచి వత్సమును[1] కన్న గోవు వలె
ఈ చూడామణి నీక్షింపఁగనే
ఎద నాయది స్రవియించుచు[2] నున్నది
దీనిని జనకుఁడు దేవి కొసంగెను
పెండ్లి వేళ శోభిల్లె నధికముగ
నాసతి తల నిద యని వచియించెను.

## సర్గము 66

452

అంబుసముద్భవ[3] మార్య పూజితము
నీ మణి జనకుని కిచ్చె శతమఖుఁడు[4]
దేవి శిరమునందే ఇది యొప్పెడి
కన నిది యామెనె కన్నట్లున్నది
శ్వశురుఁడు[5] జనకక్ష్మా పాలుండును
దశరథ భూమితల పతి తండ్రియు
కనుల ముందు సాక్షాత్కరింత్రు దీ
నిని కన్నంతనె యని వచియించెను.

శ్రీ

1. దూడను 2. ద్రవించుచున్నది 3. జలమందు పుట్టినది 4. ఇంద్రుఁడు
5. మామ.

453

అంత నతఁడు హనుమంతుని కనుఁగొని
ఇలాతనూభవ[1] యేమి చెప్పినది?
మరల మరల నా కెఱిఁగింపవె దా
హార్తున కంబువు లర్పించెడి క్రియ[2]
సతి యెట్లున్నది? దితిజ మధ్యమున
నామె లేక క్షణ మైన నేను మన[3]
నామె యెచట నున్నదో యచటికి నను
వేగమ కొనిపోవే యని పలికెను.

## సర్గము 67

454

ఆ మాటలు విని హనుమంతుఁడు భూ
తనయ యశోకంబున[4] పడు పాట్లును
దనుజ కామినుల తర్జనంబులును[5]
ఆమె ఆర్తి యసహాయ దుస్థితియు
చిత్రకూటగిరి చేరి యున్న తఱి
జరిగిన కాకాసురు వృత్తాంతము
తా నేతెంచెడు తఱి దీనముగా
పలికిన పలుకులు తెలిపె విశదముగ. ॥శ్రీ

1. సీత 1. దప్పికలవానికి నీరిచ్చు విధమున 3. జీవింపను 4. అశోక వనమున 5. బెదరింపులు.

455

## సర్గము 68

రాముఁడు రావణు రణమున వధించి
ననుఁ గొనిపోయెడు న ట్లొనరింపుము
అది యా వీరు పరాక్రమంబునకు
ప్రతిష్ఠకును నను వై[1] యలరారును
నిరుపమ బలుఁడవు నీ వొకండవే
దాశరథుల కపి దళము నిచ్చటికిఁ
గొనితే దక్షుఁడ[2] వని సతి పలికిన
దని పావని[3] రామున కెఱిఁగించెను.

456

జనని! వానరేశ్వరుఁడు[4] రవిసుతుఁడు
నిను బ్రోవఁగఁ గైకొనె నిశ్చయమును
అద్వితీయ బలు లగు వానరవరు
లాతని యానతి ననువ ర్తింతురు[5]
దేవి! నీకు కపి ధీరుల శౌర్యము
తెలియదు వారికి కలదె దుష్కరము[6]
వారలు లంకకు వత్తురు వేగమె
యని యోదార్చితి నని కపిపలికెను. ॥శ్రీ

1. తగినదై 2. సమర్థుఁడవు 3. హనుమంతుఁడు 4. కపిరాజైన సుగ్రీవుఁడు 5. అనుసరింతురు 6. చేయశక్యము కానిది.

## 457

దశరథ తనయుల ధను ర్నినాదము[1]
కపిజాలముల కేకలు గర్జనములు
దితిజ సంతతుల[2] దీన రోదనము
లమ్మ! వినదు వికక ఉమ్మలింపకుము[3]
అయోధ్యలో రామావని వరు ప
ట్టాభిషేక మహా[4] మానందముతో
అరయుదు వని యూరార్చితి[5] జననియు[6]
నాశ్వాసిల్లె నని హనుమ వచించెను,

## 458

హనుమ వాక్యములు విని శ్రీరాముఁడు
నయనద్వయి[7] నానంద బాష్పములు
జాలువార[8] కపిసత్తము నారసి
మారుతి! నీ ఋణభారము నెట్టులు
తీర్పఁజాలుదును దేవి కుశలమును
తెల్పి యసువులను నిల్పితి వనఘా!
అని కృతజ్ఞతయు నాదృతి[9] మీఱఁగ
కదిసి[10] యతని బిగి కౌఁగిటఁ జేర్చెను. ॥శ్రీ

1. వింట్ల ధనులు 2. రాక్షస సమూహముల 3. దుఃఖింపకుము 4. ఉత్స వము 5. ఊర్జాచ్చితిని 6. సీతయు 7. రెండు కన్నుల 8. ప్రవహింపఁగా 9. ఆదరము 10. సమీపించి.

## ఫ ల శ్రు తి

శ్రీ వాల్మీకి మునీంద్రులు వ్రాసిన
సుందర కవితా శోభమాన మగు
సుందర కాండము నందలి కథ యిది,
అందలరెడి గాయత్రి వర్ణములు[1]
చెదరకుండ వ్రాసితి నిది దీనిని
చదివిన వ్రాసిన సకలశుభము లగు
స్వస్తి[2] యగుత శాశ్వతముగ జగతికి
స్వస్తి యగుత జన సందోహమునకు[3]

## మ ం గ ళ మ్

460

కోసల కన్యాకుమారునకు[4] మహ
నీయ[5] గుణాకరునికి మంగళమగు
భ్రాతృ భక్తి[6] సేవధి లక్ష్మణునకు
ధరణిజకు సీతకు మంగళమగు
రామాయణమాలారత్నమునకు
దశరథసుత దూతకు[7] మంగళమగు
మనుజాకృతి[8] దేవునికి సత్యసా
యికి నీ కృతిభర్తకు మంగళమగు. శ్రీ

---

1. అక్షరములు 2. మంగళము 3. జనసమూహమునకు 4. కౌసల్యా సుతునకు 5. పూజనీయములైన గుణములకు గనియైన వానికి 6. సోదర భక్తినిధికి 7. రాముని దూతయైన హనుమంతునికి 8. మనుష్యాకారముతో నున్న భగవంతునికి

శ్లో॥ మంగళం రామభక్తాయ
మంగళం వాయుసూనవే
మంగళం కపివర్యాయ
ఆంజనేయాయ మంగళమ్